CI



# సినీ నాటక చరిత్రకు సాక్షి మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

ప్రజా కళాకారుడు, ప్రసిద్ధ నటుడు మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి మృతి పట్ల సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యవర్గం ప్రగాఢ సంతాపం వ్యక్తం చేసింది. ఈ మేరకు సంస్థ రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి ఒక ప్రకటనలో పేర్కొన్నారు. ప్రజా నాట్యమండలి నటుడిగా, ప్రయోక్తగా ప్రస్థానం ప్రారంభించిన మిక్కిలినేని వీర తెలంగాణా సాయుధ పోరాట ప్రతిబింబమైన 'మా భూమి' నాటక నాయకుడిగా భార్య సీతారత్నంతో సహా నటించి ఉర్రూతలూపారని, నాటి ప్రజా కళా సైనికుడుగా అనేక నిర్బంధాలు ఎదుర్కోవడమే గాక స్వాతంత్ర్య పోరాటంలోనూ, కమ్యూనిస్టు ఉద్యమంలోనూ త్యాగాలు చేశారని కొనియాడారు. తెలుగు నాటక రంగం, జానపద కళలు, చిత్రరంగం, నటరత్నాలు తదితర అంశాలతో ప్రామాణిక గ్రంథాలు వెలువరించి పురస్కారాలు పొందారని అన్నారు. చివరి వరకూ అభ్యుదయ ఉద్యమాలకు చేరువగా మెలుగుతూ కొత్త తరం కళాకారులను ప్రోత్సహిస్తూ వచ్చిన మిక్కిలినేని మరణంతో తెలుగు కళా చరిత్రకు సుదీర్ఘ సాక్షి అనదగిన నటుడు కనుమరుగైనారని ఆవేదన వ్యక్తం చేశారు.

# ముళ్లపూడి వెంకటరమణ



ముళ్లపూడి వెంకట రమణ తెలుగు సాహిత్య సినీ రంగాలలో ఆరోగ్యకరమైన అభిరుచులకు, మానవీయ విలువలకు మారుపేరుగా నిలిచారు. ఈ నెల 24వ తేదీన తన 80వ ఏట కన్నుమూసిన ముళ్లపూడి తెలుగు భాష విరుపూ, మెరుపూ బాగా తెలిసిన మనిషి. దాదాపు అరవై ఏళ్ళకు పై బడిన తన రచనా వ్యాసంగంలో ఆయన అనేకానేక ప్రయోగాలు చేశారు. హాస్యానికి భాష్యం చెప్పారు. సమస్యల మధ్యనే సగటు మనిషి జీవితంలో సరదాలను ఆవిష్కరించారు. ఆయన సృష్టించిన బుడుగు, రెండు జెళ్ళ సీత, పక్కింటి పిన్నిగారు, తీసేసిన తాశీల్దారు, అప్పుల అప్పారావు వగైరా పాత్రలు సజీవంగా నిలిచిపోయాయి. బుడుగు కొన్ని తరాల పాఠకులను అలరిస్తూనే వున్నాడు.

తూర్పుగోదావరిజిల్లా ధవళేశ్వరంలో పుట్టిన ముళ్లపూడి వెంకటరావు (రమణ) కష్టాల మధ్యనే చదువుకుంటూ పాఠశాల దశలోనే ఉదయభాను అనే లిఖిత పత్రిక ప్రారంభించారు. అప్పట్లో చిత్రకారుడుగా పరిచయమైన బాపు జీవిత పర్యంతం సృజనాత్మక నేస్తంగా తోడు నిలిచాడు. ఈ జంట తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగాలలో వెండి వెన్నెలలు కురిపించింది. వ్యంగ్య వైభవం చిలికించింది. రాజకీయ భేతాళ పంచవంశతిక వంటి కథలతో అప్పట్లోనే రాజకీయ అవినీతిని ఎండగట్టిన కలం ముళ్లపూడిది. మధ్యతరగతి మనుషుల జీవితాల్లోని ఆర్ద్రతకు, ఆవేదనకు ఆయన అక్షర రూపమిచ్చారు. బాపు - రమణ ద్వయం అందించిన చిత్రాలలో కుటుంబ సమేతంగా చూడగల సున్నితమైన హాస్యం, సామాజిక వ్యంగ్యం వుంటాయి. ముత్యాలముగ్గులో కాంట్రాక్టరు పాత్ర వంటి వాటితో సమాజంలో పెరుగుతున్న వికృత ధోరణులను విశదపర్చారు. పౌరాణిక చిత్రాలను కూడా కళాత్మక స్పర్శతో రూపొందించారు. ఎప్పుడూ కొత్త కళాకారులను, కలాలను ప్రోత్సహిస్తూ వచ్చారు. సంప్రదాయ ముద్ర వున్న తిరోగమన వాదాన్ని ఆదరించకపోవడం ఆయన ప్రత్యేకత. ఆర్.కె. నారాయణ్ తరహాలో కొన్ని విషయాల్లో ఆయన కన్నా మిన్నగా జీవితాన్ని ప్రతిబింబించిన ముళ్లపూడి మృతి పట్ల సాహితీ స్రవంతి ప్రగాఢ సంతాపం తెలియజేస్తుంది.

PRSVM02A125

సాహిత్య ప్రస్థానం
మార్చి 2011
సంపుటి : 11 సంచిక : 63

# భాషా సంస్కృతుల నిరాదరణ

షరా మామూలుగా ఈ ఏడాది బడ్జెట్లో తెలుగు భాషా సాహిత్య సంస్కృతులకు కేటాయింపుల్లో నిర్లక్ష్యమే మిగిలింది. కొన్నేళ్ళుగా లక్ష కోట్ల బడ్జెట్ అంటున్నా అందులో సాహిత్య వికాసానికి, సాంస్కృతిక రంగానికి కేటాయింపులు, శ్రద్ధాసక్తులు కూడా నామమాత్రంగా కొనసాగుతున్నాయి. ప్రాచీన భాష హోదా కోసం జరిపిన పోరాటం వల్ల కలిగిన ప్రయోజనాలు వాస్తవ రూపం దాల్చాయా అన్నది సందేహాస్పదంగానే వుంది. కేంద్రం నుంచి రావలసిన గుర్తింపు, తోడ్పాటు అది. కాని ఇక్కడ మన రాష్ట్ర పరిధిలో మనం భాషా సాంస్కృతిక పురోగమనానికి చేయవలసింది చేస్తున్నామా? ఉదాహరణకు ఈ ఏడాది బడ్జెట్లో సాంస్కృతిక శాఖకు ప్రత్యేక కేటాయింపు 11 కోట్ల రూపాయలు. ఇందులో జీతభత్యాలు, నిర్వహణ ఖర్చులు కనీసంగా ఇచ్చినా మిగిలేదెంత? దాంతో కళారంగాన్ని ప్రోత్సహించేదెంత? రాష్ట్రంలో ప్రాంతీయ వివాదాలు నడుస్తున్న స్థితిలో సంయమనం వహించడం ఎంతైనా ప్రయోజనకరం. తెలుగు ఉపాధ్యాయులకు నియామకాలు లేవు. తెలుగు మీడియం బడులకు బతికే పరిస్థితి వుండనివ్వడం లేదు. చెప్పేవారు లేకున్నా ఇంగ్లీషు మీడియం అరకొరగా ప్రవేశపెట్టి అటు చదువును ఇటు భాషను కూడా దెబ్బతీస్తున్నారు. అలాగే ప్రచురణ వ్యయం పంపిణీ ప్రయాసలు వున్నా రచనా వ్యాసంగం కొనసాగిస్తున్న తెలుగు రచయితలకు చేయూత నిచ్చి మంచి పుస్తకాలు అందుబాటులో వుంచాల్సిన బాధ్యత వుంది. గతంలో వచ్చిన ప్రామాణిక తెలుగు గ్రంథాలను విరివిగా ప్రచురించి అందజేయవలసిన అవసరమూ వుంది. కష్టనష్టాలతో పుస్తకాలు వేసుకుంటే గ్రంథాలయాల ద్వారా వాటిని మరింతగా కొని ఉత్తమాభిరుచికి ఊపిరి పోయవలసిన అగత్యమూ వుంది. ఇందులో ఏ ఒక్క పని ఏ కాస్త చేయాలన్నా ఇప్పుడు చూపిస్తున్న కేటాయింపులు వెక్కిరిస్తాయి. ఇందులో నిర్వహణ వ్యయాలు పోగా, సద్వినియోగం అయ్యేది మరింత తగ్గిపోతుంది. బడ్జెట్పై చర్చ సందర్భంలో ఈ అంశాన్ని తప్పక పునఃపరిశీలించాలి.

బొమ్మలు : శివాజీ, వెంకటేష్, రవి



## ఈ సంచికలో...

సుడిగాడు (కథ) ........ 2
కవితలు ........ 9
ప్రపంచ సాహిత్యపు కొన్ని పుటలు ........ 10
కవితలు ........ 13
మీరెందుకు చచ్చిపోయారు! (కథ) ........ 14
కవితలు ........ 21
ఆధునిక ఇటలీ కవులు
డినో కంపానా ........ 22
మజిలీ (అనువాద కథ) ........ 24
బోయి భీమన్న సామాజిక స్వప్నం ........ 27
'అవిశ్రాంతం'లో అంతరంగ దర్శనం ........ 32
పశ్చిమాసియాలో ప్రజాస్వామ్య కుసుమాలు ........ 34
కొత్త పుస్తకాలు ........ 36
కవితలు ........ 38
వెలుగునిచ్చే దీపం సాహిత్యం (నివేదిక) ........ 39
మహోదయం తర్వాత మంచి గ్రంథం (నివేదిక) .... 40
డైరీ ........ 42



చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ఫ్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in

కథ

# సుడిగాడు

- ఎస్. మునిసుందరం



సిన్నోడు చెబుతున్నాడు.

కలెక్టర్ రామమూర్తి మంచి శ్రోతలా వింటున్నాడు.

రామమూర్తి స్నేహితుడు రాజయ్య 'ఇది మామూలే' అన్న ధోరణిలో వింటున్నాడు.

"ఆదేరం సార్.

తెల్లారి తొమ్మిది గంటలకాడ నేనూ మా తాత నారయ్య సింకేసిరి సెట్టు కింద కూకోనుండాము. గ్రామంలో పెద్ద రైతు తిమ్మప్ప జీపు వాడ వైపు వస్తా వుండాది. జీబు వచ్చేది సూసి నేనూ మా తాత లేసి నిలబడినాం."

"ఏం నారయ్యా! బాగుండావా?" జీబులోంచి దిగతా తిమ్మప్ప అడిగాడు.

"బాగుండా సామీ! దండం బెడతా ఆయన దగ్గరకెళ్ళాడు. నేను కొంచెం ఎనక్కి ఎల్లి నిల్సున్నా."

"తిమ్మప్పతో ఏం మాట్టాడినాడు మీ తాత" అడిగాడు కలెక్టర్.

"సెప్తా సార్..."

సిన్నోడు చెప్పడం ప్రారంభించాడు.

"ఏంది సామీ! దారి తప్పి మావాడకొచ్చారు" మా తాత అడిగాడు.

"దారి తప్పింది నేను కాదురా. సొట్టకొయ్యలయ్యింది మీరు. ఎన్నేళ్ళయిందిరా మాతమ్మ కొలుపు చేసి మీ వాడలో.." తప్పుజేశారు అన్నట్టు అడిగాడు తిమ్మప్ప.

"ఏం జేసేదయ్యా సంపాయించింది కూటికే సరిపోతావుండాది. ఇంక కొలుపేడజేసేది. అదేం అంతా యింతా పనా. దుడ్డు మస్తుగా కావాల" అన్నాడు మా తాత.

"మీకేంరా. రామప్ప దొర వుండాడుగదా!"

"ఆయన కిట్టాంటివి నచ్చవుగద దేవరా! డబ్బుదండగరా అంటాడు. అందుకే మేమూ నోరు మూస్కుని వుండాము."

"ఆ కుశాల వస్తుందంట్రా. మీ పిల్లా పాపను కాపాడలిగదా ఆ తల్లి. ఎవురికో ఇష్టంలేదని మీ కుల దేవతను మర్చిపోతారా? అపచారంగదా!" అన్నాడు తిమ్మప్ప.

నోట్లో నీళ్ళూరుతున్నాయ్ మా తాతకు. కొలుపంటే.. అదే... వారం రోజులు కైపు దిగేదిల్యా. కాని... 'రాసి పెట్టి వుండాలిగద సామీ' అన్నాడు మా తాత...

"ఒకదేందిరా రాసేది. నేను రాస్తా సూడు. ఇదో ఐదువేలు. కొలుపు చేయండి. వారం ముందునుంచే ఎవుడికీ కైపు దిగ్గాదదు. సరేనా?" ఉత్సాహపరుస్తూ తిమ్మప్ప అన్నాడు.

"ఈ ఐదేలతో ఏమొస్తాది దొరా! ఒక్క ఇరవై ఏలయినా కావాల కొలుపు పూర్తిగావాలంటే. ఒకటా రెండా ఏడ్రోజుల పండగ గద సామీ."

"డబ్బుకేడస్తావేందిరా ఎర్రోడా! ఇరవైగాని ముప్పయ్‌గాని ఆఖరికి యాభై వేలు గాని ఖర్చు నేను పెట్టుకుంటా. కొలుపు మాత్రం హైక్లాసుగా చేయాల. ఏమంటావ్?" అన్నాడు తిమ్మప్ప.

అప్పటికే వాడ జనం కొందరు పోగయ్యారు అక్కడ.

అందరిలోనూ ఆశ్చర్యం. ఆనందం. తిమ్మప్ప మాటలకు ఉబ్బితబ్బిబ్బవుతున్నారు.

"ఇంకేమంటాను 'సై' అంటాను. ఒరేయ్ పోలిగా! అరిచాడు మా తాత.

"మాదీ నీ మాటే" అన్నారు అక్కడున్న వాళ్ళంతా.

"మీ కుల దేవతను అట్లా వొదిలేస్తే ఆ తల్లికి కోపం రాదంట్రా. ఆయమ్మ ఒక్క వురుము వురిమిందంటే మీ వాడ మిగలతాదంట్రా. ఎవుడికో ఇష్టం లేదని తాత ముత్తాతల నుండి కొలిచే మాతమ్మను వొదులుకుంటార్రా?"

పెద్ద రైతుల మాటలు మా వాళ్ళకు పిప్పర మెటాయిల్లా వున్నాయి.

"సత్తెం పలికినావు దొరా! నీ మాట జవదాటము. నువ్వు సెప్పినట్టే జరిపిత్తాం మాతమ్మ కొలుపు" గుంపులోంచి ఎల్లయ్య గొంతు వినిపించింది.

"సరే. రేపు రండి. డబ్బిస్తా. సుట్టు పక్కలోళ్ళు బిత్తరపోయేలా కొలుపు చేయండి. ఖర్చు నాది. ఒక్కడికీ కైపు దిగకూడదు. నా దగ్గిర నల్ల బెల్లం కావాల్సినంత వుంది. పది మూటలు తెచ్చుకుని సారా కాసు కోండి. కొనాలంటే మాటలా.." అన్నాడు తిమ్మప్ప.



"దెర్మ పెబువులు. తమర్లాంటోళ్ళు నలుగురుంటే సాలు. మా వాడ సల్లంగా వుంటాది." గుంపంతా దణ్ణాలు పెడతా అనింది. నేనూ దణ్ణం పెట్నా.

"తిమ్మప్పసారు మళ్ళీ ఇట్టా అన్నాడు సార్.'

"భయం భక్తి వుండాల్రా, తాగాల, తినాల, తిర్నాల సేయాల. మీకేం భయ మక్కర్లా. మీ వెనకాలే నేనుంటా. సరేనా!"

"అట్నేసామీ! అట్నే. మీ దయ..." అన్నారు అందరూ.

సిగరెట్టు అంటించుకుని జీబులో కూచున్నాడు తిమ్మప్పసారు. "ఒరేయ్ నారయ్యా! వాడకంతా నువ్వేగదా పెద్దోడివి. రేపొచ్చి డబ్బు తీస్కపో, ఊ.. పోనీరా జీబు.

... ... ...

జీబులో కూచున్న తిమ్మప్ప అసహనంగా ఉన్నాడు. రామప్ప చెరువులో పదెకరాలు పట్టా వేసుకున్నప్పటి నుండి అతడికి నిద్ర పట్టడం లేదు. తానేం తక్కువ తిన్నాడా? కాలవ పక్కన పోరంబోకును తన భూమిలో కలుపుకునే వరకూ నిద్రపోకూడదనుకున్నాడు. ఆ ప్రయత్నంలో మొదటి అడుగు ఇది.

ఆయన జీపు కొండ కింద సేను వైపు దూసుకుపోయింది.

ఇంక వాడలో సూడాల. తిమ్మప్పను ఆకాశానికెత్తేసారు.

"కొలుపుకు పది రోజులు ముందరే గుడిసెకో సారా బట్టీ పొగలు కక్కసాగింది. వారం తిరక్కుండానే వాడ సారా మత్తులో మునిగిపోయింది సార్."

"మంగళవారం రాత్రి పన్నెండు గంటలకి కొలుపు సాటింపు. ముందురోజే వీధుల్ని శుభ్రంగా ఊడ్చారు. కళ్ళాపి చల్లారు. ముగ్గులు వేశారు. రంగులు అద్దారు. వరిగడ్డితో తాళ్ళు పేడారు. వాటికి వేపాకు మండలు కట్టారు. వేపాకు సరాలతో వీధుల్ని అలంకరించారు. మాతమ్మ గుడికి సున్నంకొట్టారు. లోపల ఆవు పేడతో అలికారు. రంగులతో ముగ్గులు వేశారు. రంగు కాగితాలతో అలంకరించారు. కొయ్యతో చేసిన మాతమ్మ తలను నీళ్ళతో కడిగారు. పసుపు పూసి కుంకం పెట్టారు. ఎన్నేళ్లయిందో ఆ తల్లి ఆ మూలన ముడుక్కోని. సింమ్మ వాహనం దుమ్ము దులిపారు. దానికి నూనె రాశారు. తెల్లవారి లేచింది మొదలు మగోళ్లకు తాగడమే పని. 'తల్లి తీర్థం' అంటూ నాలాంటి పిలకాయల గొంతులో కూడా పోశారు. కొందరు ఆడంగులూ తాగేశారు."

మంగళవారం తెల్లారింది. కలో జగా కలో జగా అంటూ తలా ఒక బిందె చేతబట్టుకుని అందరూ బావికాడికి చేరారు. తలా వొక బిందె నెత్తి నుండి పాదాలు తడిచేదాకా నీళ్ళు పోసుకున్నారు. మాతమ్మను శుద్ధి చేయడానికి బయలుదేరారు.

మా తాత వాడకంతా వయసులో పెద్దోడు. కొలుపు తతంగం అంతా తెలిసినోడు. ఆయన ముందుండి పొరబాటు జరక్కుండా సూస్తున్నాడు. ఎయ్యిన్నీ ఒక్క బిందె నీళ్ళతో మాతమ్మను శుద్ధి చేశారు. కొయ్యబొమ్మకు పసుపు పూశారు. చీరగట్టారు. రూపాయంత కుంకుంబొట్టు పెట్టారు.

ఒకవక్క ఇది జరగతావుంటే మరోవక్క డప్పులు ఖణేల్ ఖణేల్ మంటున్నాయి. కొమ్ములు కోకో అని అరస్తా వుండాయి. పంబలు, జముకులు, ఏకతారలు ఏలపదాలు వురకలు వేస్తున్నాయి. పిల్లలూ పెద్దలూ మద్దెలో "పొలిపొలి" అని కొందరంటూంటే కొందరు 'కలోజగా' అని అరుస్తున్నారు. కొందరు 'కిల్లిల్లో... కిల్లిల్లో అని అంటున్నారు. దరువులకు తగ్గట్టు కొందరు ఆడుతున్నారు. నేనూ ఆడినాను సార్.

'సరే చెప్పు' నవ్వుతూ అన్నాడు కలెక్టర్.

అప్పుడొచ్చింది సార్ డబడబ మంటూ ఒక జీబు, ఒక లారీ.

"అందరం ఆ పక్కకు సూసినాం సార్."

"సారాయి కాస్తే పట్టుకునే డిపార్టుమెంటోళ్ళురేయ్" మా బడి మామ అర్సినాడు.

వాడి గుండె లబోదిబోమని కొట్టుకోసాగింది. కానిస్టేబుళ్లు ఇండ్లల్లోకి దూరి వెదికి వెదికి సారా కుండలు పగలగొట్టారు. అడ్డొచ్చినవాళ్లను లారీ కర్రలతో కొట్టారు. ఎవ్వరూ అటు ఇటూ ఎల్లకుండా పిస్తోలు సేతిలో బట్టుకొని ఎస్.ఐ. సార్ కాపలా కాశాడు.

ఒక గంట అల్లకల్లోలమైపోయె. వాడ ఆనందం అంతా కన్నీల్లయ్ పోయె. మాయదారి మాతమ్మ కొలుపు.

"ఆ తల్లికి కోపం వచ్చింది. ఏదో సెడు జరిగింది. అందుకే ఆ తల్లి ఇట్టా వాడమీద ఇరసకపడింది." ముసిలమ్మలు గొణగతా వుండారు.

ఎస్.ఐ. సారు పులిలా గాండ్రించారు. "ఇంటికొకడు లారీ ఎక్కండి... కొడుకుల్లారా! దొంగ సారాయి కాస్తారంట్రా. ఎక్కండ్రా.." మళ్ళీ సెడ్డ మాటన్నాడు సార్.

మా తాత లారీ ఎక్కతావుంటే నాకేడుపు వొచ్చేసింది సార్. పరుగెత్తుకుంటూ ఎల్లి నేనూ లారీ ఎక్కేశా. ఇన్స్పెక్టర్‌కు కనబడకుండా ఒక మూల ముడుక్కున్నా. మమ్మల్ని పోలీసు స్టేషనుకాడ దించేసి లారీ

ఎల్లిపోయింది సార్. తెల్లారే దాకా ఆ సెట్ల కింద మోకాళ్ళ తలలు పెట్టుకోని ఏడస్తా కూకున్నాం. మా తాత నన్ను గట్టిగా తన రెక్కల కింద అదుముకున్నాడు.

కడుపులో ఆకలి. అందరం దిగులుతో కూకున్నాం. తెల్లారి ఎనిమిది గంటలకు వచ్చాడు తిమ్మప్ప రైతు. అందరూ సివాల్న లేసి నిలబడినాం.

"ఏందిరా అంత ఇదయిపోతావుండారు. నేనుండా గదా. ధైర్యంగా వుండండి" అంటూ లోపలికెళ్ళాడు. లోపల ఏం జరిగిందో మాకు తెల్దుసార్. అరగంట తర్వాత నవ్వుతా లోపల్నుండి తిమ్మప్ప వచ్చాడు సార్.

"నేనంతా మాట్లాడేసినా. మిమ్మల్నందర్నీ ఇప్పుడే ఇండ్లకు పంపేస్తారు. నవ్వు ముఖాలు పెట్టుకోండ్రా... అయితే ఎస్.ఐ. గారు..."

"ఏంది సామీ' అందరం ఒకేసారి అన్నాం.

"ఏం లేదురా. వాళ్లకూ ఏవో ఇబ్బందులుంటాయి గదా. అందుకని మీరంతా సే(వ్రాలు జేయాలంట." అన్నాడు.

"అచ్చరం ముక్క రానోళ్ళం. సే(వ్రాలు ఎట్టా సేత్తాం సామీ" కిస్టన్న అన్నాడు.

"చదువుకున్నోళ్లు చే(వ్రాలు జేయండి. రానోళ్ళు ఏలిముద్రలు వేయండి. అంతే."

"ఏముంటాది దొరా అందులో. అడిగాడు మా సెంగల్ రాముడు.

"ఏముంటే నీకూ నాకూ ఎందుకురా. వాళ్ళ బాధలేవో వాళ్ళకు వుంటాయి గదా. అయితే మీరిక్కడే వుంటారా? లేదు. ఇంటికి పోవాలనుకుంటారా? ఏదో వొకటి తేల్చుకోండి." అన్నాడు తిమ్మప్ప.

గుసగుసలాడారు మావోళ్లు. ఈ గండం గడిస్తే సాలు అనుకున్నారు. అందరూ ఒకేసారి "నీ మాట పెకారమే నడుసుకుంటాం సామీ" అన్నారు.

"అంతేసార్."

ఒకొక్కరే లోపలకెళ్లి ఏలిముద్రలు వేసివచ్చారు. సెంగల్ రాయన్న, బడి మామ సే(వ్రాలు జేశారు. నన్ను వొద్దన్నారు సార్.

"అయిపోయిందా! సరే. మీరింకబొండి. మీమింద ఇంక ఏ కేసూ లేదు. వెళ్ళి కొలుపు చేసుకోండి." అన్నాడు తిమ్మప్ప.

"బతికినాంరా దేవుడా! దొరా! నీ రుణం తీర్చుకోలేం. ఆపదలో ఆదుకున్నావ్. నువ్వు దేముడు సామీ. మా వాడ జనమంతా పరుగులు తీస్తున్నట్టు ఇంటి దారి బట్నాం సార్.

ఆ తర్వాత ఏం జరిగిందో నాకు తెల్దుసార్." అన్నాడు సిన్నోడు.

"నాకు తెలుసు సారూ!" అన్నాడు బయట నుండి సెంగల్‌రాయుడు.

అతణ్ణి లోపలికి తీసుకొచ్చాడు రాజయ్య.

"రాజయ్యా! ఇతడు.." కలెక్టర్ రాజయ్యను అడిగాడు.

"వాడ మనిషే సార్. వాళ్లలో కొంచెం తెలివయినవాడు. కాకుంటే మందు పిచ్చి." రాజయ్య కలెక్టర్‌తో అన్నాడు.

"సరిగ్గా చెప్పు... లేకపోతే.." బెదిరింపుగా అన్నాడు కలెక్టర్.



"అన్నే సార్. కొలుపు తర్వాత వాడ మారిపోయింది సార్. రామప్ప నెత్తన సెయ్యి బెట్టి ఏసిన వొట్టు జలదారి గుంతలో పారేసి వాడ తాగుడుకు బానిసై పోయిందిసార్."

"ఈ రామప్ప ఎవరు?" అడిగాడు కలెక్టర్.

"గ్రామంలో ఆయన కూడా పెద్ద రైతుసార్! పెద్ద సదువులు సదివినాడు సార్."

"సరే. తర్వాత ఏం జరిగిందో చెప్పు" అన్నాడు కలెక్టర్.

"గవర్మెంటోడు ఏదో ఒక రూపాన దుడ్డు ఇస్తానే వుండాడు సార్. రెండ్రూపాయలకే బియ్యం దొరికె. 'ఉపాధి' అని పని ఇచ్చిరి. సేతిలో సిల్లర ఆడగానే మా బుద్దులూ సిల్లరవైపోయె. నాటు వదిలేసి కోర్టర్ తాగడం మొదులు పెడితిం సార్.

తాగి తాగి నారయ్య తాత ఒకరోజు సచ్చేపోయే. వాడకున్న పెద్దదిక్కు పోయిందని అందరం ఏడ్సినాం. నూరేండ్లు దాటి వుంటింది నార తాత వొయసు. వాడకిది పెద్ద పీనిగె. రంగరంగ వైభోగంగా పీనిగెని తీస్కపోయి పూడ్సాలని అనుకున్నాం సార్...

పిన పెద్ద ఎంకటేసన్న తలావొక పని పురమాయించాడు. రంగ మామకు, ఎల్లన్నకు, ఎల్లయ్యకు సుడిగాట్లో గుంతలోడే పనికి పంపాడు.

పది నిమిషాల్లో గనపోస్తా గుంతలోడే దానికి పోయినోళ్లు తిరిగొచ్చారు."

"ఏందిరా విసయం... పరుగులు తీస్తా వచ్చారు." అడిగాడు ఎంకటేసన్న.

"అన్నా! సుడిగాడేదుందన్నా. ఆడ పొట్ట కరుకు మీదున్న వరి పైరుండాది." గసపోసుకుంటానే సెప్పాడు రంగన్న.

"కొత్తూరు కాలవ పక్కనా. సరిగ్గా సూసినారా లేదా. తెల్లారేనీళ్లు గాని గొంతులో పోసుకున్నారా?" గదమాయించాడు పిన పెద్ద.

"సత్తె పెమాణకంగా అన్నా. నీమీదొట్టు. ఆడ కాలవా లేదు. సుడిగాడూ లేదు. అసలు కాలవ వున్న ఆనవాళ్ళు గూడా లేవన్నా. నరగావు అడగతా వుండాది వరి పైరు" అన్నాడు ఎల్లయ్య.

ఒకరి మొగాలు వొకరు సూసుకున్నాం.

"సుడిగాట్లో పైరేందిరా?" దిక్కుతోచక అడిగాడు పిన పెద్ద.

"మేమేం తమాసాకు సెప్తా వుండామా? పద నువ్వే సూద్దువు." నిస్టూరంగా కిస్టన్న మాటలు.

నేనూ, ఇంకో నలుగురు మనుసులు పిన పెద్ద ఎంకటేసు సుడిగాడు ఎదుక్కుంటూ ఎల్లాం.

మా సుడిగాడు పచ్చటి వరి పైరుతో బలికోరతా వుంది. కొంచెం సేపు.. ఎవురికీ నోట్లో నుంచి మాటరాలా.

"కాలవ గట్టేడ్రా?" ఎతక లాడతా అన్నాడు పిన పెద్ద ఎంకటేసు.

"అనా! అసలు కాలవ ఏడ వుండిందో తెలియడం లేదే. ఇంక గట్టు ఏడ ఎదకేది?" అన్నాడు రంగన్న.

"కాలవ గట్టు పక్కనే గదరా మన సుడిగాడు."

"ఇంకా ఏంది నీ సుడిగాడు. తిమ్మప్ప కయ్యల్లో కలిసిపోయింది ఆర్నెల్ల కిందటే." గొణిగాడు మున్సామి.

"ఇదేం అన్నాయంరా. మనం పీనిగెల్ని ఏడ పూడ్సాల." ఆవేశంగా పిన పెద్ద.

"నీకే తెలియాల. వాడకంతా పెద్దవు నువ్వు. విసయం ఏదన్నా వుంటే నీకే తెల్సుండాల." నీళ్ళు నములుతా అన్నాడు కిస్టడు.

పిన పెద్ద ఎంకటేసుకు అప్పుడు గుర్తుకొచ్చింది.రామప్ప ఎచ్చరించిన విసయం. "మీ సుడిగాడును ఎవరో జె.సి.పి బెట్టి సదరం జేస్తా వుండార్రా. ఎందుకో కనుక్కోరా?" అన్నమాట.

కైపు బాగా తలకెక్కిన తాను ఆయన మాటలకు విలవ ఇవ్వలేదు. ఇప్పుడు తలగ్రిరున తిరిగింది పినపెద్దకు.

"ఎంత మోసం జరిగిపోయెరా" అనుకున్నాడు.

"రేయ్! ఎవుడ్రా ఆడ. ఏం జేస్తావుండార్రా వుండా కోరునాయాండ్లాలా. ఎముకలు ఇరిగిపోతాయిరే." తిమ్మప్ప బామ్మర్ది ముక్కన్న అరుపులు.

"సోమీ! ఒక తూరి ఇట్టారండి.' గట్టిగా పిల్సాడు ఎంకటేసన్న. ముక్కన వచ్చాడు.

"ఇదేంది సామీ! మా సుడిగాట్లో పైరు పెట్టేసినారు. మేము పీనిగెల్ని ఏడ ఏసుకోవాల?" అడిగాడు పిన పెద్ద ఎంకటేసు.

"ఇది సుడిగాడని ఎవుడ్రా నీకు జెప్పింది?" ఎదురు ప్రశ్న వేశాడు ముక్కన్న.



'తాత ముత్తాతల కాడనుండీ ఇద్నే గదా సామీ పీనిగెల్ని పూడ్చేది. మీకు తెల్దా." వినయంగానే అన్నాడు పినపెద్ద.

ముక్కన్నకు ముక్కు మీదే కోపం. "ఈడ కాలవ వుండాదా? ఏడ్రా కాలవ? నేర్చుకోని మాట్టాడాతవుండావే. ఇది పట్టా బూమిరా. ఎట్టుండాది వోళ్ళు. మా బూమిలో పీనిగెల్ని పూడస్తావా? వొళ్ళు దగ్గర పెట్టుకొని మాట్టాడు. లేకపోతే.." కసిరినట్టు అరిచాడు ముక్కన్న.

"మా సుడిగాడు మీ పట్టా బూమి ఎట్టయింది ముక్కన్నా? ఇంత అన్యాయమా." వుండబట్టలేక నేనే అంటినిసార్.

"దిక్కున్నసోట పొయ్ సెప్పుకోండ్రా. నాయం అన్నాయం తెలస్తాది. యీడగాని ఏమయినా నకరాలు చేసినారో పులుసులోకి బొమికె గూడా మిగల్దు. పొండ్రా... పొండి..." గొడ్లను తరమినట్టు తరిమాడు ముక్కన్న.

ఏది దారో తెలియక వాడ జేరుకున్నాం అందరం.

వాడ శివాలెత్తింది.

మన సుడిగాడును తిమ్మప్పకి పట్టా ఇస్తారా? మనం పీనిగెల్ని ఏడ ఎయ్యాల? పదండ్రా అందరం గుంపుగా మండలాఫీసుకు. పట్టా ఎట్ట ఇస్తారో తెల్సుకుందాం."

అందరం గుంపుగా బయల్దేరాం సార్.

అప్పుడు పదకొండు గంటలు. తాశీల్దార్ ఆఫీసు అటండరు వీరాసామి గోడకానుకుని కునుకు తీస్తావుండాడు. వీరాసామిని చేత్తో చిన్నగా తట్టాడు మా పినపెద్ద. వొంటి కాలమీద లేశాడు వీరాసామి.

"గడ్డి తింటావా? కూడు తింటావా? వారం రోజుల్నుండి పైసా ఆదాయం లేదు. ఆలోసిస్తా కళ్లు మూస్తే... లేపేస్తావా?" బారడెత్తు పైకి లేచాడు వీరాసామి.

గడ్డి తినేవోళ్ళ మింద కోప్పడితే ఎట్లా సామీ. తాశీల్దార్ కోసరం వచ్చాము. వాడ మనసులం" అన్నాడు వినయంగా పినపెద్ద.

"ఏ మనుసులయితే నాకేం గాని లోపల సూడు ఒక్క మనిషయినా అగుపిస్తా వుండాడా? రేపు రాబోండి." గదమాయించాడు వీరాసామి.

"తాశీల్దార్‌తో అరిజెంటుగా మాట్లాడాలయ్యా" రంగన్న అడిగాడు అడుక్కుంటున్నట్టు.

నవ్వాడు వీరాసామి.

తెల్లబోయారు వాడ మనుషులు.

'తాశీల్దారా! ఇంకా ఏడ తాశీల్దారు. ట్రాన్స్‌ఫర్ చేసుకొని మూణ్ణెల్ల కిందే వెళ్ళిపోయాడు. పొండి. పొండి" తరుముతున్నట్టు అన్నాడు వీరాసామి.

"ఇప్పుడేం సెయ్యాల్రా" తల పట్టుకున్నాడు ఎంకటేసన్న.

"ఏదో ఆలోచన వచ్చి వొక పని చేద్దాం. అన్నా సార్ నేను"

"ఊ... కానియ్" అన్నాడు కలెక్టర్ రామ్మూర్తి.

"టౌన్లలో గవుర్మెంటోడుగాని అన్నాయం చేస్తే ప్రజలు దర్నాలు, స్ట్రైకులూ జేస్తా వుంటారు. బస్సులూ, రైళ్లూ ఆపేస్తా వుంటారు. ఆటో తోల్తా నా కనుబవంగదా. అట్నే మనం గూడా రోడ్లో కూర్సోని తిరపతి సిత్తూరుకు పొయ్యే బస్సుల్ని ఆపేద్దాం." అవుడియా ఇచ్చాను సార్.

"నువ్వన్న మాట ధర్నా ఐడియా ఇచ్చింది." అన్నాడు కలెక్టర్.

"ఆ తర్వాత.. కలెక్టర్ అడిగాడు

''మీకు తెల్సుగద సారూ! జరిగిందంతా. మాది తప్పయితే చమించండి సారూ."

"సరే. దర్నా దగ్గరకెడదాం పదండి. క్రిష్ణా! పాళెం డి.టి. సర్వేయర్, ఆర్.ఐ., వి.ఆర్.ఓ. వచ్చారా? అడిగాడు సి.సి.ని.

"అక్కడే వున్నారు సార్" జవాబు చెప్పాడు సి.సి.

... ... ...

కలెక్టర్ రామ్మూర్తి అంటే వుద్యోగుల గుండెల్లో రైళ్ళు పరుగెడతాయి.

వాడ జనాన్ని ఒప్పించి బస్సుల్ని పంపించేశాడు. గ్రామం స్కూల్లోకి వచ్చి కూర్చున్నాడు కలెక్టర్ రామమూర్తి. నిజానిజాలు తెలుసుకోవాలనే ప్రయత్నమే ఇది.

రాజయ్య అతడి ఆత్మీయ మిత్రుడు. రామమూర్తి ప్రయత్నాలకు రాజయ్య చేదోడు వాదోడుగా వుంటాడు.

వాడ మనుషులు చెప్పినవన్నీ విన్నాక ఏదో నిర్ణయానికి వచ్చిన కలెక్టర్ తన సిబ్బందితో మర్రి చెట్టు కిందకు చేరుకున్నాడు.

నారయ్య శవాన్ని పెట్టుకుని ఆ వాడ జనం అక్కడే ఉన్నారు.

యం.ఆర్.ఓ. ఆఫీసు సిబ్బంది రెప్పాళ చెట్టు కింద నిలబడి ఏవో గుసగుసలు పోతున్నారు. ఎస్.ఐ. కాలుగాలిన వాడిలా తిరుగుతున్నాడు. నలుగురు కానిస్టేబుళ్ళు ఒక చెట్టు నీడన కూర్చుని పులి మేక ఆట ఆడుకుంటున్నారు.

కలెక్టర్‌ని చూసి అందరూ లేచి నిలబడ్డారు. దణ్ణాలు పెట్టారు.

ఆఫీసు మనుషులు వినయ విధేయతలు ప్రదర్శిస్తూ నిలబడున్నారు. కానిస్టేబుళ్లు అయిష్టంగా లేచారు. ఎస్.ఐ. సెల్యూట్ చేశాడు.

"మీకు న్యాయం చేస్తాను. ఏదయినా తిని రండి. మీకు న్యాయం జరిగేదాకా నేను ఇక్కడ నుండి కదల్ను. నా మాట నమ్మండి" అన్నాడు కలెక్టర్ రామ్మూర్తి వాడ జనంతో.

"ఇప్పుడు నీళ్ల గొంతులో దిగవుసార్. మాకు న్యాయం జరక్కపోతే మేం సచ్చేది ఖాయం" అన్నారు వాడ జనం కూడబలుక్కున్నట్టుగా.

"అంత దూరం రాకుండా నేను చూస్తాను. తినే ఆలోచన లేకపోతే... సరే.. మీరు చెట్టు నీడలో శవాన్ని పెట్టుకుని కూర్చోండి."

అలాగే చేశారు వాడ జనం.

ఎవరో కుర్చీ తెచ్చి వేశారు. కూర్చున్నాడు కలెక్టర్ రామ్మూర్తి.

"మీరు ఇట్లా రండి." ఆదేశిస్తున్నట్లు అన్నాడు రెవిన్యూ ఆఫీసు వాళ్ళతో.

"సర్వేయర్ ఎక్కడ? మ్యాప్ తీసుకురా" సర్వేయర్, ఆర్.ఐ, వి.ఆర్.వో మ్యాప్ అందించారు.

'చూపించు' అన్నాడు సర్వేయర్‌తో.

"ఇది కాలవ సార్. ఇటు పక్కా అటు పక్కా కాలవ పోరంబోకు సార్, ఈ కాలవ..

"వాడ సుడిగాడు చూపించు? గద్దించాడు కలెక్టర్.

"అదీ.. అదీ.." మాట రాలేదు సర్వేయర్‌కి.

"అదే... ఎక్కడ."

"ఈ మ్యాప్‌లో లేదు సార్" సర్వేయర్.

"ఇంకో మ్యాప్ కూడా వుందా? తల పొగరా? సమాధానం చెప్పు."

"తాశీ..ల్దార్... తాశీల్దార్.." తడబడుతున్నాడు సర్వేయర్.

"ఆ మ్యాప్ గీసింది ఈ సర్వేయరే సార్"

"నువ్వెవరు?"

"నే..నేను.. డిప్యూటీ తాశీల్దార్ సార్. ఇన్‌ఛార్జి తాశీల్దార్ సార్..."

"నువ్వు గీయించావా ఈ మ్యాప్"

"నేను కాదు సార్. ట్రాన్స్‌ఫర్ చేసుకుని వెళ్ళిన తాశీల్దార్ సార్."

"అంటే ఇంకో మ్యాప్ వుందన్న మాట."

"వుండాలి సార్. కానీ ఆ ఫైల్ కనబడటం లేద్సార్ అన్నాడు డిప్యూటీ తాసీల్దార్.

"ఈ ఒక్క గ్రామం ఫైలే కనబడలేదా? లేక మండలం ఫైళ్లన్నీ కొట్టుకుపోయాయా?"

"సత్తెంగా సార్.." ఏదో చెప్పబోయాడు డిప్యూటీ తాశీల్దార్.

"నోర్ముయ్. రాజయ్యా! ఇక్కడికి దగ్గరేగదా మండలం ఆఫీసు. డిప్యూటీ తాశీల్దార్‌ని తీసుకుని వెళ్లు. అతడే వెతికి ఈ గ్రామం పాత ఫైలు ఇస్తాడు. తీసుకురా. ఒరేయ్ ఎవర్రా అటెండర్." పిలిచాడు కలెక్టర్.

"నేను సార్!" వీరాసామి ముందుకొచ్చాడు.

"కూడా వెళ్లు.ఊ...తొందరగా రావాలి.' ఆర్డర్ వేశాడు కలెక్టర్.

జీపు మండలం వేపు దూసుకెళ్లింది.

"నిజం చెప్పండి. మీ అంతు చూడందే నేను వెళ్లను. క్రిష్ణా!" పిలిచాడు కలెక్టర్.

"ఇక్కడే యిప్పుడే మీ అందరికీ సస్పెండ్ ఆర్డర్లు యిస్తాను. విచారణ తేలే వరకూ జీతం కూడా యివ్వవద్దని ఆర్డర్ వేస్తాను. ఆ తర్వాత కూడా మిమ్మల్ని యీ జిల్లాలోనే కాదు నక్సలైట్లు ఏరియాకు డీప్రమోట్ చేసి వేయిస్తాను. లేదా టెర్మినేట్ చేయిస్తాను. క్రిష్ణా! నోట్ రాసుకో.."

"సార్" అన్నాడు క్రిష్ణ.

ఆర్.ఐ., సర్వేయర్, వి.ఆర్.ఓ. మాట్లాడుకున్నట్టుగా కలెక్టర్ కాళ్ళు పట్టుకున్నారు.

"క్షమించండి సార్! బుద్ధి గడ్డితిని యీ పని చేశాం సార్" అన్నారు ఏక కంఠంతో.

"ఎంత గడ్డి తిన్నారేంటి?"

"వెళ్లిపోయిన తాశీల్దార్ పని సార్ ఇది. ఆయనే తిమ్మప్పగారి డబ్బుకూ పలుకుబడికీ లొంగిపోయి మమ్మల్ని యీ రొంపిలోకి దింపాడు సార్."

"ఒకడు దింపితే దిగడమేనా? మీకు సొంత బుద్ధి లేదా?"

"మా కడుపులు కొట్టకండి సార్. బిడ్డలున్నవాళ్లం"

"మిగతా ఎవరికి కడుపులుండవా? బిడ్డలుండరా? ఎన్నాళ్లుగా వున్నారిక్కడ."



"పదైదు ఏళ్లకు పై చిలుకే సార్."

"అందుకే మీకింత ధైర్యం వచ్చింది. మిమ్మల్ని కాపాడే వాడెవడో అడ్డి రమ్మనండి. వాడి కథేందో తెలుసుకుంటా."

కటువుగా అన్నాడు రామ్మూర్తి.

కలెక్టర్ డిక్టేట్ చేస్తున్నాడు. స్టెనో క్రిష్ణ రాసుకుంటున్నాడు. టైపు మిషన్ చేత్తో బట్టుకుని నిలబడి వున్నాడు డఫేదార్.

ఇదంతా చూస్తున్న రామప్ప చిన్న కొడుకు వెంకటప్ప గ్రామం వైపు నడిచాడు.

"తప్పు మాదే కాదు సార్. వాడ జనానిది కూడా వుంది సార్. సుడిగాడు అక్కడ వద్దని వాళ్లు వేలి ముద్రలు వేసిన కాగితాలు మన దగ్గర వున్నాయి సార్" ఆర్.ఐ. అన్నాడు.

"మరి. ఇంతకు ముందు కనపడలేదన్నారు."

"లెంప లేసుకుంటాను సార్." టపటపా చెంపలు వాయించుకున్నాడు ఆర్.ఐ.. మిగిలిన ఇద్దరు కూడా లేచి చెంపలు టపటపా కొట్టుకున్నారు.

"ఇప్పటికయినా నిజం చెప్పండి."

"సార్. అది కాలవ పోరంబోకు సార్. రెండు వాడల స్మశానాలు వుండేది అక్కడే. ప్రక్కనే తిమ్మప్ప భూమి వుంది సార్. ఆయన కన్ను దాని మీద పడింది సార్. పై నుంచి వత్తిళ్లు వస్తే చిన్న వుద్యోగులం మా మాట ఎవరు వింటారు సార్. అడగండి సార్ వాళ్లను. సుడిగాడు అక్కడ వద్దని వాళ్లు వేలిముద్రలు వేశారో లేదో...అడగండి సార్. అన్నాడు ఆర్.ఐ.

"ఏమయ్యా పిన పెద్దా! మీరు వేలి ముద్రలు వేశారా సుడిగాడు వద్దని"

"సారూ? అచ్చరం తెలియకపోయినా సుడిగాడు వద్దంటామా? సుడిగాడు లేకుంటే శవాల్ని మా ఇండ్లలో పూడ్చుకుంటామా సామీ! అంత ఎదవలం కాదు దొరా" అన్నాడు పిన పెద్ద.

"వాళ్లు నిరక్షరాస్యులు. వేశారే అనుకో. కాలవ పోరంబోకు టి.కె.టి. కూడా యివ్వకూడదని మీకు తెలియదా?

"తెలుసు సార్! ఆ కాలవ బేట్స్ కింద ఎన్నో ఏళ్ల కిందట చేర్చేసి వున్నారు సార్" అన్నాడు వి.ఆర్.ఓ.

"అయితే పట్టా యిచ్చేస్తారా? వాడ వాళ్లను పిలిచి అడగాల్సిన బాధ్యత మీకు లేదా?" రామ్మూర్తి మాటల్లో కరకుదనం.

"హైద్రాబాద్‌లో పలుకుబడి వుండే వాళ్ల ముందు మేము చిన్న చీమలం సార్" తల గోక్కుంటూ అన్నాడు సర్వేయర్.

ఇంతలో వెళ్లిన జీపు వచ్చింది.

డిప్యూటీ తాశీల్దార్ సుబ్బారావు ఒక ఫైల్ కలెక్టర్ ముందు పెట్టాడు. అటూ యిటూ తిప్పి వేలి ముద్రల పేపర్స్ బయటకు తీశాడు కలెక్టర్. ఒకటిగాదు నూట ఇరవై వేలి ముద్రలు. రెండు సంతకాలు ఒక సంతకం మీద దృష్టి పడింది. "బడయ్య ఎవరు? అన్నాడు కలెక్టర్.

"నేను దొరా" చేతులు కట్టుకుని అన్నాడు బడయ్య.

చదువుకున్నావా? అడిగాడు.

"ఐదో తరగతి దాకా సదువుకున్నా సార్. తాతావాళ్ల వూర్లో. మళ్లీ యీడికొచ్చేసినా. అన్నాడు బడయ్య.

"చేవ్రాలు చేసే ముందు పైన ఏం రాసి వుందో చదవ లేదా నువ్వు."



"పైన ఏమీ రాయలేదు సార్. తెల్ల కాగితం మింద సేవ్రాలు జేసినాసార్. అంతకంటే నాకింకేమీ తెలియదుసార్" అన్నాడు బడయ్య భయంగా.

"ఎందుకని ఎవరూ అడగలేదా?"

"అంత ఇది ఎవురి కుంది సామీ. పోలీసోళ్లంటేనే బయం. టేసన్‌లో నించి ఎప్పుడు బయట పడదామా అన్న ఆలోశనేగాని ఇంకో ఆలోశనే మాకు రాలేదు సార్. ఎప్పుడూ టేసన్ మొగం సూడలేదు దొరా. అగుమానంతో వణికిపోతిమి సామీ. ఏలి ముద్రలేత్తే వొదిలేత్తార్రా అని తిమ్మప్ప సెప్పినాడు. మేం ఏసేసి ఒక్క పరుగుతో వాడ సేరుకున్నాం దొరా.! ఎంకటేసు వివరించాడు.

"తిమ్మప్ప రైతు గ్రామంలో మత్తేబు" నసిగాడు ఎల్లయ్య.

"ఆశే. నువ్వంట్రా...దొరా! మా సుడిగాడు కోసం ఏలి ముద్రలు తీసుకుంటూ వుండారని నిజ్జంగా మాకు తెల్దుసార్. మాతమ్మతల్లి మీద 'వొట్టు' అన్నట్లు తలమీద చెయ్యి పట్టుకుని చెప్పాడు పిన పెద్ద ఎంకటేసు.

కలెక్టర్ కొంచెం సేపు ఆలోచనలో పడ్డాడు. వీళ్లు చెప్పే మత్తేపులు ప్రస్తుతం వూళ్లో లేరు. స్పష్టంగా తెలుస్తూంది. ఇది దగా అని.ఇందులో ఆఫీసులో అందరికీ వాటాలుండడంలో సందేహం లేదు. సుడిగాడు విషయానికొస్తే.. అటు పచ్చని పైరు. ఇటు వాడ జనుల రోదనలు...

రెండు క్షణాలు ఆలోచించాడు కలెక్టర్.

"సుబ్బారావ్!" పిలిచాడు.

"సార్!" అంటూ వచ్చి నిలబడ్డాడు. డిప్యూటీ తాశీల్దార్.

"దగ్గర్లో గవర్నమెంట్ భూమిగాని వుందా." అడిగాడు.

"ఈ చుట్టుపక్కల ఆరు కిలోమీటర్ల దాకా ఎక్కడా ఒక సెంటు కూడా మన భూమి లేద్సార్" అన్నాడు డిప్యూటీ తాశీల్దార్ వినయంగా.

"అంతా దారాదత్తం చేసేశారా? పలుకుబడి వున్న పెద్దమనుషులకు. డబ్బు తింటారా? కొంచెం.... కొంచెమయినా మనిషితనం వుండాలయ్యా. ఈ శవం మీలో ఏ వొకడి తండ్రిదో అయివుంటే..." కోపంతో వూగిపోయాడు రామ్మూర్తి.

"క్రిష్ణా ! మేటర్ సెటిల్ అయ్యేవరకూ వీళ్లకు జీతం కూడా యివ్వరాదని వ్రాయి. మెక్కి వుంటారు గదా. అరగనీయ్.

"షీట్" అన్న భావం కలెక్టర్ మాటల్లో

డి.టి., ఆర్.ఐ., సర్వేయర్, వి.ఆర్.ఓ. ముఖాల్లో నెత్తురు చుక్కలేదు. తలల దించుకుని రోడ్డు పక్కన నిలబడినారు.

మధ్యలో వెళ్లిన వెంకటప్ప తిరిగిచ్చాడు.

"నమస్కారం సార్!" అన్నాడు.

తలెత్తి చూశాడు రామ్మూర్తి.

"చిన్న రిక్వెస్ట్ సార్"

"నీకేం కావాలి? కాలవా? చెరువా? అదిగో అక్కడ నిలబడి వున్నారుగా వెళ్ళి అడుగు యిస్తారు. నీ దగ్గర డబ్బుందా?" అన్నాడు చిరాగ్గా. అసలే కోపంతో వున్నాడు కలెక్టర్.

"అది కాద్సార్. గ్రామ పెద్దలతో మాట్లాడినా సార్. చచ్చిపోయిన నారయ్యంటే అందరికీ గౌరవం సార్. మా తాతల కాలం నాటి మనిషంట సార్. అతడిమీద గౌరవం కొద్దీ గ్రామ స్మశానంలో నారయ్య శవాన్ని పూడ్చుకోమని వాళ్ళకు చెప్పండి సార్. ఈ గౌరవం ఒక్క నారయ్య శవానికి మాత్రమే సార్. మిగతా వాళ్ళకు కాద్సార్."

రామ్మూర్తి ఖంగుతిన్నాడు. ఆశ్చర్యంగా యువకుణ్ణి చూశాడు.

తాత్కాలికంగా పరిష్కారం మనసులో అనుకున్నాడు.

"విన్నారా ఈ యువకుడు చెప్పింది" అడిగాడు వాడ జనాన్ని కలెక్టర్.

సామీ! గ్రామం సుడిగాడులో నారయ్య శవాన్ని పూడిస్తే పాపం సుట్టుకోదా? అన్నాడు భయంగా బడయ్య.

"బడన్నా! అవన్నీ కబుర్లు. మీ తెలివి తక్కువతనం. పుట్టినపుడు కులం గోత్రం ముద్ర లేనట్టే చచ్చాక కూడా ఏ శవానికీ కులం, గోత్రం వుండదు. నా మాట వినండి." అన్నాడు వెంకటప్ప.

"నువ్వంటావబ్బా! మిగతావోళ్లు వూరికే వుంటారా? మా వీపులు పగలగొట్టరా?" అన్నాడు జగ్గయ్య ఇది జరిగే పనేనా అన్న సందేహంతో.

"చెప్పానుగా అందర్నీ వొప్పించి వచ్చానని. మీ కెందుకు భయం. నాది పూచీ. క్షమించండి సార్. ఈ ఏర్పాటు యీ ఒక్కసారికే. మళ్ళీ వాడలో శవం లేచేలోపల వాళ్ళకు సుడిగాడు మీరు ఏర్పాటు చేయాలి." కలెక్టర్‌తో అన్నాడు వెంకటప్ప.

"తప్పకండా. అది నాధర్మం. చాలా థాంక్స్" అన్నాడు కలెక్టర్.

"పిన పెద్దా!"

"దొరా!" ముందకొచ్చాడు ఎంకటేసు

"ఆ ఏర్పాట్లు చూడు. మీ సుడిగాడు మీ కిప్పిస్తాను. నా మాట నమ్మండి. క్రిష్ణా! ఆర్డర్స్ ఏవి? సంతకాలు చేస్తూ కలెక్టర్ రామమూర్తి.

## ఫిబ్రవరి నెల పురస్కారాలు



### జామకాయల శివాలక్ష్మి

కథకు........రూ.700/-

రచయిత : కుంతి



### చైతన్యపు సంద్రం

కవితకు.......రూ.500/-

రచయిత : తంగెళ్ళపల్లి కనకాచారి

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

"వాళ్ల నలుగురికి సస్పెన్షన్ ఆర్డర్స్ చేతికిచ్చి సంతకాలు తీసుకో." ఆదేశించాడు కలెక్టర్.

"రేపట్నించీ మీరు ఆఫీసుకు రానక్కర్లేదు. క్రిష్ణా! నగరం తాశీల్దార్‌కు ఫోన్ చెయ్. రామాపురం ఆఫీసుకు రమ్మని. అర్జంట్..." అంటూ కారు వైపు నడిచాడు.

"కలెక్టర్ దొరకూ జై...వెంకటప్పకూ జై" అన్నారు వాడ జనం.

"నోర్ముయ్యండ్రా. తాగద్దండ్రా తాగద్దండ్రా అని మొత్తుకుంటే విన్నార్రా మీరు. తాగి తాగి మీరు మనుషులుగా చచ్చిపోయారు గదరా. 'జై' లెందుగ్గాని ముందా శవం సంగతి చూడండి." అన్నాడు వెంకటప్ప.

శవాన్ని తీసుకుని బయలు దేరారు వాడ జనాలు.

. . .

కలెక్టరేట్ - కలెక్టర్‌కి ఎదురుగా కుర్చీల్లో తిమ్మప్ప రామప్ప తలలు దించుకుని కూర్చున్నారు.

"ఇంత మోసం చేయాలా! చెరువులు కాలువలు పోరంబోకులు మింగడానికి మీరేం భూములు లేనోళ్లా? వందల ఎకరాలున్నాయే. మీ రాజకీయాల కంపులోకి ఉద్యోగుల్ని కూడా లాగుతారా? ప్రలోభాలతో లొంగదీసుకుంటారా? మీ పంతాలకు వాళ్లు బలైపోవాలా? నాకు జవాబు చెప్పకపోయినా రేపు దేవుడి కోర్టులో యిట్లాగే తలల వంచుకుంటారా? మీకు శిక్ష పడకుండా వుంటుందా?" వుగ్రం వచ్చిన వాడిలా అరిచాడు రామ్మూర్తి.

బలైపోయేది అమాయకులు. ఇదింక జరక్కూడదు. జరగనివ్వను? "బెల్ కొట్టాడు. డఫేదార్ వచ్చాడు.

"ఆర్.డి.ఓ. వెంకట్రావు గారిని పిలువ్"...

ఆర్.డి.ఓ. వెంకట్రావ్ లోపలికి వచ్చాడు.

సూది పడితే వినబడేటంత మౌనం. ఎవరూ మాట్లాడంలేదు.

"వీళ్లిద్దరికీ యిచ్చిన గవర్నమెంట్ భూమి పట్టాలను రద్దు చేస్తున్నాను. ఈ నిమిషం నుండే అవి ప్రభుత్వ భూములు. స్వాధీనం చేసుకోండి." సంతకం చేసి కాగితం చేతికిస్తూ' పోలీస్ ప్రొటెక్షన్ తీసుకోండి. కఠినంగా వ్యవహరించండి. ఎవరి స్మశానాలు వాళ్ళకు అప్పగించండి. మీరెళ్లి పని చూడండి" అన్నాడు కలెక్టర్.

వెంకట్రావ్ ఆర్డర్ చేతికి తీసుకుని చాంబర్ బయటకొచ్చాడు.

"మీరు యింక సెలవు తీసుకోవచ్చు" ఆసాములు వేపు చూసి అన్నాడు కలెక్టర్.

ఆఫీసు మెట్లు దిగి వచ్చిన మత్తేపులిద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు. ఆ చూపుల్లో ఏవో రహస్య సంకేతాలు అటూ యిటూ పరుగెత్తాయి. రెండు క్షణాలు...సన్నగా ప్రవహించిన నగవు వాళ్ల ఆధరాలపై.

"చూశావా రామప్పా! మనం వేరు కుంపట్లు పెట్టుకునేసరికి యీ ఆఫీసర్లకు ఎంత ధైర్యమొచ్చిందో" అన్నాడు తిమ్మప్ప.

'అయితే ఏం చేద్దాం?" అన్నాడు రామప్ప

"ఇంక యిద్దరిదీ ఒకే కుంపటి" ఏమంటావ్ తిమ్మప్ప.

చేయి కలిపాడు రామప్ప.

"రామప్పా! నీ చిన్న కొడుకుని కొంచెం అదుపులో పెట్టు" నసుగుతూ అన్నాడు తిమ్మప్ప.

అందుకే గదా వాణ్ణి అమెరికాకు వాళ్ళ అక్కతో పంపించేస్తున్నాను." అన్నాడు రామప్ప.

"అయితే రాత్రికే మన హైద్రాబాద్ ప్రయాణం"

"సరే!" అన్నాడు రమప్ప.

రెండు స్వార్థాలు, రెండు అహంకారాలు రెండు ముఠాలు. రెండు రాజకీయ పలుకుబడులు. చేతులు కలిపాయి.

నెల తిరక్కుండానే ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ కలెక్టర్ చేతిలో ఫ్యాను గాలికి సన్నగా వణుకుతూంది. తనకిది మామూలే... అరనవ్వు నవ్వుకున్నాడు కలెక్టర్ రామ్మూర్తి.

. . .

అయితే...వాడ మనుషులు ఆ వాడ మనుషులు కాదు.

ఇప్పుడు వాళ్లు కణకణ మండే రక్కసి బొగ్గులు.

•

# నేను మట్టి మనిషిని

- బొమ్మరాత యల్లయ్య



పుట్టిబుద్ధెరిగిన దగ్గర్నుండి
మట్టంటే నాకు చాలా ఇష్టం
ఇష్టంకన్నా.....ప్రాణమంటేనే న్యాయం
బాల్యమంతా గడిచిందామట్టిలోనే
బంతిలాగంతులేసిందా మట్టిలోనే
బజార్లో కొస్తే చాలు
విబూదికి బదులు మట్టి పూసుకున్న
బాల శివుడ్నయ్యేవాడ్ని
ఎవరు కొట్టినా తిట్టినా
మట్టినే బట్టలుగా ధరించేవాడ్ని
పొద్దున్నుంచి సాయంత్రందాకా
మట్టిలోనే నా ఆటా, పాటా
మట్టితో ఉన్న బంధమేమిటో గానీ
మట్టితో మాట్లాడినంతగా ఎవరితో మాట్లాడలేదు
మట్టిలో ఏదో మత్తు, మహత్తు ఉన్నట్టుంది
మట్టితోనే మనసు గుసగుస పెట్టేది
పొట్టలో నేనున్నపుడు అమ్మ
మట్టిబెడ్డలు తిన్న ప్రభావమేమో
మట్టివాసన నన్ను తట్టి లేపేది
ప్రాణం పోసే పవరు లేదు కానీ....,
మట్టిని నా చిట్టి చేతుల్తో పిసికి
బొమ్మలు చేసేవాడ్ని
మనుషులు, ఎడ్లు, బండ్లు, నాగండ్లు
గురుగులు, గిరకలు, పక్షులు,పండ్లు
ఎన్నన్ని చెప్పను..... ఎన్నెన్నో
అందంగా, ఆనందంగా చేసేవాడ్ని
అంటిన మట్టి నాకు అలదిన గంధమే
అమ్మ తిట్టినా మట్టితో నా ఆట నాన్‌స్టాపే
మిత్రుడిచ్చిన మిఠాయిని మట్టిచేతుల్తో తిన్నా
మరి నాకేం కాలేదు....
మట్టీ నా మిత్రుడే కదా!...
మణులు పండినా వచ్చేది ఆ మట్టి నుండే కదా!
మాన్యాలు మింగినా మిగిలేది గుప్పెడు మట్టేకదా!!
అన్నట్టు .... నా బుర్రలో ఉంది కూడా
సారవంతమైన మట్టే సుమా!!
అడక్కుండానే మట్టి నాకేంతో మేలు చేసింది
ఎదిగిన నేనిప్పుడు
మట్టికి కాస్తంత దూరమైనా
మరువలేదు మట్టి మిత్రుడు నన్ను
మట్టికున్నంత 'తడి' మనిషికుంటే ఎంత బావుండు...
తొలకరి వచ్చినప్పుడల్లా
పలకరిస్తూనే ఉంటాడు పరిమళాల జాబుతో...
పండిన పంటచేల పచ్చదనంతో
మరపురాని మా అనుబంధానికి గుర్తుగా
మట్టికి నన్ను అక్కున చేర్చుకుంటుంది చివరిగా
మట్టికి నేనెంతో రుణపడి ఉన్నాను
మట్టిలో ఐక్యమై ఆ 'రుణం' తీర్చుకుంటాను.

# పని చేసుకోనీయండి

- మొయిద శ్రీనివాసరావు



అతనెప్పుడూ పనిలోనే వుంటాడు
ఆకలేస్తే పనినే తింటాడు
అలసినపుడు పనిలోనే సేదతీరుతాడు
ఆఖరికి నిద్దట్లో పనినే కలగంటాడు
పనే తనని మొలకెత్తించే విత్తనం
పని మీదనే అతని పెత్తనం
కాసేపు పంటకాలువలో నీరై ప్రవహిస్తాడు
మరి కాసేపు ఏ మొక్క చుట్టో
మట్టి బోదెగా మారిపోతాడు
సాయంత్రానికి తోటకూర కాడలా తలను వేలాడేసినా!
పొద్దుటికి అచ్చమైన గడ్డి గులాబీలా అగుపిస్తాడు
తనని చూస్తే నిత్యం పనిలో పదునుదేలిన
పనిముట్టు గుర్తుకొస్తుంది.
ఏమి చేసి మెప్పిస్తాడో మరి
పగలంతా కన్నెర్ర జేసిన ఎండ
రాత్రికి తన చుట్ట చివర నిప్పై నిల్చుంటుంది.
తనను పట్టించుకోలేదనే దిగులుతో
వెన్నెల, వాకిట్లో మంచం క్రింద
మచ్చల కుక్కై కూర్చుంటుంది
మట్టి మౌనంగా వుంటే సహించలేడు
నాగలితో తట్టిలేపి, కాసిన్ని నీళ్ళు పోసి
పచ్చని మొక్కలా ముస్తాబు చేస్తాడు
నాలుకపై నాల్గక్షరముక్కలు లేకపోయినా
నిత్యం పచ్చని ప్రపంచ కావ్యం లిఖించడానికి పరితపిస్తాడు
అందుకనేనేమో... శ్రమజీవన సంస్కృతి
తన నెత్తిన తలపాగై
కాళ్ళు సందున గోచిగుడ్డై
బతికి బట్టకడుతుంది
మీ దోవన మీరు పోతూ....
ఆప్యాయంగా పలకరించారా!
తనో ముద్దతిని మీకో రెండు ముద్దలందిస్తాడు
కాదూ..... కూడదని
నోటి దగ్గర కూడుని నేల పాల్జేయాలనుకున్నారో?
అంతవరకు పనిలో నడుమొంచిన కొడవలి
బిగిసిన పిడికిలిలో
ఎర్రని ప్రశ్నార్ధకమై ప్రజ్వలిస్తుంది

# ప్రపంచ సాహిత్యపు కొన్ని పుటలు

- కె. ఆనందాచారి



దిలావర్

**కవిత్వాన్ని, రచనలను, రచయితను ఎకడమిక్‌గా పరిచయం కాకుండా ఆయా కాలాల్ని, దేశాల రాజకీయ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితుల్ని అవగాహన చేసుకున్నదంతా తెలిపే ప్రయత్నం చేశారు. అంతేకాదు రచయితల నేపథ్యాన్నీ సమగ్రంగా వివరించడం వల్ల, వారి రచనా పరిచయంలో మనం నిమగ్నులమవుతాం. ఇది చాలా గొప్పగా చేశారు రచయిత. ఈ గ్రంథం ప్రత్యేకతల్లో ఇది ముఖ్యమైనది. ఒకటీ రెండూ మినహాయిస్తే ఎంచుకున్న రచనలూ, రచయితలు ఆయన ఆలోచనలను ప్రతిబింబిస్తాయి.**

ప్రపంచీకరణ పేరుతో దోపిడీ, పీడన, అణచివేత కేంద్రీకృతంగా దాడి చేస్తున్న సందర్భంలో దానికి వ్యతిరేకంగా వెల్లువెత్తే ప్రతిఘటనను ప్రతిబింబించే సాహిత్యమూ, ప్రపంచీకరించబడాల్సిన అవసరం నేడున్నది. ప్రతిఘటనా సాహిత్యం ప్రపంచీకరించబడితేనే ఒక బలమైన ప్రభావాన్ని కలిగిస్తుంది. సాహిత్య బలమూ పెరుగుతుంది. ఇది జరగడానికి దిలావర్ ఈ "దూరాల చేరువలో..." రచన ఎంతో ఉపయోగపడుతుంది.

దిలావర్ కవే కాదు మంచి కథకుడు, విమర్శకుడు కూడా. నిత్య సాహిత్య జీవి. ప్రగతిశీల సాహితీకారుడు. తన పరిసరాలతోనే కాక, ప్రపంచంలోని ఏ ప్రదేశంలో అన్యాయం జరిగినా అమానుషం జరిగినా ప్రతిస్పందించే హృదయమున్నవాడు. ముఖ్యంగా సామ్రాజ్యవాదపు దుర్మార్గాలను ఎప్పటికప్పుడు చీల్చి చెండాడే కలం ఖడ్గధారి.

ప్రపంచ సాహిత్య చరిత్ర ఏదో కొంత పరిచయం చేయాలి అన్న కోరికతో మాత్రమే దిలావర్ ఈ 'దూరాల చేరువ'లోకి ప్రవేశించలేదు. ఆయా దేశాల కవులు, రచయితల సాహిత్యంతో మమేకమై, వారి అభివ్యక్తిలో ఉద్విగ్నుడై, ఆయన పొందిన అనుభూతుల కుమ్మరింతగా ఈ రచన కనపడుతుంది. ఇన్ని దేశాల, ఇంత వైవిధ్యభరితమైన రచనల పరిచయాలు పాఠకుడు ఒక రసానుభూతి పొందేలా అందించడంలో దిలావర్ ప్రతిభ కనబడుతుంది.

కవిత్వాన్ని, రచనలను, రచయితను ఎకడమిక్‌గా పరిచయం కాకుండా ఆయా కాలాల్ని, దేశాల రాజకీయ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితుల్ని అవగాహన చేసుకున్నదంతా తెలిపే ప్రయత్నం చేశారు. అంతేకాదు రచయితల నేపథ్యాన్నీ సమగ్రంగా వివరించడం వల్ల, వారి రచనా పరిచయంలో మనం నిమగ్నులమవుతాం. ఇది చాలా గొప్పగా చేశారు రచయిత. ఈ గ్రంథం ప్రత్యేకతల్లో ఇది ముఖ్యమైనది. ఒకటీ రెండూ మినహాయిస్తే ఎంచుకున్న రచనలూ, రచయితలు ఆయన ఆలోచనలను ప్రతిబింబిస్తాయి.

ఇందులో పద్దెనిమిది వ్యాసాలున్నాయి. మొత్తంగా చూస్తే మూడు భాగాలుగా మనం చదవొచ్చు. అమెరికా కవులు, అమెరికా యుద్ధ వ్యతిరేక కవిత్వం, బ్లాక్ ఆఫ్రికన్, నీగ్రోలు సృష్టిస్తున్న సాహిత్యం, మూడోది అరబ్ దేశాలలో వస్తున్న ప్రతిఘటన, యుద్ధ వ్యతిరేక, స్త్రీ అసమానతలపై వస్తున్న సాహిత్యం, చైనా, ఫ్రెంచి, జపాన్, ఫారసీ కలిరూమీ గురించి ఒక్కో వ్యాసం ఉంది.

మొదటి వ్యాసం అమెరికా కవిత్వ ప్రేమికుల అభిరుచికి మచ్చుతునక. 'An Invitation to Poetry' రాబర్ట్ పిన్‌స్కీ, మాగీ డైట్‌ల సంపాకత్వంలో 200 మంది కవుల ఆంగ్లానువాదాలున్న కవిత్వాలను పరిచయం చేశారు. ఇందులో బాగా నచ్చిన అంశమేమంటే పాఠకులు ప్రత్యక్షంగా పాల్గొని ఆ కవితలపై తమ అనుభూతులను పంచుకోవడం. జ్ఞాపకాలు (నోస్టాలజీ) యుద్ధ ఫలితాలు, ప్రేమ మొదలైన అంశాలు ప్రధానంగా వున్నాయని వివరిస్తారు.

రెండవది 'వ్యధార్థ జీవిత యధార్థ దృశ్యం' అమెరికా ఆదివాసీ నవల 'సెర్మని' గురించిన పరిచయం. లెస్లీ మార్మన్ సిల్కో అనే రచయిత్రి తన 'లగూనా' జాతి ఆదివాసీల జీవన సమరాల్ని ఎలా చిత్రీకరించిందో వివరించారు. బహుళ జాతి సంస్థలు అడవుల ఆక్రమణలలో వారి జీవితాలను, సంస్కృతిని విధ్వంసం చేయడం, నవజో యురేనియం కర్మాగారం నెలకొల్పి గిరిజనుల ఆరోగ్యాన్ని ఎలా ఛిద్రం చేసిందీ వివరిస్తారు. ఇది ప్రపంచమంతా ఎదుర్కొంటున్న సమస్య.

సోమాలియాలో పుట్టిన అయాన్ హిర్సీ అలి రాసి నిర్మించిన సినిమా సబ్ మిషన్ పార్ట్-1. ముస్లిం స్త్రీల స్వేచ్ఛా జీవితం కోసం,




హక్కుల కోసం రాసినది. బురఖాల క్రింద స్త్రీల హక్కులు ఎలా సమాధి అవుతున్నాయో చెబుతూ ఇస్లాంలోనే వుంటూ మత ఛాందసాన్ని ప్రశ్నించడాన్ని, ఈ సినిమా తెరకెక్కిన కతను వివరించారు.

పాలస్తీనా పాలవెన్నెల - దర్వీష్ కవిత్వం. తన దేశంలో తాను ప్రవాస జీవితం గడుపుతూ 20 కవితా సంపుటాలు వెలువరించి పాలస్తీనా ప్రజా కవిగా ఎదిగిన విధానాన్ని పరిచయం చేశారు. "ప్రజల కోర్కెలకు, కలలకు ఒక భాషను కూర్చిన కవిగా దర్వీష్‌ను పేర్కొన్నాడు." ఆయుధాలను పదును పెట్టడమే విప్లవం కాదు. అక్షరాలను పదును పెట్టేవాడు కూడా విప్లవకారుడే. కన్నీళ్ళను కవిత్వీ కరించడం కన్నా విప్లవ పంథా ఏముం టుంది? అని జీవిత మంతా ప్రజా సాంస్కృతిక ఉద్యమ కర్తగా, విప్లవ రాజకీయ వేత్తగా ప్రజాస్వామ్య పోరాటంలో అగ్రభాగాన నిలబడ్డారని దర్వీష్‌ను పరిచయం చేశారు.

కవిత్వం గుభాళించిన నల్లకలువలు అని దడ్లీ రండల్ సంపాదకత్వంలో "బ్లాక్ పొయెట్స్" అనే బ్లాక్ అమెరికన్ల కవితా సంపుటిని పరిచయం చేశారు. తొలినాళ్ళలో తెల్లకవుల సాహిత్య రీతులు అనుసరించిన నల్లకవులు, తెల్లవారి వివక్ష ఆ తరువాత తమ భాష వైపు, సంస్కృతి వైపు మళ్ళి తమ మూలాలలోకి పోయి గొప్ప కవిత్వాన్ని సృష్టించారని తెలుపుతారు. "పండ్లలా, వృక్షాల్లా కవిత్వం ప్రయోజనకారి కాకపోతే అది ఉత్త చెత్త. మేం రక్తమాంసాలున్న పదాలను కోరుకుంటున్నాం" అనే వారి అభిప్రాయాలనూ పరిచయం చేయడం ఎంతో ప్రేరణ కలిగిస్తుంది.

ఆఫ్రికన్ అమెరికా రచయిత రిచర్డ్ రైట్ రాసిన 'నేటివ్ సన్' అనే నవల నీగ్రోల గురించినది. నీగ్రోల నేరపూరితమైన జీవనశైలికి మూలాలను లోతుగా చిత్రించిన నవల. జాతి వివక్షతపై వుందని తెలుస్తుంది.

ఆఫ్రికన్ - అమెరికన్ మాయాఏంజిలో 1993లో 'ఆన్ ది పల్స్ ఆఫ్ ది మార్నింగ్' అన్న కవితను చదువుతుండగా టీవీల్లో ప్రపంచవ్యాప్తంగా ప్రసారం చేశారని చెప్తూ ఆమె జీవితాన్ని చెపుతుంటే ఒక కథలా అనిపిస్తుంది.

అమెరికా ఆధునిక కవిత్వం ఈ వ్యాసం ద్వారా తెలుస్తుంది. ఆకలితో అనాధగా ప్రారంభమైన ఆమె జీవితం ధైర్యంగా, స్వశక్తితో ఎలా అంతర్జాతీయ ఖ్యాతిని పొందిందో తెలియపరుస్తుంది. నేటి ఆధునిక సమాజంలోనూ కవిత్వానికి మంచి భవిష్యత్తు వుందని వ్యాసం చదివితే తెలుస్తుంది.

'నేను నిష్క్రమిస్తున్నాను. నా ఉద్యమం ప్రారంభమవుతుంది' అని మరణానికి ముందు ప్రకటించిన 'కెన్‌సారోవివా'తో పాటు మరో ఎనిమిది మందిని నైజీరియాలో 1995లో ఆనాటి కీలుబొమ్మ ప్రభుత్వం ఉరితీయడం మనకు తెలుసు. ప్రపంచీకరణ విసిరిన పంజాకు బలైన దేశాల్లో నైజీరియా ఒకటని అందులో నుండి 1988లలో వచ్చిన కవితలలో పెట్రోలు కోసం చేస్తున్న యధార్థాల గురించి దోపిడీ, సామ్రాజ్యవాదపు దౌర్జన్యాన్ని గురించి ఎలా కవులు స్పందించిందీ వివరించారు.

అలాగే మన కలకత్తాకు చెందిన చిత్రా బెనర్జీ దివాకరుని 'బ్లాక్ క్యాండిల్' కవితా సంకలనం, మన ఉపఖండంలోని స్త్రీల విషాద జీవితాలను ప్రతీకాత్మక ధోరణి ధ్వనించేట్లుగా చిత్రించడాన్ని వివరిస్తారు. మనకు ఆదికావ్యమెలాంటిదో ఫార్సీ సాహిత్యానికి రూమీ రాసిన 'మస్నవీ' అలాంటిది. ఎప్పుడో 1207లో జన్మించిన రూమీ, షమ్స్ కలయికలో స్నేహం, ప్రేమ ఆధ్యాత్మికత కలగలిసిన తాత్విక కవితాధారను పరిచయం చేశారు.

వియత్నాం యుద్ధ కవిత్వాన్ని పరిచయం చేస్తూ అమెరికా దురాక్రమణను పాతికేళ్ళు యుద్ధం చేసి ఎదుర్కొని తరిమికొట్టిన ఒక బడుగు దేశం వియత్నాం. దేశీయ సాహిత్యాన్ని , జాతీయ స్వభావాన్ని దక్కించుకోవడం కోసమూ చాలా కాలం కృషి చేసింది వియత్నాం. ఆ క్రమంలోనే యుద్ధ వ్యతిరేకత, శాంతిని కోరుకోవడం అక్కడి కవుల్లో వ్యక్తమైందని, అలా వచ్చిన సంకలనమే Huyhh సంపాదకత్వం వహించి, ఆంగ్లానువాదం చేసిన "An Anthology of Vietnamese Poems." 'Art is for Human Life's Sake' అన్న దృక్పథంలో కవితలున్నాయని వివరించారు.

11 సెప్టెంబర్, 2001 నాటి సంఘటనలో అరబ్ దేశాలలో సంభవించిన సంక్షోభం, వారి జీవన శైలి పైనా, సాంస్కృతిక అస్తిత్వంపైనా పెద్ద ప్రభావాన్ని చూపిందని, అమెరికా ఆధిపత్య, నియంతృత్వ విధానాలతో, యుద్ధ కాంక్షతో సృష్టించిన విధ్వంసం అరబ్ ప్రపంచాన్ని ఎంత కల్లోలం చేసిందని, ఆ నేపథ్యంలో సాదీ సిమేవ్ డానియల్ లీస్ బోర్డ్‌తో కలిసి 'Iraq Poetry Today' అన్న 40 కవితల సంకలనాన్ని ఇంగ్లీషులోకి అనువదించి తీసుకొచ్చారు. ఇరాక్‌లో కుర్దులపై జరిగిన అంతర్గత యుద్ధాన్ని, ఇరాక్‌పై అమెరికా జరిపిన యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ Every morning the war gets up from sleep అన్న అల్ అజావీ రాసిన కవితను "ప్రతి ఉదయం, యుద్ధం నిదుర నుండి మేల్కొంటుంది. తుపాకులు నిరంతరం మోగుతూనే ఉంటాయి. / ఎడారి మరణాలతో నిండిపోతుంది / సైనికులు ట్యాంకుల మీద మూత్ర విసర్జన చేస్తారు / మంటలకు బూడిదకు మధ్య వంతెన నిర్మింపబడుతుంది / మిలటరీ కోర్టులను ట్యాంకులు కాపలా కాస్తుంటాయి. ఒక యుద్ధానికీ మరొక యుద్ధానికీ మధ్య మా ప్రవాస జీవితం విశాలమవుతుంది / అంతులేని భయంతో మనసును హింస పెడుతూ, తన జ్ఞాపకాలను బురదలో తొక్కిపెడుతూ ప్రతి ఉదయం యుద్ధం నిదుర నుండి మేల్కొంటుంది" అని తెలుగులోకి అనువదించి ఇరాక్ యుద్ధ వ్యతిరేక కవిత్వాన్ని పరిచయం చేశాడు. బేక్స్ రాసిన 'Oh, Moon' అన్న కవిత "ఓ చంద్రమా! నువ్వూ నేను కొన్ని అనుభవాలను పంచుకోవాల్సి వుంది / నిశితంగా, కన్నార్పకుండా చూసే సంచారులం మనం / ఈ పట్టణ వాసాల నుండి సుదూరంగా వున్న నాలాగే నువ్వూ మన యీ విశాల ఆకాశంలో ఒంటరిగా, పాలిపోయి కళావిహీనంగా వున్నావు / ఓ చంద్రమా ! నీ విచారానికి ముఖంలో మౌనం, దుఃఖం పేరుకోవడానికి ఏమిటి కారణం? / శారీరక మానసిక బాధలు తట్టుకోలేక ప్రేమలో తమని తాము కోల్పోయిన ఎంతమంది యువ జంటలను నువ్వు చూశావు? ఎంత మంది నియంతలను, వీరులను చూశావు? ఎన్ని జాతుల్ని, దేశాలను, నగరాలను, ఎన్ని

దురాక్రమణలను, అన్యాయ యుద్ధాలను, కుర్దిస్తాన్ పట్టణాలపై పడ్డ ఎన్ని బాంబులను చూశావు? యుద్ధంలో ప్రాణాలర్పించిన యువ త్యాగధనులపై కప్పబడిన ఎన్ని రక్తవర్ణ కఫన్‌లను చూశావు? 'ఓ చంద్రుడా! అన్యాయాలను, దుఃఖాన్ని, కన్నీళ్ళను చూడటం వల్లే నువ్వింత విచారంగా పాలిపోయి వున్నావు" అంటూ ఇరాక్ కవిత్వాన్ని తెలుగులోకి వినిపించడం దిలావర్‌గారి కవితాత్మక హృదయాన్ని తెలియజేస్తుంది. అంతేకాదు ఇరాక్‌లో క్రొత్తగా వస్తున్న కవితా అభివ్యక్తి, వస్తువూ మనకర్థమవుతాయి. అసలు ఇరాక్, ఇరాన్, అరబ్ దేశాల నేటి కవిత్వాన్ని దిలావర్‌గారు తెలుగించి తెస్తే బాగుంటుంది.

ఇక అమెరికాలో అమెరికా యుద్ధ వ్యతిరేక కవిత్వం శామ్‌హామిల్ సంపాదకత్వంలో 2003లో 174 మంది కవులతో కవితా సంకలనాన్ని వెలువరించారని – ఈ సంకలనంలో తొమ్మిదేండ్ల బాలికల నుండి 90 ఏండ్ల వృద్ధుల వరకు నాలుగు తరాల వారు పాల్గొనడం విశేషమని పరిచయం చేశాడు. 'పీటర్ లెవిట్' రాసిన కవిత "ఈ వాయుగోళాన్ని కవితలతో ఎంత దట్టంగా నింపుతావంటే వాటి గుండా బాంబులు కూడా పడకూడదు" అని కవిత్వపు శక్తిని చెపుతాడు.

Chiapas అన్న హోలీథామస్ కవితను "ఓ బిడ్డా నువ్వెవరో నాకు తెలియదు. నీ దేశాన్ని నేను ఎప్పుడూ చూడలేదు / నీ మాతృభాషనెప్పుడూ మాట్లాడలేదు / ఒక పాత వ్యవసాయ క్షేత్రంలో నువ్వు పడుకొని ఉండటం వల్ల చమురుతో తడిసిన గుడ్డ పీలికలా నువ్వు కాలిపోవడం మాత్రం నేను చూస్తున్నాను'' అంటూ ఉదహరించారు. అమెరికా కవులు యుద్ధాన్ని వ్యతిరేకించడమే కాదు కవిత్వం ఎలా వుండాలని చెబుతున్నారో చెబుతూ షెర్మన్ పేల్ రాసిన కవితలను ఇలా తెలుగు చేసి వినిపించారు. "యుద్ధంలో ప్రేమభావంతో విషాదంగా మరణించే మనుషుల వార్తలకు కవిత వాహిక కావాలి / మరణించిన వారి 'వాయిస్'కు కవిత కాగితపు మెగా ఫోన్ కావాలి / ఈ ప్రంచంలో ఏం పోగొట్టుకుంటున్నామో వాటి జాబితా కావాలి కవిత / ఆడెన్ స్వాగతించిన ప్రేమ రూపమెత్తాలి కవిత / కవిత్వం రుగ్మతలకు రాసిన ప్రిస్క్రిప్షన్ కావాలి / పదాలను తుడిచిపెట్టే రక్తం కాకూడదు / యుద్ధ కవితలన్నీ కలిపి కుట్టిన – దూదిలో నింపిన రగ్గు కావాలి / దాన్ని మనం భుజాల చుట్టూ కప్పుకుందాం. ఈ కవితలా అది రాత్రుల్లో వెచ్చగా ఉంటుంది." ఇలా చాలా కవితలు తెలుగు చేసి వినిపించడం వల్ల అమెరికా ప్రజల మనోభావాలకూ, ప్రభుత్వ దమన నీతికి వున్న తేడా తెలుస్తుంది.

ఇక జపాన్ నీలిమేఘాలు వ్యాసంలో మన తెలుగులో వచ్చిన స్త్రీ వాద కవిత్వం 'నీలి మేఘాలు'లా పూర్తి స్త్రీవాద కవిత్వం కాకున్నా స్త్రీల సమస్యలపై వచ్చిన సంకలనంగా పరిచయం చేశారు. Kenneth Rexroth, I Kuko Astnmi లు సంపాదకులుగా ఆంగ్లానువాదం చేసిన 'Women Poets of Japan' అన్న కవితా సంకలనంలో టోక్యోలోని Ishigakirih సామాజిక ఉద్యమకార రచయిత్రులలో అగ్రగణ్యురాలు "స్త్రీ విజయం లైంగిక సమస్యల మీద కన్నా – సామాజిక సమస్యల మీదనే ఎక్కువ ఆధారపడి వున్నదని ఆమె విశ్వాసమంటూ కవితల్ని పరిచయం చేశారు.

అమెరికాను కొలంబస్ కనుగొనడంతో పులకించిన ప్రపంచానికి మరో కోణాన్ని అందిస్తూ విధ్వంసం అక్కడే మొదలైందని, అమెరికన్ 'నేటివ్స్'తోటే ఆ విధ్వంసం ఆరంభం కావడంలోని విషాదాన్ని వర్ణిస్తూ ఖండ ఖండాంతరాల నుండి బ్రిటిష్‌వారు, డచ్‌వారు, స్పానిష్‌లు, స్కాట్స్, జ్యూయిష్‌లు, ఐరిష్‌లు, స్వీడిష్‌లు, అపలాచియాన్, సీరానెవెడా పర్వత పంక్తుల్లో విస్తరించి నయాగరా జలపాతంలా విరుచుకుపడి అంతర్యుద్ధాలతో నేటివ్ అమెరికన్స్ వెన్ను విరిచారని పమేలా కవిత్వాన్ని పరిచయం చేస్తూ వివరిస్తారు. ''One legged Dancer'' అన్న Pamela Usehuk కవయిత్రి కవితా సంకలనాన్ని గురించి చెబుతూ మెక్సికన్ నేటివ్స్ ఎలా దారుణంగా దోపిడీకి గురయ్యారో ఆమె శక్తివంతంగా వినిపించిన విషయాన్ని వివరిస్తారు.

గ్రేట్‌వాల్ దాటిన చైనా కవిత్వం అన్న వ్యాసంలో 1989 తియనాన్‌స్క్వేర్‌లో జరిగిన సంఘటన తరువాత చైనా విడిచి పెట్టి వెళ్ళిన ముగ్గురు చైనా కవుల కవిత్వాన్ని పరిశీలిస్తారు. వీళ్ళు రాసిన అనేక కవితలను అనుదించి అందించారు. కానీ చైనాలో వున్న కవుల కవిత్వం ఏదైనా తీసుకుని పరిచయం చేస్తే చైనా కవిత్వ తీరును ఇంకా ఎక్కువగా తెలుసుకునేందుకు దోహదపడేది.

ఆధునిక అరబ్ కవిత్రయం మహమూద్ దర్వీష్, సమీ అల్ ఖాసిమ్, అడోనిస్‌ల Victims of a Map అన్న కవితా సంపుటిలో అరబ్బీ భాష కవితలు, ఆ ప్రక్కనే ఆంగ్లానువాదాలు ఇచ్చారని తెలుపుతూ అరబ్ ప్రపంచం ఎదుర్కొన్న అన్ని సంక్షోభాల నేపథ్యంలోంచే ఆధునిక కవిత్వం రూపుదిద్దుకొందని, వారి కవిత్వాన్ని పరిచయం చేశారు. ఇక చివరగా ఫ్రెంచి ప్రతీకాత్మక కవిత్వాన్ని పరిచయం చేస్తూ 'ప్రతీక' అని దేనినంటారు అనే చర్చ చేశారు. "కేవలం కవితావేశం వల్లనే కవిత్వం పుడుతుందనేది నమ్మదగిన అంశం కాదని, పరిశ్రమ లేకుండా ఏ రంగంలోనూ ఫలితం దక్కనట్టే కవితా క్షేత్రంలో కూడా అని. కవి నిరంతరం పరిశ్రమించాలి, సాధన చేయాలి" అన్న బోదిలేర్ భావనలను అందించారు. C.F. Mae Intyre అనువాదం చేసిన 'French Symbolist Poetry' అన్న ఎనిమిది మంది కవుల కవితా సంకలనాన్ని పరిచయం చేశారు.

మొత్తం ప్రపంచ సాహిత్యపు కొన్ని పుటల్ని మనముందుంచిన దిలావర్‌కి తెలుగు సాహిత్య లోకం అభినందనలు తెలుపుతుంది. ఇలాంటి రచనలు ఇంకా మనకు అందాల్సి వుంది. ఈ ప్రయత్నం చేస్తున్నవారు తెలుగులో చాలా తక్కువ. ప్రపంచ సాహిత్యాన్ని ఎప్పటికప్పుడు మన సాహితీకారులు తెలుసుకుంటూ, మన తెలుగు సాహిత్యాన్నీ ప్రంచానికి అందించాల్సిన అవసరమూ వుంది.

'దూరాల చేరువలో...' పరిచయమైన అన్ని వ్యాసాలలోనూ, ఆయా రచయితలు, కవులు వారు అనుభవించిన జీవితాలను, వారి చుట్టూ వున్న, వారిలాంటి ప్రజల జీవితాలను చదివి, పరిశీలించి స్పందించిన రచనలే కనిపిస్తాయి. ముఖ్యంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ప్రభావాలపై స్పందనగా, వ్యతిరేకంగా వస్తున్న రచనలు, స్త్రీలు, దళితులు, నీగ్రోలు, బ్లాక్స్ పట్ల వివక్షతలపై వచ్చిన సాహిత్యం ఎక్కువగా వుంది.

అయితే కవుల, రచయితల రచనలతో తాదాత్మ్యం చెంది పరిచయం చేశారు దిలావర్‌గారు. దీనికి తోడుగా ఒక విమర్శనా దృష్టిని కూడా జోడించి విశ్లేషణ చేసినట్లయితే బాగుండేదనిపించింది. ఈ దేశాలలోని ఒకే కాలపు సాహిత్యాన్ని తీసుకుంటే నేటి తరానికి ఇంకా ఉపయోగంగా ఉంటుంది. ఇవి సూచనలే కానీ లోపాలు కావు. ఇలాంటి రచనలు మరిన్ని తీసుకురావాలని కోరుకుంటూ, దూరాల్ని జయించిన దిలావర్‌కి సలామ్.

•

# బాడీ చెకప్

- ఎమ్వీ రామిరెడ్డి

అంతా ఆనందంగానే ఉంటుంది
ఆహారం, నిద్ర, ఉద్యోగం, డబ్బూ
వారంతపు విహారాలూ కన్నబిడ్డల చదువులూ
శయనిస్తే ఏసీ, కదిలితే కారు, పిలిస్తే నౌకరూ...
అంతా అందంగా ఆనందంగానే ఉంటుంది.
ఉన్నట్టుండీ ఓ కలవరం
గుండెల్లో సన్నగా సలవరం
తలచుట్టూ రోకళ్ళ పోటు
కాళ్ళవెంట గాయాల కవాతు
ముగ్గురు స్పెషలిస్టులు మారినా
రోగం అంతుబట్టలేదు
'కార్పొరేట్' శరణం గచ్ఛామి
ఫుల్‌బాడీ చెకప్పే ప్రథమ చికిత్సన్నారు
రక్తం, మూత్రం, మెదడు, కిడ్నీ, కీళ్ళు...
అన్నీ అల్ట్రావయొలెట్ కిరణాల క్రీడలో వేడెక్కాయి
ఫలితాల ఫైలును ఎగాదిగా చూసిన వైద్యదిగ్గజాలు
శరీరం పొడవునా, లోపలా, బయటా
ఎక్కడా ఏ లోపమూ లేదని తేల్చేశారు.
నలభై దాటకముందే అనారోగ్యాన్ని మోసుకుంటూ
దిగులు దిగులుగా కాలం వెంట నడక!



. . .

ఆ సాయంత్రం చిన్నాన్న వెంట
పొలం దాకా వెళ్లడం అపురూపమైన అనుభవం
అకాశం కింద
ఎగురుతున్న పక్షుల రెక్కల కింద
పైరగాలిలో ముద్దగా తడుస్తుంటే
నా నిలువెల్లా స్వేదపుష్పాల పరిమళం!
నాగేటిచాళ్ల నడుమ నిలబడినప్పుడు
రక్తప్రసరణలో సయ్యాటలూ సరాగాలూ!
జమ్మిచెట్టుకింద కూచొని
ఆవురావురుమంటూ సల్లబువ్వ తింటున్నప్పుడు
శరీర పొలిమేర దాటి గాలిలో కలుస్తున్న ఆవిర్లు...
ఆ ఆవిర్ల నిండా పిజ్జాలు బర్గర్ల వాసన!
బుర్రలోని బురదేదో కరిగిపోయి
కాంతిరేఖలు విచ్చుకుంటూ..!

. . .

వరిమడుల మధ్య వయ్యారంగా నడవడం ఒక అద్భుతం
అదొక వైద్యం అదొక నైవేద్యం అదొక శరీరసేద్యం
పొలం పక్కనే పరుగులు తీసే కాలువనీటి గలగలల్లోంచి
సంగీతాన్ని గుండెల్లో నాటు పెట్టుకోవడం ఒక కళ
అదొక మత్తు అదొక శరం అదొక శస్త్రచికిత్స!
ఎరువు బస్తా అమాంతం భుజాలకెత్తుకున్న మావయ్య,
బురదలో విత్తనాలు వెదబెడుతున్న బుల్లెమ్మ
పక్క పొలంలో దమ్ముచేస్తున్న సూరిగాడు,
వాగొడ్డున గేదెల్ని మేపుతున్న శీనుగాడు,
ఎటుచూస్తే అటు సజీవ దృశ్యాల సమ్మేళనం
అదొక ప్రకృతిపాఠం అదొక ప్రాణనాదం
అదొక జీవితం అదే జీవితం!
సాయంత్రానికి నన్ను విప్పి చూసుకుంటే
రక్తనాళాల నిండా పైరగాలుల ప్రవాహం
పార్శ్వనొప్పి మాయం గుండె సలవరం అదృశ్యం
చేతుల్లో చైతన్యం కాళ్లల్లో కదనోత్సాహం
దేహం నిండా దీపాల వెలుగు
తలచుట్టూ వయొలిన్ల వాయుగానం

. . .

మట్టిముద్దల్ని అన్నం ముద్దలుగా మారుస్తున్న
బంగారు నేలతల్లి సాక్షిగా చెబుతున్నాను
బాడీ చెకప్ కోసం గ్లోబల్ అస్పత్రులక్కాదు
పొలం దవాఖానా దాకా నడవాలి
చిటికెడు మట్టి మాత్రల్ని నోట్లో వేసుకోవాలి
చెమటతో తడిసిన చెలకల లేపనాన్ని
ఒంటినిండా పూసుకోవాలి
నక్షత్రాలు శరీరంలోకి ప్రవేశిస్తాయి
కాంతిపుంజాలు కళ్లల్లో కాపురం పెడతాయి
ఆ వెలుతురులో మనల్ని మనం పుటం పెట్టుకోవచ్చు
మనలోని చీకట్లను మట్టిలో కలిపెయ్యొచ్చు!

---

# కాన్వెంట్

- శక్కర దీక్షత్ కుమార్




యాజమాన్యాల ఉక్కు చేతులు
నియంతల కౌగిలింతలు
నియంత చెప్పిందే వేదం
చేసేదే ధర్మం
నియంతకు సెలవులంటే రుచించదు
అరిచి, అరిచి గొంతు బొంగురు పోయి
కీచుమంటుంటే నియంతకు
అదే మహాసంగీతం

ఉపాధ్యాయుడు మేధావో దద్దమ్మో
అతని కనవసరం
ఛిద్రమైన అతని జీవితమూ ఇతనికొద్దు

నియంత మాటకో అర్థం, అడుగుకొక దారి
మాటల్లోనే ధనమదాంధ అహంకారం
ఇన్ని రోజులు చదివింది ఒకటి
ఇపుడు చేయవలసింది మరొకటి
ప్రైవేటు ఉపాధ్యాయుడు నియంత చేతిలో
ఒక మరబొమ్మ
ఎన్ని రోజులు ఈ దురవస్థ
ఎప్పుడు మారును ప్రైవేటు స్కూలు వ్యవస్థ?

కథ

# మీరెందుకు చచ్చిపోయారు!

డిప్యూటీ హాస్టలు వార్డెనుగా నియామకం పొందడం, ఇతర వార్డెన్లకిచ్చినట్లే నాక్కూడా కూడా పై అంతస్థులో ఒక ఇనుపరేకు మంచం, ఒక స్పాంజి పరుపు - అప్పటికే ముక్కలుగా విడిపోతున్నప్పటికీ, కేటాయించడం, నాతో తెచ్చుకున్న తాతలనాటి ట్రంకు పెట్టెలోనుండి ఒక మాసిన దుప్పటిని తీసి దానిని ఆ మంచం మీద పరచుకోవడం అన్నీ చకచకా జరిగిపోయాయి.



- ముక్కామల దేవీ నాగమోహనరావు

నెలకు నూటపాతిక రూపాయల జీతం. బి.ఎ మాథ్స్‌తో చదవడం వలన పదవతరగతి పిల్లలకు లెక్కలు చెప్పాలి. ఉదయం ఐదు గంటలనుండి పని ప్రారంభమవుతుంది. ఆరునుండి ఎనిమిది వరకు 'స్టడీ పీరియడ్స్' ఎనిమిది నుండి తొమ్మిది వరకు బ్రేక్‌ఫాస్ట్. డైనింగు హాలు వేరే బిల్డింగులో వుంది. డిప్యూటీ వార్డెన్లు తామందరూ కలిసి ఎనమండుగురు. అల్పాహార, భోజనసమయాల్లో డైనింగు హాల్లో తాము పిల్లలను పర్యవేక్షణ చేయాలి. మధ్యాహ్నం ఒంటిగంటనుండి రెండుగంటల లోపు లంచ్. సాయంత్రం నాలుగున్నర నుండి అయిదున్నర వరకూ ప్లే గ్రౌండులో పిల్లలు ఆడుకుంటున్నప్పుడు కూడా తామందరూ వాళ్ళను కనిపెట్టుకొని వుండాలి. ఆరునుండి ఏడువరకు రాత్రి భోజనం. ఏడునుండి తొమ్మిదివరకు 'స్టడీపీరియడ్స్' తొమ్మిది తరువాత పదినిమిషాల్లో పిల్లలందరూ తమ తమ పక్కలమీద వుండాలి. తొమ్మిది పదిహేనుకు గదుల్లో బెడ్‌లైట్లు మినహా మిగిలిన లైట్లన్నీ ఆర్పివేస్తారు. చుట్టూ నలుచదరంగా వున్న ఆ రెండతస్థుల హాస్టలు భవనం ఆవరించుకొని వున్న విశాలమయిన ఖాళీస్థలం నడుమ గుండ్రంగా, ఎత్తుగా కట్టిన అరుగు మధ్యలో నున్న ఎలక్ట్రిక్ పోల్ నుండి వచ్చే గుడ్డి వెల్తురు తప్ప మరి ఏమీ వుండదు. శలవురోజుల్లో 'స్టడీ పీరియడ్లు' ఎక్కువ వుంటాయి. ఆదివారాలు సాయంత్రం నాలుగు గంటలకు కనీసం నలుగురు వార్డెన్ల అజమాయిషీలో పిల్లల్ని బయటకు వెళ్ళడానికి అనుమతిస్తారు. స్టడీ అవర్లలో పాఠాలు అప్పగించని పిల్లల వీపులమీద వార్డెన్లు వేసే పిడిగుద్దులతో హాస్టల్ భవనమంతా దద్దరిల్లుతూవుంటుంది. పిల్లలు కార్చే కన్నీళ్ళు వార్డెన్లపట్ల వాళ్ళకు గల అసహ్యాన్ని, ద్వేషాన్నీ వెళ్ళగక్కుతూవుంటాయి. ఒక వార్డెను ఎంత క్రూరుడంటే డైనింగుహాల్లో ఆరవతరగతి పిల్లవాడొకడు కొంచెం 'మిస్‌బిహేవ్' చేశాడని వాడి వీపుమీద అతడు గుద్దిన గుద్దుకు వాడు తిన్న అన్నమంతా అక్కడే కక్కేశాడు. నాకు క్రమంగా ఏవగింపు కలగడం ఆరంభమయింది. ఒక్కొక్కసారి అక్కడినుండి ఎలాగైనా పారిపోవాలనిపించేది. తనుకూడా కొట్టడం గొప్పనుకొని, పాఠం చెబుతూండగా పక్కకుర్రాడితో ఏదో మాట్లాడుతూ నవ్వాడన్న వంకతో ఒక పిల్లాణ్ణి గదికి పిలిపించుకుని, వాడిని చాచి లెంపకాయ కొట్టినప్పుడు వాడు చూసిన చూపు, కార్చిన కన్నీళ్ళు, అది తెలిసి వాడి తోటి పిల్లలు అసహ్యించుకుంటూన్న తీరును నేనెన్నటికీ మరువలేదు.

హాస్టలులో చాలా కఠినమయిన నియమ నిబంధనలను అమలు చేస్తారు. వార్డెన్లు కూడా ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం ఎంతో అవసరమైతేనేగాని చేయకూడదు. సంవత్సరాల తరబడి పనిచేస్తూవున్న మదించిన వార్డెన్లు కొందరున్నారు. ఫ్రీ బోర్డింగు, లాడ్జింగూ కావడం వలన హాస్టలునే పట్టుకొని వేళ్ళాడుతూ వుంటారు. వాళ్ళ మాటలూ, చేష్టలూ తనకు నచ్చేవి కావు. పిల్లలను కొట్టడంలో వాళ్ళు పైశాచికానందం అనుభవిస్తూవుంటారు.పండుగ శలవులిచ్చినపుడు మాత్రం వాళ్ళు తమ ఇళ్ళకు వెళ్తుంటారు.

అప్పటికి నేను హాస్టలులో చేరి పదిహేనురోజులయివుంటుంది. ఒక రాత్రి సుమారు పన్నెండు గంటలకు ఎవరో సన్నగా రోదిస్తున్న ధ్వని విని తను ఉలిక్కిపడి లేచాడు. వార్డెన్లకు పై అంతస్థులో నలుగురికి, కింది అంతస్థులో నలుగురికి హాల్లు కేటాయించారు. నేనున్నది పైన ఈశాన్యంలో వున్న చివరి హాల్లో. ఏడుపు వినబడుతున్నది సరిగా నేనుండే హాలు క్రింది భాగంనుండే. ఆ భాగం ఒక ఫ్యామిలీ

పోర్షను అనీ, అందులో స్కూలు ఎక్కౌంటెంటు కుటుంబంతో ఉంటున్నారు. తనతో ఉండవలసిన ముగ్గురు వార్డెన్లు ఆ సమయంలో హాల్లో లేరు. నేను ఆశ్చర్యపోతూ హాలు బయటికి వచ్చి చూశాను. ఆవరణ మధ్యలో వున్న ఎలక్ట్రిక్ పోల్‌నుండి వస్తున్న గుడ్డి వెల్తురు, ఈ చివరినుండి ఆ చివరివరకూ వున్న వరండాలో ఏవేవో నీడల్ని పరచుకొనేటట్లు చేస్తూంది. ఉన్నట్లుండి కదుల్తూ వున్న ఆ నీడలు భయభ్రాంతుణ్ణి చేశాయి. ఒళ్ళంతా ఒక్కసారి ఝల్లుమని, చెమటలు పట్టాయి. తను చటుక్కున తిరిగి హాల్లోకి వచ్చి, మంచం ఎక్కి దుప్పటికప్పుకొని పడుకొని, ఆ దుప్పటిలోంచి చిన్న సందుచేసుకొని చూడడం మొదలుపెట్టాను. కాస్సేపడికి ముగ్గురు వార్డెన్లూ తూలుతూ, సన్నగా వెకిలి నవ్వులు నవ్వుకుంటూ హాల్లోకి వచ్చి ఎవరి మంచాలను వాళ్ళు ఆక్రమించి క్షణాలలో నిద్రలోకి జారుకున్నారు. నాకు చాలాసేపటిదాకా నిద్రపట్టలేదు. ఆ రోదన ఒక స్త్రీ రోదనలాగనే వుంది. ఎవరైవుంటారని ఆలోచిస్తూండగానే నిద్రపట్టింది.

మర్నాడు కొంచెం మృదుస్వభావిగా కనిపించిన శ్రీరాం అనే వార్డెనుతో గత రాత్రి జరిగిన విషయమంతా చెప్పాను. శ్రీరాం కొంచెం సేపు మౌనంగా ఉండి, నెమ్మదిగా మాట్లాడసాగాడు.



''నాతో చెప్పినట్లు ఈ విషయాన్ని ఎవరికీ చెప్పకండి. ఇక్కడ మనం చూసీచూడనట్లుగా పోవలసిన విషయాలు చాలా వున్నాయి. అంటే, అవేవో గొప్ప రహస్యాలనుకోకండి. వాళ్ళు చేసే పనులకు మనం ఆటంకంగా వున్నామని తెలిస్తే మన ఉద్యోగాలు పోయే పరిస్థితి వస్తుంది. ప్రస్తుతం మనకిక్కడ తిండికీ బట్టకీ లోటు లేదు. ఈ ఉద్యోగం ఆధారంతోనే మనం మరో మంచి ఉద్యోగం వెతుక్కోవాలి......."

అతడు కొన్ని క్షణాలు ఆగి, కొంచెం నవ్వి, తలఎగురవేసి మళ్ళా చెప్పడం కొనసాగించాడు.

"మన వార్డెన్లు తక్కువ వాళ్ళు కాదు. అందరూ కాదనుకోండి. రాత్రుళ్ళు తాగుతారు. వీలయితే వెధవ వేషాలుకూడా వేస్తారు. ఇదంతా 'స్టడీ పీరియడ్స్' అయిపోయి, అంతా సద్దుమణిగిన తరువాత చేస్తారు. వాళ్ళకు మాత్రమే తెలిసిన రహస్యమార్గం ద్వారా హాస్టలు నుండి బయటపడి, ఇక్కడి రెసిడెన్షియల్ క్వార్టర్సు చుట్టూ చీకట్లో దయ్యాల్లా తిరుగుతూవుంటారు. కరస్పాండెంటు, హెడ్‌వార్డెన్ల నివాసాలతో పాటు, కొంతమంది మాస్టర్ల, ఇతర సిబ్బంది నివాసాలుకూడా ఇక్కడే. దొరికితే ఏ ఆడదాన్నయినా చెడగొట్టడానికి వీళ్లు వెనకాడరు. మీరున్న హాలు కిందకే ఈ స్కూలు ఎక్కౌంటెంటు నివాసం. అతడు, అతడి భార్య, అతడి తల్లితండ్రులు అందులో ఉంటారు. వాడొక బీస్ట్ హారిబుల్ డ్రంకర్డ్. వాడితో మన వార్డెన్లు కొందరికి స్నేహం. వాడితో తాగి తందనాలాడుతారు, సరిగ్గా మీ హాల్లో కిందనున్న గదిలోనే రాత్రులు పదీ పదకొండు గంటలకు ఆ గదిలో ఎక్కౌంటెంటు వెధవతో కలిసి తాగడం మొదలుపెడతారు, అర్థరాత్రులు నిశ్శబ్దంలో వాళ్ళు నవ్వే వెకిలి నవ్వులు ఎవరినైనా భయపెడతాయి. లోపల తన భార్య ఉందని ఎక్కౌంటెంటు వెధవకు గాని, మన వెధవలకు గాని స్పృహ ఉండదు. ఎక్కౌంటెంటు తల్లిదండ్రులు ఏమీ పట్టించుకోరు. వాళ్ళకు అన్నీ జరుగుతున్నాయా లేదా అని మాత్రమే చూసుకుంటారు. రాత్రులు నల్లమందు మింగి పడుకుంటారు. కోడలి పరిస్థితిని ఏ మాత్రం పట్టించుకోరు. ఆమెను పగలంతా అదిలేదు యిదిలేదు అని సాధిస్తూ వుంటారు. తాగుడయిపోయిన తరువాత అర్ధరాత్రులు ఎక్కౌంటెంటు వెధవ ఆమెను సాధించడం మొదలుపెడతాడు. తిడుతూ వుంటాడు, కొడుతూ వుంటాడు. ఆ దెబ్బలను భరించలేక ఆమె అప్పుడప్పుడు ఏడుస్తూ వుంటుంది. హెడ్‌వార్డెనుగారికి ఎక్కౌంటెంటు గురించీ, మన వెధవల వెధవ్వేషాల గురించీ బాగా తెలుసును. కానీ, ఆయనేం చేయలేడు. ఎందుకంటే ఎక్కౌంటెంటుగాడు ఈ స్కూలు కరస్పాండెంటుగారికి బాగా దగ్గరి బంధువు. ఆయనకు వీడు ఎంత చెబితే అంత. వీడి అండ చూసుకొని మనవాళ్ళు రెచ్చిపోతుంటారు.

"ఆమెను మీరెప్పుడయినా చూశారా?" అని అడిగాను. శ్రీరాం నా కళ్ళల్లోకి కొన్ని క్షణాలు సూటిగా చూసి అది అమాయకంగా అడిగిన ప్రశ్న అని గ్రహించి చెప్పడం కొనసాగించాడు.

"ఒకసారి చూశాను. చాలా అందమైన మనిషి. చూడగానే మనకు మనసులో ఒక గౌరవభావం ఏర్పడుతుంది. ఎం.ఎ. చదివిందట పేరు మాధవి అనుకుంటాను. లక్ష్మి అని ఒక స్వీపరు హాస్టలులోనూ, వాళ్ళ ఇంట్లోనూ పనిచేస్తూ వుంటుంది. ఆమెను 'మధూ అమ్మగారు' అంటుంది. మన ఎక్కౌంటెంటె వెధవ స్కూలుఫైనలు మాత్రమే చదివాడు. అదీ వాడి ఇన్ఫీరియారిటి కాంప్లెక్సు. భార్యను ఎవరికి కనబడనియ్యడు. బయటకు తీసుకెళ్ళడు, కనీసం గుడికి కూడా! అమెకు వొంట్లో బాగులేకపోతే డాక్టరే ఇంటికి వచ్చి చూస్తాడు తప్ప ఆమె బయటకు వెళ్ళడానికి లేదు. మన వెధవలు ఆమెను గురించే మాట్లాడుతూ వుంటారు. అమెను గురించి అసభ్యంగా ఆలోచిస్తూంటారు. ఎక్కౌంటెంటు వెధవది ఒక విచిత్రమైన మనస్తత్వం తనతో తాగే వార్డెన్ల గురించి వాడికి బాగా తెలుసు. అయినా భార్యనే అనుమానిస్తాడు గాని వాళ్ళను పట్టించుకోడు. ఒక వార్డెను ఇక్కడ పనిచేసేవాడు. ఈ మధ్యనే వాణ్ణి తీసేశారు. ఒక రోజు రాత్రి అందరూ తాగిన మత్తులో ఆగదిలో పొర్లాడుతూవుంటే, వీడు లోపలికి వెళ్ళి ఆమె చెయ్యి పట్టుకున్నాడట. ఈ విషయాలన్నీ లక్ష్మి నాతో చెప్పింది. ఆ రోజు తను వాళ్ళింట్లోనే పడుకుందట. ఆమె తన చెయ్యి పట్టుకున్న వార్డెన్ను ఈడ్చిపెట్టి లెంపకాయ కొట్టి కత్తిపీటను తీసిందట. విషయం లక్ష్మి ద్వారా కరస్పాండెంటుగారికి తెలిసి, వాడిని తక్షణం ఉద్యోగంలోంచి తీసివేయడం జరిగిపోయింది. కాని, విషయం, ఎవరికీ తెలియదు. లక్ష్మి చాలా మంచిది. ఎవరికీ ఏమీ చెప్పదు. కాని, ఎందుకో నాకు మాత్రం చాలా విషయాలు చెబుతూ వుంటుంది. పెద్దది. ఏభైఏళ్ళుండవచ్చు. భర్త చాలా కాలం క్రితమే పోయాడట. ఉన్న ఒక్క కొడుకూ పనికోసం బొంబాయి పోయి పెళ్ళి చేసుకొని అక్కడే స్థిరపడిపోయాడట. రెండేళ్ళకో, మూడేళ్ళకో ఒకసారి వచ్చి తల్లిని చూసి పోతూంటాడట. ఇక్కడకి దగ్గర్లోనో తన వూళ్ళో తనకో చిన్న పెంకుటిల్లు వుందట. రెండు మూడు నెలలకోసారి తన ఇంటికి పోయి రెండు మూడు రోజులుండి వస్తూ వుంటుంది. మిగిలిన కాలమంతా ఈ హాస్టలే ఆమె లోకం. తనుగాక ఈ హాస్టల్లో రంగమ్మ అని ఇంకో స్వీపరు కూడా పనిచేస్తూ వుంటుంది. ఆమెదీవూరే. మరీ వయసు మీరింది కాదు. మంచిదికాదు అంటారు. ఈ హాస్టల్లో ఎవరెవరేమిటో మీకు

తెలియడం కోసం యిదంతా చెబుతున్నాను. తెలిస్తేనే కదా మనం మన జాగ్రత్తలో ఉండేది. మన హాస్టలుకు ప్రత్యేకంగా ఒక నైట్ వాచర్ వున్నాడు. పేరు నరసయ్య. మంచి వాడు. అరవైఏళ్ళుంటాయి. కాని పిల్లల బుట్టలో పడిపోతుంటాడు. వాడి చేతిలో అయిదూ, పదీ పెట్టి, కాస్త పెద్దకుర్రాళ్ళు రెండో ఆట సినిమాలకు పోతుంటారు. ఎక్కౌంటెంటు భార్య పుట్టింటి వారి గురించి తనకు బాగా తెలుసునని చెబుతాడు. ఒకప్పుడు బాగా బతికిన కుటుంబమట. కాలక్రమేణా ఆస్తులన్నీ కరిగిపోయి, బాగా చదువుకున్న తమ ఒక్కగానొక్క కూతురికి ఆ తల్లిదండ్రులు ఒక మంచి సంబంధమే తేలేకపోయారట. ఎక్కడో కలిసిన చుట్టరికంతో ఎలాగో మన ఎక్కౌంటెంటు గాడికి యిచ్చి పెళ్ళి చేశారట. వీడు ఎలాంటివాడు అన్నది వాళ్ళు పట్టించుకోలేదు. వీడి చేతుల్లో ఆమె పడుతూన్న బాధల గురించి, వాడిని మౌనంగా భరిస్తూన్న ఆమె సహనం గురించీ....... చాలా విషయాలు నరసయ్య చెబుతాడు. వాడికిష్టంలేని పనేమీ ఆమె చెయ్యదట ఎంత బాధలనైనా సహిస్తుందట. ఇంత పెద్ద హాస్టలులో అసలు తన ఉనికిని గురించే ఎవరికీ తెలియకుండా మసులుకుంటుందట. పగలంతా ఇంటి పని, అత్త మామలకు ఊడిగం చెయ్యడం, ఏమాత్రం ఖాళీ దొరికినా రహస్యంగా పుస్తకాలు చదువుకోవడం, రహస్యంగా ఎందుకంటే మొగుడికి ఈర్ష్య కలగకుండా వుండేదుకు, రాత్రిళ్ళు మొగుడిచేతిలో దెబ్బలు తినడం......... యిదీ ఆమె జీవితం. ఆమె ఏడవడం నేను కూడా చాలా సార్లు విన్నాను. మీలాగే కంగారుపడ్డాను కూడా. ఒక వార్డెను ఆమెపై అత్యాచారం చెయ్యడానికి పాల్పడ్డాడు కదా వేరే క్వార్టరు ఇస్తాము అందులోకి మారిపోండి అని కరస్పాండెంటుగారు, హెడ్‌వార్డెనుగారు ఎక్కౌంటెంటు వెధవకి చాలా నచ్చచెప్పారట. కాని, వీడు ఎప్పుడికప్పుడు ఆ విషయాన్ని దాటవేస్తూ వస్తున్నాడట. వీడికి డబ్బుకు లోటులేదు. అందుకే మనలోని కొందరు వెధవలు వీణ్ణి వదలరు........అమె ఖర్మ!



గుళ్ళో దేవత కదలలేదు. కాని, పూజలు, నీరాజనాలు అందుకుంటుంది.

ఈ దేవతా కదలలేదు. కాని ఈమెకు సాధింపులు, అవమానాలు, దెబ్బలు......"

శ్రీరాం అగాడు. పాపం బాధపడుతున్నాడు. ఇంక అతడు మాట్లాడలేదు.

ఈ హాస్టలులో చూసీచూడకుండా పోవాల్సిన విషయాలను చాలామటుకు శ్రీరాం నాకు చెప్పేశాడు. ఆ రాత్రి తొమ్మిది దాటిన తరువాత పదవతరగతి పిల్లలు అయిదారుగురు ట్రిమ్‌గా తయారై బయటకు పోతూ తనకంటపడ్డారు.వాళ్ళల్లో ఓ గడుగ్గాయి, "మాష్టారూ మీరిలాంటి విషయాల్ని చూసీచూడనట్టుగా ఉండాలి లేకపోతే మీకే ప్రమాదం" అని వార్నింగు కూడా ఇచ్చాడు.

హాస్టలులో చేరిన పదిహేను రోజుల్లో తను వచ్చిన నాటికంటే పుష్టిగా తయారయ్యాడని శ్రీరాం అంటే సంతోషం కలిగింది. కాని తన నిజమైన పరిస్థితిని అతడికి వివరించి చెప్పాడు. వేసుకోవడానికి సరైన బట్టలు లేవని, చేతిలో ఒక్క రూపాయి కూడా లేదని.

శ్రీరాం పాపం చాలానే బాధపడ్డాడు. అతని దగ్గరా ఏమీ డబ్బులేదు. అతని మీద ఆధారపడి పెద్ద కుటుంబమే ఉంది. ఒక రోజు శలవు పెట్టి ఊరు వెళ్ళమని అతడే ప్రయాణ ఖర్చులిచ్చాడు. అతడు చెప్పమన్నట్లుగానే తన తల్లికి వొంట్లో బాగులేదని హెడ్‌వార్డెనుకు చెప్పి అతి కష్టంమీద ఒక రోజు శలవు తీసుకున్నాను.

... ... ...

వర్షం తీవ్రత తగ్గింది. సన్నగా చినుకులు పడుతున్నాయి. ఇక తొందరగా హాస్టలుకు చేరుకోవడం మంచిదనిపించింది సత్యమూర్తికి. కాస్సేపటిలో స్కూలు మెయిన్‌గేటును చేరుకున్నాను. గేటుకు తాళం వేసివుంది. ఆడిటోరియం బయటవున్న విద్యుద్దీపకాంతిలో అంతా కనబడుతూనే వుంది. ఆడిటోరియం అరుగుమీద మడతమంచం ఉందికాని, వాచ్‌మెన్ లేదు. కట్టడం ఇంకా పూర్తి కాని గోడను దాటడం కష్టం అనిపించలేదు. ఆడిటోరియంను దాటి హాస్టలు దారి పట్టగానే మళ్ళీ చీకట్లు ఆవరించుకున్నాయి. దూరంగా వున్న రెసిడెన్షియల్ క్వార్టర్సు నుండి మాత్రం పల్చని వెలుతురు వస్తూవుంది. అతడు వీలయినంత వేగంగా నడవసాగాను. అతడి అడుగుల సవ్వడిని పసిగట్టినట్లున్నాయి, ఎక్కడినుండో కుక్కలు అరవసాగాయి. అతడం పిరికితనం ఆవహించింది. అడుగులు తడబడుతున్నాయి. మార్గానికి అటూ యిటూ వున్న చెట్లు, అస్పష్టంగా పరుచుకొన్న వాటి నీడలు అతడికి ఏవేవో ఆకారాలుగా కనబడుతూ భయపెడుతున్నాయి. ఎవరో తన వెంటబడుతూన్నట్లుగా అనిపించి, వెనక్కు తిరిగి చూశాను. ఎవరూలేరు. వర్షం జోరు మళ్ళీ హెచ్చింది. నిలువెల్లా తడిసిపోయాను. చలికి పళ్ళు పటపటలాడుతున్నాయి. వెన్నులోంచి వొణుకు పుట్టుకువస్తూంది. సమయం పన్నెండున్నర దాటి ఉంటుంది. హాస్టలును సమీపించగానే, గేటు మీద 'దబదబా బాదాను.'

"నరసయ్యా! నరసయ్యా!" అని గట్టిగా అరవడానికి ప్రయత్నించాను కాని వొణుకుతూ వుండడం వల్ల మాటకూడా సరిగా రావడం లేదు. అలా ఎంతసేపు గేటును బాదుతూ, అరుస్తూ వుండిపోయానో నాకే తెలియడం లేదు. కాని ఎవరూ పలకడంలేదు. దూరంగా కుక్కల అరుపులు మాత్రం వినబడుతున్నాయి. వర్షం జోరు తగ్గడం లేదు. ఆ 'హోరు' మన్న శబ్దంలో నా కేకలు ఎవర్నీ చేరడం లేదు. నా తెలివితక్కువతనానికీ, తొందరపాటుకూ తిట్టుకున్నాను. స్టేషనులోనే గడిపివేస్తే ఏదో ఒకటి జరిగివుండేది. ఈ అవస్థ ఉండేదేకాదు. చాలాసేపు స్థాణువులా నిలడిపోయాను. ఆ సమయంలో ఇంకా ఏదో ఒకటి చేయాల్సిందే. కాంపౌండ్ వాల్‌ను ఆనుకొని పక్కగా వున్న అక్కౌంటెంటు పోర్షను గుర్తుకు వచ్చింది. అటువైపు యించుమించు పరుగే తీసాను. తాను ఆ విధంగా ఆ నిశీధిలో హాస్టలులోనికి ప్రవేశించడానికి ప్రయత్నించడం సరియైనదో కాదో తెలియట్లేదు. ఆ పోర్షను బయటి గుమ్మం తలుపుల మీద 'దబదబా' కొట్టాను.

"ఏవండీ! ఏవండీ! అంటూ గట్టిగా అరిచాను.

నిమిషాలు గడిచిపోతున్నాయి. చలికి వొణికిపోతున్నాను. చివరకు కోమలమయిన ఒక స్వరం వినవచ్చింది. "ఎవరూ?" అంటూ.

"నేనండి ఇక్కడ హాస్టలులో కొత్తగా చేరిన వార్డెన్నండి. మా ఊర్నుండి వస్తున్నానండి. ట్రయిను లేటయిందండి. గేటుదగ్గర ఎంత పిలిచినా ఎవరూ పలకడంలేదండి. ఈ సమయంలో మిమ్మల్ని యిబ్బంది పెడుతున్నాను, క్షమించండి. నాకు చాలా భయంగా ఉందండి. వర్షంలో తడిచిపోయానండి......." గుక్కతిప్పుకోకుండా వొణుకుతూన్న స్వరంతోనే అరిచినట్టుగా అన్నాను.

తలుపు కొంచెం తెరుచుకుంది. లోపల బెడ్‌లైటు వెల్తురు ఉంది. ఆ పల్చని పసుపుపచ్చని వెల్తురులో కూడా ఆమె ముఖం బంగారు కాంతులీనుతూ కనిపించింది. తన వయసే ఉండవచ్చు. ఆమె మోములోని ఒక చిత్రమైన ప్రశాంతత, ఏ మాత్రమూ జంకు లేకుండా ఆమె నిలబడిన తీరు కొన్ని క్షణాలు నిశ్చేష్టుణ్ణి చేశాయి. నిజంగానే చూడగానే గౌరవభావం కలుగుతూంది.

"సారీ అండి! ఈ సమయంలో మిమ్మల్ని యిబ్బంది పెడుతున్నాను. మీ ఇంట్లోంచి హాస్టల్లోకి వెళ్ళిపోతానండి. నిన్న సాయంత్రానికే నేను వచ్చెయ్యాలండి. ప్రొద్దుటే హాస్టల్లో లేకపోతే నా ఉద్యోగం పోయినా పోతుందండి. నాకీ ఉద్యోగం తప్ప వేరే ఆధారం లేదండి క్షమించండి" అన్నాను.



ఆమె కొన్ని క్షణాలు మౌనంగా వుండి,

"లోపలికి రండి" అని ఒక తలుపు పూర్తిగా తీసి, పక్కకు నిలబడిందామె.

ఒక్క ఉదుటున లోపలికి ప్రవేశించాను. బెడ్‌లైటు వెల్తురులోనైనా అంతా స్పష్టంగా కనిస్తూవుంది. అది ఒక చిన్న హాలు. కింద చాపమీద కాళ్ళూ చేతులూ బార్లా చాపుకుని స్పృహలేని స్థితిలో గురకపెడుతూ పడుకొని వున్న వ్యక్తిని అక్కౌంటెంటుగా గుర్తించాను. తను హాస్టలులో చేరిన రోజునే ఆఫీసు గదిలో చూశానతణ్ణి. ఆ హాలుకు కుడివైపున పక్కపక్కనే రెండు గదులున్నాయి. ఒక గదిలో రెండు మంచాలమీద, అక్కౌంటెంటు తల్లిదండ్రులయివుంటారు, పడుకొని ఉండటం కనిపించింది. పక్కనున్న గది వంటగదిలా వుంది.

ఆమె తలుపు మూసి, గడియపెట్టి,

"నాతో రండి," అని ఆమె ముందుకు దారితీసింది.

నేను ప్రవేశించిన ద్వారానికి సరిగా ఎదురుగా మరో గది ద్వారం వుంది. ఆమె ఆ గదిలోనికి ప్రవేశించి కుడివైపునకు తిరిగింది. ఆమెను నిశ్శబ్దంగా అడుగులో అడుగు వేస్తూ అనుసరించాడు. నాలుగయిదు అడుగులు వేయగానే హాస్టలు వరండాలోకి పోవడానికి ద్వారం కనబడింది. ఆ ద్వారం తలుపులు ఒక రెక్క తీసి ఆమె పక్కకు జరిగి నిలబడింది. పొడవైన హాస్టలు కింది వరండా గోచరమవగానే ఏదో పెద్ద గండం గడిచినట్లుగా సంబరపడి, చటుక్కున వరండాలో అడుగుపెట్టి, వెనుక్కు తిరిగి చిన్న పిల్లావాడిలా చిన్న నవ్వు నవ్వి,

"థాంక్సండీ! మీ సహాయాన్నెపుడూ మర్చిపోనండి" అన్నాను.

దానికి సమాధానంగా ఆమె మృదువుగా, నిశ్శబ్దంగా నవ్వింది. ఏదో సన్నటి కాంతిరేఖ ప్రసరించి ఆమె మోము మనోహరంగా భాసించింది. ఆమె మెల్లగా తలుపును మూసివేసింది.

నెమ్మదిగా అడుగులు వేస్తూ, కనీ కనిపించకుండా వున్న ఆ చీకట్లో, నీడల్లో నీడలా కదులుతూ, పై అంతస్థుకు పోయే మెట్లను చేరుకోగానే, మెట్ల కిందనున్న చోటునుండి ఏదో అలికిడి వినిపించింది. ఒక్కక్షణం గుండె ఆగి కొట్టుకున్నట్లయింది. అంతలో రెండు నీడలేవో కదులుతూ వస్తున్నట్లుగా అనిపించింది. ఒళ్ళంతా ఝల్లుమనడంతో ఒక్క ఉదుటను మెట్లన్నీ ఎక్కి పెద్ద పెద్ద అంగలు వేస్తూ క్షణాలలో తన హాలును చేరుకొని పక్కమీద వాలిపోయాను. లోపల ఉన్న ఇద్దరు వార్డెన్లు గాఢ నిద్రలో ఉన్నారు. మూడవ వార్డెను లేదు.

... ... ...

"నిన్నంతా ఏమయ్యారు? రాత్రి స్టడీ అవర్స్‌లో కూడా లేరు కదా! లోపలికెలా వచ్చారు?" ఎప్పుడు?"

ఒక నక్కజిత్తుల వార్డెను చాలా కుతూహలంగా కూపీలాగడానికి ప్రయత్నించాడు.

సమాధానం యివ్వకుండా చిన్న నవ్వు నవ్వి ఊరుకున్నాను.

శ్రీరాం కళ్ళతోనే మాట్లాడాడు.

పిల్లలు 'హోరు'మని చదువుతూనే వున్నారు. నలుగురైదుగురు వార్డెన్లు తన గురించే మాట్లాడుతున్నారని గ్రహించాను. తనను లెక్కలు బోధించే వార్డెనుగా వేసుకోవడం, మిగిలిన వారికంటే తనకు పాతిక రూపాయలు ఎక్కువగా జీతం ఇవ్వడం కొందరికి కంటగింపుగా ఉంది. కాని, ప్రస్తుతం ఏమీలేని విషయాన్ని వాళ్ళు కొంచెం పెద్దది చేయడానికి ప్రయత్నించడం ఆందోళన కలిగిస్తుంది. శ్రీరాం కూడా తన గురించే కొంచెం ఆందోళనపడుతున్నట్లుగా కనిపించాడు.

ఇంతలో కింద ఏదో కలకలం మొదలయ్యింది. అక్కౌంటెంటు పోర్షనునుండి పెద్ద పెద్ద అరుపులు వినబడ్డాయి. క్షణాలలో 'స్టడీ అవర్స్'లో వున్న నిశ్శబ్ద వాతావరణమంతా భగ్నమైపోయింది. పిల్లల అరుపులు, కేకలతో నిండిపోయింది. పైనున్న వార్డెన్లందరూ కిందికి చూశారు. ఈలోగానే కబురు వచ్చింది. పిల్లలందర్నీ అయిదు నిమిషాలలో స్కూలుకు వెళ్ళడానికి సిద్ధం చేసి డైనింగు హాలుకు పంపాలని. అటునుండి అటే స్కూలుకు వెళ్ళాలట. నేను కిందికి చూస్తూండగానే శ్రీరాం సైగ చేశాడు కిందికి రమ్మని. పైనున్న ఇద్దరు వార్డెన్లు నిమిషాలలో పిల్లల్ని సిద్ధంచేసి, రెండు వరసలలో కిందికి పంపారు.

కిందికి చేరుకోగానే "ఏం జరిగింది?" అని శ్రీరాంను అడిగాను.

"అక్కౌంటెంటు లోపల పెద్ద పెద్ద కేకలు వేస్తున్నాడు. ఆమెను బూతులు తిడుతూ ఇష్టం వచ్చినట్లు కొడుతున్నాడట. కాళ్ళతో గుండెల మీద తన్నాడట. లక్ష్మి ఏడుస్తూ బయటికి పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పింది. తనే వెళ్ళి కరస్పాండెంటు గారిని పిలుచుకు వచ్చింది. హెడ్‌వార్డెనుగారు కూడా వచ్చారు."

"ఎందుకు కొడుతున్నాడు?"

"అదే తెలీదు. పిల్లలందరూ అర్జంటుగా డైనింగుహాలుకు, అటునుండి డైరక్టుగా స్కూలుకు పోవాలట."

నా గుండె దడదడలాడింది. కింద ఒక రూము ప్రత్యేకంగా ఆఫీసు కోసమని వుంది. కరస్పాండెంటుగారు, హెడ్‌వార్డెను గారు లోపల కూర్చొని మాట్లాడుకుంటున్నారు. తరువాత లక్ష్మీచేత కబురు చేశారు, డైనింగుహాల్లో పని ముగిసిన తరువాత వార్డెన్లందర్నీ రమ్మని.

వార్డెన్లు వచ్చేసరికి, కరస్పాండెంటుగారు వార్డెన్ల అటెండెన్సు రిజిష్టరును పరిశీలిస్తున్నారు.

"ఈ లీవు లెటర్ ఎవరిది?"

ఒక సీనియర్ వార్డెను దగ్గరకు వెళ్ళి చూసి,

"రత్నబాబుది. పొద్దున్నే వొంట్లో బాగులేదని, డాక్టరు దగ్గరకని వెళ్ళాడు సార్. మధ్యాన్నానికి వచ్చేస్తానన్నాడు."

ఆ తరువాత అందర్నీ బయటకు వెళ్ళిపొమ్మన్నారు. నేను మాత్రం హెడ్‌వార్డను సైగ చేసి ఆపారు.

"నిన్న మీరు హాస్టలులో లేరా?" ఆయన అడిగారు.

నేను లోలోపల భయపడుతూనే విషయాన్ని కొంతవరకు వివరంగా చెప్పాడు. కొంత దాచాడు.

"మరి అంత అర్ధరాత్రి హాస్టలులోకి ఎలా రాగలిగారు?"

నేను ఇంక ఆలోచించలేదు.

"రాత్రి రాలేదండి. స్టేషనులోనే ఉండి తెల్లవారడానికి కెంచెం ముందే లోపలికి వచ్చానండి."

"మెయిన్ గేటు తీసి వుందా?"

"లేదండి."

"మరి"

"పడిపోయిన గోడను కదుతున్నారు కదండీ దాన్ని దాటి వచ్చాను."

హెడ్ వార్డెనుగారు అసహనంగా తల అటు యిటూ వూపారు.

"గోడ దాటి వచ్చాననడం ఏమైనా బాగుందా?"

నేను మాట్లాడలేదు.

"మరి హాస్టలులోకి ఎలా రాగలిగారు?"

"అప్పటికే హాస్టలు గేటు తీసి వుందండి."

"రాత్రి హాస్టలులో ఉన్నదెవరు?" హెడ్ వార్డెనుగారిని కరస్పాండెంటు అడిగారు.

"నరసయ్య, లక్ష్మీ నిన్న శలవుపెట్టారు. రాత్రి వున్నది రంగమ్మ లక్ష్మీ ఇవాళ ప్రొద్దుటే ఆరుగంటలలోపే వచ్చింది. నాకు కనిపించి ఎక్కౌంటెంటుగారింటికి వెళ్ళింది." హెడ్‌వార్డెను గారు. జవాబిచ్చారు.

"రంగమ్మ ఏదీ?" కరస్పాండెంటుగారు అడిగారు.

నేను ఉద్యోగం పోయిందనే నిర్ణయానికొచ్చేశాను.

తెల్లవారుజామున గేటును ఎవరు, ఎప్పుడు తీసింది నాకు తెలియదు.

అంతలో లక్ష్మి లోపలికి వచ్చింది.

"నేను వచ్చేసరికే అది గేటుతీసి ఇంటికెల్లిపోయినట్టుందండి."

కరస్పాండెంటుగారు. వెళ్ళమన్నట్లుగా నాకేసి చూసి తల కొంచెం ఊపి సైగ చేసారు. బయటికి వచ్చిన కాస్సేపటికి వాళ్ళు కూడా బయటికి వచ్చారు. కరస్పాడెంటుగారు అక్కౌంటెంటు పోర్షను వైపు, హెడ్‌వార్డెనుగారు హాస్టలు బయటికి నడిచారు.

వార్డెన్లెవరూ బ్రేక్‌ఫాస్ట్ ఇంకా చేయకపోవడం వలన, జరిగినదాని గురించే మాట్లాడుకుంటూ డైనింగుహాలుకు బయలుదేరారు.

టిఫిను తిని ముందుగా శ్రీరాం, నేను హాస్టలును చేరుకున్నాం.



శ్రీరాం కోసమే ఎదురుచూస్తున్న లక్ష్మి అతడు కనబడగానే, పక్కకు తీసుకువెళ్ళి ఏడుస్తూ జరిగింది చెప్పడం మొదలుపెట్టింది.

"నేను ఆరుగంటలకే అమ్మగారింటికి ఎల్లానండి. అమ్మగారి వొల్లు కాలిపోతా వుందండి. పెల్లుమని జరం వచ్చిందాయమ్మకి. అత్తామామలు యింకా నిద్దట్లోనే వున్నారండి. ఆ బాబుని నిద్దర్లేపి, మధూ అమ్మగారికి వొంట్లో బాగా లేదని చెప్పి, పెద్దయ్యగారింటికి పరుగెత్తానండి జరం బిల్లలు ఏవైనా వున్నాయేమో తెద్దారని. ఎంబడే తిరిగిచ్చేసరికి ఆయమ్మనాడు బూతులు తిడతా, కొడతా వున్నాడండి. నేనడ్డం ఎల్లి ఆపుదావంటే ఆగడే! ఎవడే ఆడు? ఒంటి మీద ఆ రక్కులేంటే? నీ జాకెట్టు ఎవడు సింపాడే? ఎవడితో పడుకున్నావే? అంటా ఆయమ్మ గుండెలమీద తన్నేడండి. అమ్మగారికి జరం వొచ్చిందన్న సంగతే గాని, ఆ రక్కులు, జాకెట్టు సిరిగుండడం నేను సరిగ్గా సూడలేదండి........

ఆయమ్మ దేవతండి. ఆయమ్మ నన్లోల్లకి పుట్టగతులుండవండి......."

లక్ష్మి రొప్పుతూ వుంది. ఆమె ఏడుపూ ఆగడంలేదు. ఇంతలో మిగిలిన వార్డెన్లు హాస్టల్లోకి రావడం చూసి,

"నేను మల్లీ వత్తానండి" అని పరుగెత్తింది.

శ్రీరాం నోటమాటలేనోడిలా నిశ్చేష్టుడిలా ఉండిపోయాడు. తరువాత విషయమంతా నాకు చెప్పి..

"ఏం జరిగుంటుందంటారు?" అని అడిగాడు.

నేను ఏం చెప్పగలను? ఏం జరిగున్నా దానికి తనే కారణమేమోనన్న ఆలోచన గుండెల్లో గుచ్చుకుంటున్నట్లుగా వుంది.

రాత్రి ఏం జరిగుంటుంది? నాకు మెట్ల దగ్గర కనబడిన నీడ ఎవరిది? అంత రాత్రివేళ!

కరస్పాడెంటుగారు ఇంకా అక్కౌంటెంటు ఇంట్లోనే వున్నారు. బహుశా రాత్రి ఏం జరిగిందని ఆమెను అడుగుతున్నారేమో! నాకు ముచ్చెమటలు పట్టాయి. నా అనాలోచితమైన చర్య వలన నా ఉద్యోగంతో పాటు, ఆమె జీవితం కూడా పోయేలాగుంది. నాకు అకస్మాత్తుగా నామీద నాకే అసహ్యం కలిగింది. నేను తెల్లవారుజామున వచ్చాననే శ్రీరాం కూడా అనుకుంటున్నాడు. తన నోటినుండి ఒక్క మాట పెగిలినా జరగబోయే పరిణామాలు ఊహించడానికి కూడా భయంగా ఉంది. ఒకరిద్దరు వార్డెన్లు నన్ను అనుమానిస్తున్నట్లుగా చూడడం అతడు గమనించకపోలేదు. కాని వాళ్ళ అనుమానం వాళ్ళకే నమ్మబుద్ధి కానట్లుంది. అప్పటికే వార్డెన్లందరికి ఎవరి పనులు వాళ్ళు ఒళ్ళు దగ్గర పెట్టుకొని చూసుకోవాలనీ, పిచ్చి పిచ్చి వేషాలేమీ వేయవద్దన్న సంకేతాలు ఘాటుగానే అందాయి. దాంతో ఒకరిద్దరు వారి స్వంత పనుల మీద, మిగిలినవారు వారి వారి గదులకూ పోయారు.

మరునాడు జరగరాని ఘోరమే జరిగిపోయింది.

లక్ష్మి తెల్లవారుతుండగానే, గొల్లున ఏడుస్తూ వరండాలో పరుగెడుతూ కనిపించింది. తెల్లవార్లూ నిద్రపట్టక అప్పటికే వరండాలోకి వచ్చి నిలబడిన నేను దాంతో తడబడుతూన్న అడుగులతో కిందికి దిగాను. ఆమె ఏడుపు విని అప్పుడే శ్రీరాం, మరో వార్డెనూ వాళ్ళ గదిలోంచి బయటకు వచ్చారు.

లక్ష్మి వొళ్లు తెలియని మనిషిలా తూలిపోతూ, గుండెలు బాదుకుంటూ, నెత్తికొట్టుకుంటూ, బిగ్గరగా ఏడుస్తూ శ్రీరాంతో అంది.

"బాబూ ఆయమ్మ ఉరేసుకు సచ్చిపోయింది బాబూ! కాదు బాబూ ఆయమ్మనాడే సంపేసేడు బాబూ! రాత్రి శానాసేపు నాతో మాట్లాడతానే వుంది బాబూ. పాపిస్టి ముండని నాకెప్పుడు కునుకు పట్టిందో గాని, తెలివొచ్చి సూసేసరికి పీక బిగించేసుకు సచ్చిపోయింది నాయనో. ఆడివల్లే సచ్చిపోయింది బాబూ...."

ఆ ఏడుపు నాపడం ఎవరితరం అయ్యేలా లేదు.

నిర్ఘాంతపోయి చేష్టలుడిగిన వాడిలా అయిపోయాడు శ్రీరాం. అంతలో పిల్లలు నిద్రలేస్తున్న అలికిడి విని గబుక్కున తేరుకుని, లక్ష్మిని పట్టుకొని,

"అరవకు లక్ష్మీ!" అని ఆమెను ఆపి, "పదండి చూద్దాం" అని అక్కొంటెంటు పోర్షను వైపు పరుగెత్తాడు. అతడితో పాటు నేను, ఇంకో వార్డెను కూడా పరుగెత్తాం.

వరండా చివర్లో ఆ ఇంట్లోకి పోయే ద్వారం తలుపులు దగ్గరకు లాగి వున్నాయి. శ్రీరాం ముందుగా తనే తలుపులను తోసి చూశాడు. ఆమె సీలింగ్ ఫ్యాన్‌కు చీరతో ఉరివేసుకుంది. తల ఒక ప్రక్కకు వాలిపోయి వుంది. మెడ అంతా లావుపాటి తాడులా వున్న మెలిపెట్టిన చీరతో బిగుసుకుపోయివుంది. ఆ భాగంలో చిక్కుకుపోయిన తాళి కొంత మాత్రమే కనిపిస్తూ వుంది. కళ్ళు కొద్దిగా తెరచివుండి కిందకు నేలను చూస్తున్నట్లుగా నున్నాయి.



అంత దుర్గతిలోనూ ఆమె సౌందర్యమేమీ తగ్గలేదు. పరిశుభ్రమైన గోధుమరంగు చీర, బ్రౌను కలర్ బ్లౌజు ధరించి వుంది. ఇంకా చెరిగిపోని నొసటి కుంకమతో ఆమె వదనం అన్ని ప్రాపంచిక బంధాలను తెంచుకున్న తృప్తితో ప్రశాంతత ఉట్టిపడుతూ వుంది. వేళ్ళాడుతూవున్న పాదాల వేళ్ళకున్న వెండిచుట్లు ఆమెనంతవరకూ బాధించిన పాపానికి విలపిస్తున్నట్లుగా వున్నాయి. శరీరం ఏ మాత్రమూ అనాచ్ఛాదితం కాకుండా తగిన జాగ్రత్తలతో ఆమె మరణించిన తీరు హృదయవిదారకంగా వుంది.

విషయం పిల్లలకు చేరకుండా వుండడం ముఖ్యమని శ్రీరాం గ్రహించాడు. లక్ష్మిని కరస్పాండెంటుగారి ఇంటికి వెళ్ళమని చెప్పి. ఆమెచేత ఆ గది లోపలినుండి గడియ వేయించాడు. అప్పటికే లేచిన వార్డెన్లకు విషయం పూర్తిగా చెప్పకుండా, ముందురోజులాగానే పిల్లల్ని అత్యవసరంగా సిద్ధంచేసి డైనింగుహాలుకు పంపాలని తనే సూచనలిచ్చాడు.

ఈలోగానే కరస్పాండెంటుగారి కుటుంబసభ్యులు వచ్చారు. క్రమంగా ఊళ్ళోని బాగా కావలసిన బంధువులు ఒక్కొక్కరుగా వచ్చి, అందరూ హాస్టలు గేటునున్న గోడ అటువైపు గుమ్మం దగ్గర చేరారు.

జరిగిందేమిటో తెలిసిన ముగ్గురు వార్డెన్లను కరస్పాండెంటుగారు ఆపారు. మిగిలిన వార్డెన్లు ఏడుగంటల ప్రాంతంలో పిల్లల్ని తీసుకొని డైనింగుహాలుకు వెళ్ళిపోయారు.

ఆమె భౌతిక శరీరాన్ని బయటికి చేర్చారు. స్నానం, మొదలయిన సంస్కారాలన్నీ ఆడవాళ్ళు చుట్టూ వుండి లక్ష్మి సహాయంతో చేస్తున్నారు. ఆమె తల్లితండ్రులది అక్కడికి దగ్గరి ఊరే కావడం వలన పదకొండు ఆ ప్రాంతంలో వచ్చి కన్నకూతురి మృతదేహాన్ని నిమురుతూ కన్నీరు మున్నీరు అవుతున్నారు. అక్కొంటెంటు నేలమీద గొంతుకూర్చొని ముఖాన్ని ఎవరికీ కనబడనీయకుండా ముడుకుల్లోనికి దూర్చుకొని, నెత్తిమీద చేతులు వేసుకొని వున్నాడు.

హెడ్‌వార్డెనుగారి సూచనలతో దహన కార్యక్రమానికి ఏర్పాట్లు నిశ్శబ్దంగా జరిగిపోతున్నాయి. విషయం బయటికి పొక్కకుండా చూడడానికి నిర్ణయం జరిపోయింది.

జ్వరం వచ్చినవాడిలా వొణుకుతూ వున్న నన్ను గమనించి దగ్గరికి వచ్చి అతడి భుజం నిమరారు హెడ్ వార్డెనుగారు - భయపడవద్దన్నట్లుగా తను చూసుకుంటానన్నట్లు శ్రీరాం ఆయనవైపు చూసి, తల కొంచెం ఊపాడు.

మధ్యాహ్నం రెండుగంటలలోపే, స్కూలు ప్లే గ్రౌండ్‌కు కొద్ది దూరంలో వున్న కాంపౌండ్‌వాల్ అవతల, వరుసగావున్న చెట్లను వొరుసుకొని ప్రవహిస్తున్న ఒక చిన్న కాలువ సమీపంలో వున్న కొద్దిపాటి స్థలంలో ఆమెను ఖననం చేశారు. సాయంత్రానికి ఆ స్థానంలో ఒక చిన్న గుడి వెలిసింది. చీకట్లు ముసురుకుంటున్న వేళ అందులో ఒక నూనె దీపం వెలిగింది.

ఎవరూ చూడకుండా ఆ సమయానికి అక్కడకు చేరుకుని "ఏవండీ మీరెందుకు చచ్చిపోయారు?" అంటూ.. భోరున విలపించాను.

ఏవండీ మీరెందుకు చచ్చిపోయారు? అన్న ప్రశ్నకు నాకు ఈనాటికీ మనసుకు సాంత్వన కలుగజేసే జవాబు దొరకలేదు. చీకటి పడింది. దూరంగా ఆధునీకరించబడిన స్టేషను విద్యుద్దీపాలతో వెలిగిపోతూ కనిపిస్తూంది. దగ్గరలో కూడా ఏవేవో దీపాల వెల్తురు వచ్చి పడుతూంది. చివరిసారి ఆమె సమాధిని కళ్ళనీళ్ళతో చూసి, మెల్లగా స్టేషను దారి పట్టాను.

ఆమెను ఖననం చేసిన తరువాత కొన్ని రోజులు యాంత్రికంగా, నిరాసక్తంగా గడిచిపోయాయి. ఆ విషయాన్ని, ఎవరూ, ఎప్పుడు ప్రస్తావించలేదు. వార్డెన్లకు తీవ్రమయిన హెచ్చరికలు అందాయి. పనిచేయడం యిష్టంలేని వార్డెన్లు వెళ్ళిపోవచ్చునని తెలియజేశారు. వార్డెన్లు రాత్రులు బయట తిరగడాన్ని పూర్తిగా కట్టడిచేశారు. రహస్య మార్గాన్ని కనుక్కొని మూసేశారు. ఆ సంఘటన తరువాత రత్నబాబు అనే వార్డెను కొన్ని రోజులు హాస్టలుకు రాలేదు. అతడికి భుజంమీద ఏదో తీవ్రమయిన గాయం అయిందనీ, దానికి చాలా రోజులుగా ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నాడని తెలిసింది.

అతడి స్థానంలో మరో వార్డెన్ను వేసుకోవడం కూడా జరిగిపోయింది. ఒక రోజు రత్నబాబు ప్రొద్దుటే వచ్చి, తనకేదో వేరే ఉద్యోగం వచ్చిందని చెప్పి, తనకు సంబంధించిన వస్తువులన్నింటినీ తీసుకుని వెళ్ళిపోయాడు. రంగమ్మ కొన్ని రోజులు పనిచేసింది గానీ, ఆ తరువాత మానేసింది. కాదు దానిని తీసేశారు అని చెప్పాడు శ్రీరాం.

స్టడీ పిరియడ్సులో పిల్లలు 'హోరు' మని పాఠాలు చదువుతూన్న శబ్దంతోను, వాళ్ళ వీపుల మీద పడే గుద్దులతోనూ హాస్టలు భవనం దద్దరిల్లుపోతూనే వుంది.

నేను ఇంక ఎక్కువ రోజులు అక్కడ పనిచేయలేకపోయాను. ఉద్యోగం వదలిపెట్టి, బయటకు పోయి ఏదైనా స్కూలు మాస్టరు ఉద్యోగం

# మార్పు



హిందీ మూలం : త్రిపేన్ సింగ్ చౌహాన్
అనువాదం : డా॥వెన్నా వల్లభరావు

అతను పల్లెటూర్లో ఉన్నప్పుడు
ఎదురు చూస్తుండేవాడు అతిథుల కోసం
వారితో కష్టసుఖాలెన్నో పంచుకునేవాడు
వచ్చిన అతిథిని ఆప్యాయంగా ఆదరించి
పొలాల్లోని పచ్చని పైర్ల గురించి
అడవిలో పూచిన పూల గురించి
పొలంగట్లపైని పచ్చగడ్డి గురించి
ఎద్లు-దున్నపోతుల గురించి
ఆవులు-మేకలు గురించి
ఊళ్లో యువత పోకడల గురించి
ఇంకా ఎన్నో- ఎన్నెన్నో విషయాలు
రాత్రంతా ముచ్చటించి పరవశించేవాడు

ఒక రోజతను పట్టణానికి వెళ్లి
తిరిగి రాలేదు పల్లెటూరికి
ఇప్పుడతను ఎదురుచూడటంలేదు
ఏ అతిథి కోసమూ
అతనిముందుంది ఇప్పుడొక టీ.వి
పిచ్చాపాటీ మాట్లాడుకోవటానికి
దాని భాషేమీ తనకర్థం కాకపోయినా
చూస్తూనే ఉంటాడు దానివైపు నిరంతరం
కళ్లప్పగించి తదేక దృష్టితో
అతిథి వస్తే మాత్రం స్వాగతిస్తాడు.
అడుగుతాడతన్ని-
సొంతఊరి స్థితిగతులు చరిత్ర పుస్తకాలవలె
మండిపడతాడు పల్లెటూరి రాజకీయాలపై
ఏకరువు పెడతాడు ఊరు మారిపోయిందని
తాను మారుతున్నానని, మారానని మాత్రం
సుతరామూ ఒప్పుకోడు.
గ్రామంలోని శుభవార్తలు విని
సంతృప్తి చెందుతాడు
ఊరింకా బతికున్నందుకు

అతను పెద్ద నగరానికొచ్చాడిప్పుడు
అతిథుల అవసరమే లేదిప్పుడతనికి
వారికి దూరంగా ఉండాలని ప్రయత్నం
ఎవరైనా అతిథి దారితప్పివస్తే
తిట్టుకుంటున్నాడు...
పెరుగుతున్న ధరల్ని
నగరంతో ముడిపడిన జీవితాన్ని
ఎవ్వరితోనూ పంచటానికి ఇష్టపడడు..
తన ఫ్యాను గాలిని,
బుట్టలోని అన్నాన్ని,
గతంలో అతిథులకోసమే పరిచిఉంచిన
పక్కని...!

---

వెతుక్కుంటానని శ్రీరాంకు చెప్పాను. మంచి ఉద్యోగం వచ్చేవరకూ ఉండమని శ్రీరాం ఎంతో నచ్చచెప్పాడు. నేను వినలేదు. తనకు హాస్టలు వాతావరణం సరిపడడం లేదని హెడ్‌వార్డెనుగారికి చెప్పివేశాను. ఆయన పాపం కొంచెం బాధపడ్డారు. నీ ఇష్టమనీ, తానెవరి భవిష్యత్తుకూ అడ్డురానని చెప్పారు.

ఆ నెల జీతం రాగానే బట్టల్నీ, చిన్న చిన్న ఇతర వస్తువుల్నీ ట్రంకులో సర్దుకొని, అందరికీ చెప్పి హాస్టలునుండి బయటపడ్డాను. శ్రీరాం దిగులుగా నాకేసే చూస్తూవుండిపోవడం నాకేనాటికీ మరుపుకు రాలేదు. ఆ తరువాత శ్రీరాంను నేనెన్నడూ చూడలేకపోయాను. ఏమయిపోయాడో మరి!

ట్రంకు చేత్తోపట్టుకుని నడుచుకుంటూ స్కూలు మెయిన్‌గేటు దాటగానే నా కోసమే ఎదురుచూస్తూ ఒక చెట్టుక్రింద లక్ష్మి నిలబడి వుంది.

"ఆ రోజు రేతిరి మీరు అమ్మగారి ఇంట్లోంచి హాస్టల్లోకి ఎల్లారు కద బాబూ! అమ్మగారు నాకంతా సెప్పేరు. ఆ గదిలోంచి హాస్టలు వరండాలోకి మీరు నడుసుకుంటా ఎల్లిన కుసింతసేపటికే ఎవరో గది తలుపులు 'దబదబా' బాదారంట. పడుకోబోతున్న అమ్మగారు మీకేమైనా కావాలో ఏంటోనని గబుక్కునొచ్చి తలుపులు తీశారంట. అంతే ఎద్దులాంటోడు ఒడు అమ్మగార్ని లోపలికి తోసి మీద పడ్డాడట అప్పుడే, ఆ సీకట్లో ఇంకో మడిసి కూడా కదలాడినట్టుగా అమ్మగారు సూసేరంట. మీద పడిన ఆడు ఆయమ్మ రయిక సించి, జుట్టుపట్టుకొని లాగి బలవంతంగా అనుభగించబోయాడంట. ఆ రేతిరి ఆయమ్మ ఆడితో యుద్ధమే సేసిందట బాబూ! ఆడెవడో మాత్రం ఆయమ్మ సెప్పలేకపోయింది. అరిసినా మొగుడుగాని, అత్తమావలు గాని నిద్దర లేవలేదంట. సివరికాయమ్మ సేతికందిన ఏదో ఇనుప వూసతో ఆణ్ణి పొడిసిందంట, ఆడు భుజం పట్టుకొని 'అమ్మో' అని పెద్ద కేకేసి వొరండాలోకి పరుగెత్తాడంట. తన మానం కాపాడుకుంది బాబూ. కాని మర్నాడిరోజు మొగుడు సేసిన గొడవకి ఆయమ్మ యిరక్తి పడిపోయింది. ఆ రేతిరి సచ్చిపోవడానికి ముందు నాతో శానాసేపడి దాకా మాట్లాడతానే వుంది బాబూ. తనకు పిల్లలు పుట్టలేదని అంతవొరకూ బాధపడతా వుండేది ఆయమ్మ. కాని తనకు పిల్లలు కలగకపోడం శానా మంచిదైనట్టు ఆ రేతిరి ఆయమ్మ మాట్లాడతావుంటే నా కర్దం కాలేదు బాబూ. నాకు కునుకు పడతా వుండగానే ఆయమ్మ మీ గురించి సెప్పిన మాటలు గ్యాపకం వున్నాయి బాబూ. మీరా రేతిరి సలికి గజగజా వొణికిపోతా మాట్లాడిన మాటలికి ఆయమ్మ శానా కదిలిపోయింది. మీరా రేతిరి ఏమయినా తిన్నారా అని కనీసం అడగనైనా అడగకలేకపోయానని ఎంతో బాధపడింది. నాతో మిమ్మల్ని జాగర్తగా సూసుకోమని సెప్పింది. అదే ఆఖరి మాటనుకోలేదు బాబూ" అని లక్ష్మి భళ్ళున ఏడ్చింది.

"నా కారణంగానే ఆవిడ చచ్చిపోయింది. ఈ పాపం జీవితమంతా నన్ను వెంటాడుతూనే ఉంటుంది....".

"లేదు బాబూ! మీదే పాపం లేదు. ఆయమ్మ ఏ లోకంలో వున్నా మిమ్మల్ని దయగానే సూస్తది బాబూ ఎల్లిరండి" అని లక్ష్మి కళ్ళు తుడుచుకుంది.

చాలా కాలం గడిచిపోయింది. మనసు సున్నితమైన వాళ్ళకు జీవితంలో చాలా దుఃఖం ఎదురవుతూ వుంటుంది. తన జీవితమూ ఇంతవరకూ అలాగే గడిచింది. జ్ఞాపకాలు మనిషిని విడవవు. జీవితమూ ముగియక తప్పదు.

నేను స్టేషను చేరేటప్పటికి ఎక్కవలసిన రైలుకు అనౌన్స్‌మెంటు జరుగుతూ వుంది.

•

# నా మూలాల్లోకి నేను

- డా॥ కత్తి పద్మారావు



నీటి ప్రవాహంలో ఒక సవ్వడి
నవ్వులు, మువ్వలు కలిసినట్టు
నీళ్ళకు వెలుతురుకు చెలిమి
ప్రవాహం చరిత్రను
మోసుకెళుతూనే వుంటుంది
నదీ నాగరికతలన్నీ
వికసించిన ప్రజ్వలనాలే కదా!
ఆనకట్టలన్నీ శైథిల్యంలో
వున్నమాట నిజం
సహచర్యం ఎప్పుడూ వర్తమానమే
పునశ్చరణంతా చరిత్రకు మూలమే
'అల' కంటే 'సుడి'లోనే
సంఘర్షణ వుంది
ప్రకృతంతా సంగీత వర్ణశాలే
ఎన్ని కోయిలలు పాడినా!
ఎన్ని పువ్వులు వికసించినా!
ఆ శిశువు నవ్వును మించలేదు కదా!
అవును
మనం సుదూరంలో వున్నవారికోసం
పాటపాడతాం
జలపాతాలు దాటుతున్న
ఒక ప్రక్షి రెక్కల చప్పుడు వింటాం
ఆకాశం అంచుల్లో నుంచి వస్తున్న
మంచుపల్లకిని చూస్తాం

ఒక్క నిశ్వాసతో
అవి మటుమాయమవుతాయి
మనం కర్కశమైన కొండ అంచున
నిలబడి ఊపిరిపీలుస్తున్నట్టు
మనకు తెలిసి పోతుంది
నిజమే పచ్చిక బయళ్ళ గరికపోచలు
మనకు నిబ్బరాన్ని నేర్పిస్తాయి
చాలామంది నిర్లక్ష్యాన్ని ఆదరిస్తారు
వారు పట్టుకొన్న గాజుపాత్ర
వారి కళ్ళముందే
జారిపడటానికి
కారణం వారికి తెలియదు
విమానాన్ని అధిష్టించిన వాడికంటే
ఆ పక్షే ధైర్యంగా వెళుతుంది

చెట్లు చిగుర్చడాన్ని
చెట్టువాడిపోవడాన్ని
ఆకు రాలడాన్ని
ఇప్పుడు! ఎవరు చూస్తున్నారు
విద్యుద్దీపాల మధ్య ఎగిరి ఎగిరి
ఏదైనా చల్లనిది తాగి తాగి
ఆ మత్తులో నిద్రించేవారికి
పిల్ల తెమ్మెరలు ఎందుకు!
శరీరానికి ఆక్సీజన్ తగ్గాక
ప్రకృతి స్పర్శ ఎక్కడిది
శ్వాసించడానికి కొంత ఊపిరి
కావాలని ఆశ
అవును! మీరు జీవించండి
గాయాలు లేకుండ, బాధలు లేకుండ
ఎలా!పుట్టారో! అలాగే
అవును! ఆ ఉద్యానవనంలోని శిల్పంలా
మిమ్ముల్ని సందర్శిస్తూ వెళతారు,
అందుకు నేను
ఆ కాలువగట్టుకే వెళుతున్నాను
ఆ నీటి ఒరవడిలో
చెరిగిపోని దృశ్యం కోసం
అంటే! నామూలాల్లోకి నేను

---



# గజల్

- ద్యావరి నరేందర్‌రెడ్డి

గాయాలను గేయాలుగ - వ్రాసేస్తుంటాను నేను
గళం ఎత్తి జనం కొరకు - పాడేస్తుంటాను నేను
ఎంత ఆస్తి నీకుందని - ఎవ్వరైనా అడిగిననూ
వ్రాసినట్టి కవితలనే - లెక్కిస్తుంటాను నేను
అహముంటే ఎదుగుదలకు - అడ్డుపడును జీవితాన
వినయగుణం దిక్సూచిగా - పయనిస్తుంటాను నేను
పొగడ్తలే ఎదపొగరును - పెంచునులే కాసింతా
మధురముగా పలకరిస్తే - పులకిస్తుంటాను నేను
విలువలంటే వలువలేమి - విడిచి వేసుకోడానికి
మనుగడకే కవచాలని - భావిస్తుంటాను నేను
తీయనైన అబద్ధమే - విషమించును ఎప్పుడైనా
చేదులాంటి నిజమైనా - త్రాగేస్తుంటాను నేను
నడుము వంగి చూపు వాలి - అవ్వతాత ఎదురుపడగ
నాటి వలపు తలపులన్నీ - తోడేస్తుంటాను నేను
స్నేహితులను మరవడమే - తగదులే ఓ నరేంద్ర !
మనసులోన మరల మరల - తలపోస్తుంటాను నేను



# నా బాల్యం నాక్కావాలి...

- దోర్నాదుల సుబ్బమ్మ

అమ్మకొంగు పట్టుకొని తిరుగుతున్న ఆనందాన్ని
ఏ హంగులు ఆర్భాటాలందజేస్తాయి?
మూడో సంవత్సరం మొదలయ్యీ కాకమునుపే
హడావిడిగా డొనేషన్ కట్టేసి కాన్వెంటుకి ప్రయాణం...
వీపు మీద పుస్తకాల మోపు పెట్టి వాకిలి దాటించి
తాపీగా టీవీలో ఎపిసోడ్స్ ముందున్న అమ్మా...
మా ముద్దూ మురిపాలందించే టైం లేదు
మీ ఆశలంటూ నా మీద రుద్దడమేనా టైమంతా...
గోరుముద్దలు తినిపిస్తున్నప్పుడు మారాం చేస్తుంటే
నోరు తెరిపించి అమ్మా నాన్నల ముద్దలంటూ తిన్పించడం కంటే
ప్రేమకి, అభిమానానికి, బాధ్యతకు పాదులెక్కడుంటాయి?
ఒక్కసారి నా ముఖం చూసి చెప్పమ్మా...
నాకు నువ్వు కావాలని నేనెవరికి వినతి పత్రం యివ్వాలి?
అజ్ఞాతంగా అంగారతల్పాల మీద వదిలేయకు నన్ను...
ఆప్యాయతను కోల్పోయి నీ సన్నిధి కోసం పరితపించేలా చేయకు...
నా బాల్యం నాక్కావాలి... అని మిమ్మల్నే అడుగుతున్నా...

# ఆధునిక ఇటలీ కవులు

## - సౌభాగ్య



# డినో కంపానా

డినో కంపానా ఫ్లోరెన్స్ సమీపంలో 'మ(ౖ)రాడీ' అన్న ప్రాంతంలో జన్మించాడు. తండ్రి స్కూలు టీచర్. మతి స్థిమితం లేని తల్లి. కంపానా గ్రీకు, లాటిన్ భాషలు అభ్యసించాడు. ఫ్రెంచి, జర్మన్, ఇంగ్లీషు భాషల్లో ప్రావీణ్యం సంపాదించాడు. బోలోగ్నా యూనివర్సిటీనించీ కెమిస్ట్రీలో పట్టా సంపాదించాడు. 1906 దాకా రసాయన శాస్త్రం ఫ్లోరెన్స్‌లో అధ్యయనం చేశాడు. 1907లో అర్జెంటీనా వెళ్ళాడు. పశువుల కాపరిగా, గనుల్లో కూలీగా, అగ్నిమాపక దళంలో ఉద్యోగిగా, సంగీతకారుడిగా ఎన్నెన్నో పనులు చేశాడు. అవిశ్రాంతంగా దేశమంతా తిరిగాడు.

మళ్లీ తిరిగి ఇటలీ చేరాడు. తిరగుబోతుతనం వల్ల ఎన్నో మార్లు జైలు పాలయ్యాడు. 1909లో పిచ్చాసుపత్రిలో చేరాడు. ఆయన రాసిన 'అనాథ గీతాలు' ఆయనకు పేరు తెచ్చి పెట్టాయి. వాటిని 1913లో కొన్ని వారాల వ్యవధిలోనే రాశాడు. వాటిని ఒక సంపాదకుడికి ఇస్తే అతని అజాగ్రత్త వల్ల ఆ రాతప్రతి ఎక్కడోపోయింది. కంపానా ఆ కవితల్ని మళ్లీ స్మృతికి తెచ్చుకుని 1914లో వాటిని తిరగరాశారు.

మొదటి ప్రపంచ యుద్ధం రోజుల్లో సైన్యంలో చేరాలని పిలుపు వచ్చింది. మానసిక స్వస్థత లేనివాడుగా వైద్యులు నిర్ధారించి వెనక్కి పంపేశారు. తరువాత జీవించిన పద్నాలుగేళ్ల ఆయన ఫ్లోరెన్స్ దగ్గర్లో వున్న పిచ్చాసుపత్రిలోనే వుండి అక్కడే చనిపోయాడు. ఆ పద్నాలుగేళ్లు ఆయన ఏమీ రాయలేదు.

ఆధునిక యూరోపియన్ కవిత్వాన్ని ప్రభావితం చేసిన ముగ్గురు నలుగురు ఇటలీ కవుల్లో డినోకంపానా ఒకడు. తక్కిన కవుల్లా ఆయనకు నోబుల్ అవార్డు రాకపోయినా, తన కాలంలో ఆయన అజ్ఞాతంగా వున్నా ఆధునిక ప్రపంచ కవులందరూ అధ్యయనం చేయాల్సిన అసాధారణ కవి. తన పరిధుల్లో వరి మితుల్లో ప్రతిదాన్నీ పరిమళింప జేసిన ప్రతిభావంతుడు.




కంపానా అస్థిరమయిన మానసిక ప్రవృత్తి. ఆయన కవితల్లో సమగ్రతని కాక పదాల్లో మెరుపులు మెరిపించ దానికి ఉపకరించింది. ఫ్రెంచి విమర్శకులు రింబోతో ఆయన్ని పోలుస్తారు. బహుశా వాళ్ళిద్దరి జీవితాల్లోని విశృంఖలత వల్ల అలా అని అంటారు.

డినోకంపానా అనాథ గీతాలు ఆయన జీవితాన్నే ప్రతిఫలిస్తాయి. ఆయన అనుభూతులు కత్తుల్లా కదిలి కళ్ళు మిరుమిట్లు గొలిపి మన మనసుల్ని గాయపరుస్తాయి.

'సాయంకాలపు హృదయంలో
ఎప్పుడూ ఒక ఎర్రటి గాయం
కుములుతూ వుంటుంది.

వంటి వర్ణనలు ఆయన అపూర్వ అభినయంకి తార్కాణం.

'నా జీవన అంధకారంలో వున్న ఒకే ఒక్క వెలుగు కవిత మాత్రమే' అన్న కంపానా కవిత్వ ప్రేమికుల ప్రేమకు పాత్రుడయ్యాడు.

కంపానా తన అనాథగీతాల్ని లయాత్మకంగా రాశాడు. ఆయన పదాల నిర్మాణం గానానుగుణంగా వుంటుంది. ఆ కవితలు ఇంద్రధనస్సుల వర్ణాన్ని కురిపించి మనల్ని మైమరపిస్తాయి.

ఆ క్షణం ఆ గులాబీ పూలు రంగు వెలిశాయి
కేశరాలు రాలిపోయాయి
నేను ఆ గులాబీలను ఎప్పటికీ మరచిపోలేను
మేమిద్దరం కలిసి ఆ గులాబీలని చూశాం
చాలా చాలా గులాబీలని చూశాం
అవి నా గులాబీలు, అవి ఆమె గులాబీలు
మేము ఈ ప్రయాణాన్ని ప్రేమ అంటాం
మేము ఈ గులాబీలని మా రక్తంతో కన్నీళ్ళతో చేశాం
తొలి ప్రభాతంలో క్షణకాలం ఆ స్వప్నం కదిలింది
మా చేతుల్తో ఆ గులాబీలని నాశనం చేశాం
ఇప్పుడు ఆ గులాబీలు మా గులాబీలు కావు
అవి నా గులాబీలు కావు
అవి ఆమె గులాబీలు కావు

ఇంత ప్రతిభావంతమయిన, గాఢమయిన భావుకత కలిగిన కవి ఇటలీని దాటి అంతగా ప్రచారం లేనివాడు. ఇప్పటికీ కంపానానే కాదు. పునరుజ్జీవన యుగంలో యూరప్‌ని ప్రభావితం చేసిన ఇటలీ మహా కవులెందరో నేటికీ ఇతర ప్రపంచానికి అజ్ఞాతంగానే వున్నారు.

### పిశాచాల ఉద్యానవనం

పిశాచాల ఉద్యానవనానికి
నాజుగ్గా కత్తిరించిన చెట్ల కవుల
హరిత కిరీటాల మర్మర ధ్వనులకీ,
శిశిర శీర్ణ భూములకు చివరి వీడ్కోలు!

కాళ్లు కాల్చే కంకర రాళ్ళ ఎగుడు దిగుళ్లకు,
సూర్యాస్తమయ సింధూర తిలకానికి,
దూర తీరాల జీవన విషాద దురంత వేదనలకు కడసారి వీడ్కోలు
రక్త తల్ప మందారాలు నీలి సముద్రంలో మునిగిపోయిన
సూర్యుడి కోసం నెత్తుటిబొట్లు రాలుస్తాయి.
ధ్వనితరంగ ఖడ్గం బాకా నుంచీ దూసుకొస్తుంది
విశాల నదీ ప్రవాహం తన ఇసుకలో తనే ఇంకిపోతుంది
వంతెన రొండు కొసలూ వంపు తిరిగి
కలుసుకోడానికి కలత పడతాయి
గతం గంభీరంగా నిష్క్రమించింది
దాని అంతరాళం నుండి నిశ్శబ్దం వుదయించింది
నా ఉన్నత సౌధం నుంచీ మృదువయిన సంగీత వాద్య సమ్మేళనం
పొన్నపూల పరిమళం ప్రసరించినట్లు
వయసు తిమ్మిరి నుంచీ, వగరు అగరు ధూమాల నుంచీ
అనిమేష శిలావిగ్రహాలతో బాటు
చివరి సూర్యోదయం నుంచీ ఆవిడ నా కోసం వస్తుంది!
అదిగో! వచ్చేసింది

**నీ జంతు నేత్రాలు**

నన్ను చూడు
నిశ్శబ్దంగా చూడు
ఎదురుచూస్తున్నట్లు నీ సంకుచితమైన
జంతు నేత్రాలతో చూడు
అప్పుడు దగ్గరికి రా!
నిలకడగా నా మీద దృష్టి నిలిపి నిలబడు
ఆదిమ స్వప్నాలలో నీ శరీర భాగం
మగతగా, మోటుగా కదులుతుంది
నిన్ను జీవితంలోకి ఆహ్వానించింది ఎవరు?
ఒళ్లు అమ్ముకునే ఆ పిల్లా?
ఇంతకూ నువ్వెక్కడినించీ వచ్చావు?
సముద్ర తీరాల నించా?
పర్వతాగ్రాల నించా?
ఎండిపోయిన ఎడారిల్నించా?
స్ఫినిక్ లాంటి నీ ఆటవిక వదనంలో
ఆశ్చర్యం నిండిన గాఢత కదుల్తోంది
జీవన నిశ్వాసం దట్టంగా సాగుతూ
సింహం జూలులా విషాదంగా నీలో చలిస్తోంది
నిర్లక్ష్య దేవత నిగారింపు నీలో వుంది
నిన్ను ప్రేమించని వాళ్ళని నువ్వు ప్రేమించవు
వాళ్లు నీ నుంచీ, నీ నీరసమైన ముద్దుల్నించీ బాధపడతారు.

అనువాద కథ

# మజిలీ



- జపానీ కథ : ఎ షార్ట్ విజిట్

రచయిత్రి : యుకికోహిరోటా

- తెలుగు : ఎ. అన్నపూర్ణ

**నేను వెనుక ద్వారం గుండా వంటగదిలోకి ప్రవేశించినప్పుడు అక్కడ వెనక్కి తిరిగి నేల మీద కూర్చుని భోజనం తింటూన్న మనిషిని చూశాను. అతడు దృఢకాయుడు. వయసులో ముప్పైఏళ్ళవాడు.**

అనుకోకుండా నేను తలుపువద్ద వున్న కఱ్ఱను పట్టుకున్నాను. ఒక్కక్షణం సేదతీరాను. అతను తిండి తినే విధానం చూస్తే మరిదిగారు తప్ప ఎవరూ ఆవిధంగా తినరని గ్రహించాను. ఇంకెవరూ మాజీ మరదిగారే! అతనికి భోజనం చేసే బల్లవద్ద కూర్చోవాలనే ఆలోచన కూడా లేదు. వండిన పదార్థాలు వండిన వంటగది అల్మైరా వద్దనే కూర్చున్నాడు. అతడు ఎప్పుడూ అలాగే తినేవాడు. తిండి పోటీలో వేగవంతమైన రికార్డు సాధించే ప్రయత్నంలా కనిపించింది.

చేతి ఆసరా చేసుకున్న చేతి కఱ్ఱను గాలిలోకి లేవనెత్తి పట్టుకుని "దొంగా...!" అని అరిచాను. ఆ మనిషి ఒక్క వుదుటున లేచి నిలబడి నావైపు తిరిగి 'నేనే' అన్నాడు."నువ్వెవరు? మా అన్నం దొంగిలిస్తున్నావు?" అని మళ్ళీ అరిచాను.

"ఒహ్ నేను ఆకలితో వుండి తినడానికి ఇంటికి వచ్చాను".

కఱ్ఱను పక్కనే వుంచుతూ "ఇంటికి వచ్చావా? నేను నిలదీశాను.

ఇన్ని సంవత్సరాల నుండీ నువ్వు ఎక్కడున్నావు? దాదాపు రెండు సంవత్సరాలకు పైగా గడిచిపోయింది. ఒక్కమాట అయినా చెప్పకుండా కనిపించకుండా పోయావు."

"అమ్మాయిలు ఎక్కడున్నారు?"

"వాళ్ల గురించి నువ్వేం శ్రద్ధ తీసుకున్నావు? వాళ్ల నాన్న చనిపోయాడని వాళ్లనుకుంటున్నారు! నువ్వు వాళ్ళకి తండ్రివి కావు. వారిని విడిచిపెట్టి రెండు సంవత్సరాలకు పైగా గడిచిపోయింది. ఎప్పుడూ జూదం ఆడుతూ తాగుతూ వుంటావు. ఇది నీ ఇల్లు కాదు."

అతడేమీ పట్టనట్టు వేగంగా తినడం మొదలుపెట్టాడు.

"నువ్వసలు మాకు కన్పించొద్దు. మానాన్న నిన్ను చూశాడంటే చంపుతాడు. నువ్వే మా చెల్లిని చంపావని ఆయన అనుకుంటున్నాడు! నేనూ అలాగే అనుకుంటున్నాను. ఆమె వివాహ జీవితాన్ని నిర్లక్ష్యం చేశావు. ఆమెకు అండగా వుండే విధంగా ఏనాడూ పనిచేయలేదు. మేము నీ కుటుంబానికి మద్దతు ఇచ్చాం. ఇప్పుడు మళ్ళీ ఎలా తిరిగి రాగలిగావు? నీ కడుపు నింపుకోవడానికి మాత్రమే! నేను చెబుతున్నాను. మానాన్న నిన్ను చంపగలడు"

నాకు తెలుసు మా నాన్న చూస్తే ఇతన్ని కఱ్ఱతో గాని, మరే వస్తువుతో అయినా గాని కొట్టి వుండేవాడు. ఈ మనిషి ముప్పై ఏళ్ళ వాడు. బలిష్టుడు. మానాన్న పెద్దవాడు. ఇప్పటికే ఏభై అయిదు సంవత్సరాలు వయసుదాటి వున్నాడు. అనారోగ్యం కూడా. ఇద్దరూ పోట్లాడుకుంటే మానాన్నే ఓడిపోతాడు ఖచ్చితంగా.

"నువ్వు నా బిడ్డల్ని జాగ్రత్తగా చూసుకో" అతను లేచి నిలబడ్డాడు. నేను కోపంతో వణికిపోయాను. "బయటికి ఫో..." అంటూ అరిచాను. అప్పుడే మానాన్న అక్కడికి రావడం కనబడింది.

మా మరిది నిరాశగా వున్న నన్ను చూసి "ఏమిటి సంగతి?" అన్నాడు.

మానాన్న వైపు తలతిప్పి చూశాడు.

"అతడు ఇక్కడ ఏం చేస్తున్నాడు? నా ఇంటికి ఎందుకు వచ్చాడు?" మా నాన్న గద్దించాడు.

"నేను వచ్చేసరికి తింటున్నాడు" నేను జవాబు చెప్పాను.

'ఆకలి ముష్టివాడా! ఫో... నా ఇంట్లో నుంచి" మా నాన్న అరిచాడు అతనివైపు చూడటం ఇష్టం లేక పక్కకు తిరిగిచూస్తూ.

"నేను నీ అల్లుణ్ణి" అన్నాడతను గట్టిగా.

"నాకు అల్లుడు లేడు" కోపంతో అరిచాడు మానాన్న

"ఓరి దేవుడా" ఆ యువకుడు నిరాశగా నిట్టూర్చాడు.

ఇంకా నయం వాళ్ళిద్దరూ పోరాటానికి దిగలేదు. వాళ్ళిద్దరి మధ్యా అసలు పోరాటం మొదలుకాకముందే అతడ్ని గెంటివేయాలి అనుకున్నాను.

"దొంగా... తిండి దొంగా! బైటకు ఫో" అని అరిచాను.

ఆ యువకుడు ఏమీ మాట్లాడకుండా తొందరగానే బైటకు వెళ్ళిపోయాడు. నేను ఒక నిట్టూర్పు విడిచాను.

మానాన్న 'టేబుల్ దగ్గిర అలాగే కూర్చుండిపోయాడు.

మా చెల్లికి కలిగిన కవల అమ్మాయిలు ఆ టైమ్‌లో ఇంట్లో లేనందుకు నాకు సంతోషం కలిగింది. నగరంలోని పార్కులో ఆటపాటలు నేర్పించే బడి పిల్లల చేత వినోద కార్యక్రమం ఏర్పాటు చేశారు. ఆ ప్రదర్శనకు అమ్మను తోడిచ్చి పంపించాను పిల్లల్ని తీసుకెళ్ళమని!



అతడు వండిన అన్నమంతా తినేయడం వలన మళ్ళీ అన్నం వండాల్సి వచ్చింది.

"అతడు ఎట్లా తిన్నాడో నీకు గుర్తుందా మన ఇంట్లో ఇంతకుముందు వుండే రోజుల్లో ఇలాగే తినేవాడు!" అన్నాను మా నాన్నతో.

"వాడి గురించి మాట్లాడకు నాకు చిరాకు కలుగుతుంది" అన్నాడు మా నాన్న. నేనతన్ని నిందించలేదు. నా చిన్న చెల్లి "హరూషిమోడా' పదహారేళ్ల వయసులో ఇరవై ఏళ్ళ వయసున్న "గొరోకాటొను పెళ్లి చేసుకుంది. మా చెల్లి ఎప్పుడూ బలహీనంగా వుండేది. గొరో దృఢంగా ఆరోగ్యంగా వుండటం వలన మా అమ్మా నాన్నలు మా చెల్లి పట్ల శ్రద్ధ తీసుకుంటాడని నమ్మారు. గొరో మా నగరానికి బయట వుండే వ్యవసాయ క్షేత్రం నుండి వచ్చాడు. అతడు, హరు మా ఇంట్లోనే వుండేవారు. హరూకి కవలలు కలిగారు మూడు సంవత్సరాలు తర్వాత. పెళ్ళయిన మూడు సంవత్సరాల్లో గొరో చాలా ఉద్యోగాలు మారేడు. మధ్యలో పని మానేసేవాడు. మా నాన్న వ్యవసాయం చేయడం అతనికి నచ్చలేదు.

కవలలకి రెండు సంవత్సరాల వయసు వచ్చిన తర్వాత మా చెల్లి తీవ్రమైన న్యూమోనియాతో మరణించింది. ఆమె మరణించడానికి కొద్ది నెలల ముందే నాకు టోక్యోలో ఉద్యోగం వచ్చే అవకాశం వుందని మాతో చెప్పి ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు. మా చెల్లి మరణించిన ఆరు నెలల తర్వాత చేతిలో చిల్లి గవ్వ లేకుండా గొరో వెనక్కి తిరిగి వచ్చాడు. మరి కొంతకాలం మా ఇంట్లోనే వుండి పిల్లలు అతనికి అలవాటు పడేలోగానే ఏం చెప్పకుండానే మమ్మల్ని వదలి వెళ్ళిపోయాడు. కవల అమ్మాయిలకి ఇప్పుడు అయిదు సంవత్సరాలు. వాళ్ళు నా స్వంత పిల్లల్లాగే వుంటారు. మా చెల్లి జీవించి వున్నప్పుడే ఆమె బలహీనంగా వుండటం వల్ల పిల్లలు చాలా వరకూ నా సంరక్షణలోనే వుండేవారు.

మా తల్లిదండ్రులు త్వరలో వృద్ధులవుతారు కనుక భవిష్యత్‌లో ఏం చేయాలనేది తీవ్రంగా ఆలోచించాలి. ఎందుకంటే పిల్లలకు అప్పుడు నేను తప్ప ఎవరూ లేకపోవడం వల్ల. ఏదో అద్భుతం జరిగి గొరో నిజాయితీ గల వ్యక్తిగా మారితే తప్ప. అయితే అలా అనుకోవడం మూర్ఖత్వమే గాక మరేమిటి? వాళ్ళను ఆదుకోవడానికి నాకొక ఉద్యోగం దొరకాలి. బహుశా నేను చట్ట ప్రకారం వాళ్లను దత్తత చేసుకోవచ్చు. కాని గొరో దానికి అడ్డురావచ్చు. నేనెప్పుడూ వివాహం చేసుకోవాలని అనుకోలేదు. నేనెప్పుడూ నా చెల్లి సంరక్షణే చూసేవాణ్ణి.

రాత్రి భోజనం సిద్ధమయ్యేసరికి మా అమ్మ, కవల అమ్మాయిలు తిరిగి వెనక్కి వచ్చారు. వాళ్లు చూసిన ప్రదర్శన గురించి చాలా ఉత్సాహంగా మాట్లాడుకుంటున్నారు. మా నాన్న ప్రమాదకరమైన వాలకాన్ని చూసి మా అమ్మ వెంటనే గ్రహించి ఆరాతీస్తున్నట్టు నావైపు చూసింది. నేను ఏమీ పట్టించుకోకుండా, పిల్లల కబుర్లు విని ఆనందిస్తున్నాను. అమ్మాయిల ఎదుట నేను గొరో ప్రసక్తి తీసుకురావాలని అనుకోలేదు. పిల్లలు అలసిపోయారు. చిన్న పిల్లలు కావడం వలన. భోజనం పెట్టి వాళ్ళని మంచం దగ్గరకి తీసుకెళ్ళి నిద్రపుచ్చాను. అప్పుడు నేనూ, మానాన్నా కలసి అమ్మతో గొరో ప్రసక్తి తెచ్చాము. మా అమ్మ నిట్టూర్చింది. గొరో ఇప్పుడు ఆరోగ్యంతోనే వున్నాడు. అతడు జీవించినంతకాలమూ తరచుగా ఇంటికి ఇలా వస్తూనే వుంటాడు. పిల్లలకి తండ్రి గురించిన యదార్థం తెలియాలి. ఒకరకంగా వారి దృష్టిలో వారి తండ్రి మరణించాడు. రెండు సంవత్సరాల కాలంలో గొరో నుంచి ఎలాంటి కబురూ లేదు. అంతకుముందు కూడా అతడు బయటే వున్నాడు. అందువల్ల పిల్లలకు తండ్రి లేడన్నమాట నిజమే కదా! అతనెప్పుడూ తన పిల్లలయందు శ్రద్ధ చూపించలేదు. అతడు నాతో చెప్పాడు నువ్వే నా బిడ్డలను సంరక్షించాలని. అతడు ఎప్పుడూ కోరుకోలేదు తన పిల్లలు చూడాలని. "హారూ ఎంత తెలివితక్కువ పనిచేసింది ఆ మనిషిని పెళ్ళి చేసుకునే విషయంలో..." అన్నాను కోపంతో.

"అది తెలివిలేనిది సరే! మనం కూడా అతన్ని అంచనా వేయడంలో తెలివితక్కువ పనే చేశాం" అన్నాడు మానాన్న ఓటమిని అంగీకరిస్తూ. మధ్యాహ్నమంతా పిల్లలతో గడిపి అమ్మ కూడా అలిసిపోయింది. అందువల్ల తొందరగా నిద్రపోయింది. నామనసంతా చికాకుగా వుండి ఇంకా నిద్ర రాలేదు. అంతలోనే వెనుకవైపు తలుపు

# మన భాష

- పొత్తూరి సుబ్బారావు



జనులగోడుతో జనపదమై
జానపదమై నిలిచి
పలు పదముల
నక్కున చేర్చుకున్న
అమృత భాష

బ్రహ్మమొక్కటేనంటూ
తిరువీధులయందు పలికిన
అన్నమయ్య పదములలో
దాగియున్న ప్రజల ఘోషకు
బ్రహ్మరథం పట్టిన
బహుగొప్ప భాష

వేమన పద్యాలలోని
గూఢార్థాన్ని విప్పి చూపి
సారాంశాన్ని సామాన్యులకు
అందించిన అరుదైన భాష

విరుచుకుపడిన కులతత్వాన్ని
ఖడ్గమై ఖండించిన
జాషువా కలానికి
ఊతమిచ్చిన ఉన్నత భాష

సమస్యల వలయంలో చిక్కుకొని
సతమతమయ్యే వారికైనా
సరదాలకు లోటుండదని చెప్పిన
సరసమైన ఎంకిపాటల
ప్రణయంతో పారవశ్యం చెందిన
పరువాల భాష

వీరేశలింగం కలంతో
మూఢ విశ్వాసాల
మాడు పగులగొట్టి
గోదారిలా పరువళ్లుత్రొక్కిన
ప్రజల భాష

గురజాడ రచనల్లోని
దేశభక్తిని పలువురికి పంచిపెట్టి
పుత్తడి బొమ్మయై
మెలికలు తిరిగిన
మేలిమి బంగరు భాష

సాధారణ మనిషికై పరితపించి
శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని
ఆరంభింప చేసి
తెలుగు కవితను ప్రజల
కవితగ తీర్చిదిద్ది
మరో ప్రస్థానానికి
దారి మళ్ళించిన
అసాధారణ భాష

చెక్కభజనలో ఒగ్గుకథలో
బుర్ర కథలో, వీధినాటకంలో
ప్రజా కళలెన్నిటిలోనో
ఇమిడి పోయి
వాడ వాడలా గుమ్మాల ముంగిట
సమస్యలను గుమ్మరించి
ప్రజలను తిరగబడేలా చేసిన
తరతరాల తెలుగు
మనందరికీ వెలుగు

---

# క్రీ(నీ)డ

- ఉప్పలధడియం
వెంకటేశ్వర



రోజంతా మా బుడుగు
బుల్లితెరకు కళ్ళప్పగించి కూచున్నాడు

కబేళాకు వెళుతున్న మేకపిల్లలా
పశ్చిమం వైపుకు సూర్యుడు పయనించాక-

'మాంచి ఒడుపులో ఉన్నాం కదా' అంటూ
ముసిముసి నవ్వులు రువ్వింది విజేత జట్టు

'ఆటగచ్చు' బాగా లేదంటూ
ఒడుపుగా నెపం నెట్టేశారు పరాజితులు

అంచనా ఎందుకు తప్పిందో
అర్థం కాని పిల్లాడు
క్రీడాస్థలి
మైదానమే కానక్కర్లేదని
గ్రహిస్తాడా?

---

మీద తట్టిన శబ్దం వినబడింది. నేను తలుపు దగ్గరకు వెళ్ళి తలుపుకున్న అద్దం గుండా గొరోను చూశాను. "ఇప్పుడేం కావాలి నీకు?" నెమ్మదైన గొంతుతో గొణిగాను.

"నాకొకసారి అమ్మాయిల్ని చూపించు అప్పుడు నా దారిన నేను వెళ్ళిపోతాను ప్రమాణపూర్వకంగా" దీనంగా గొణిగాడతను.

అతడు అమ్మాయిల్ని చూడాలని కోరుతున్నాడు. కనీసం.. అందుకు ఆనందం కలిగింది. హోరూ ఆత్మ కూడా సంతోషపడుతుంది. నేను తలుపుతెరచి అన్నాను.

"వాళ్లను లేపవద్దు."

పక్కపక్కనే నిద్రపోతున్న అమ్మాయిల్ని అతడు చూస్తుంటే నేను అతడి దుస్తులవైపు చూశాను, పరీక్షగా.

అవి మాసి చిరిగిపోయి వున్నాయి. అతడు ఇంకా చలికి వేసుకునే దుస్తులతోనే వున్నాడు. ఇప్పుడు అందరూ వసంతానికీ వేసవికీ మధ్య కాలంలో సరిపడే తేలికపాటి దుస్తులు ధరిస్తారు.

"ధన్యవాదాలు" అన్నాడు గోరా చిన్న స్వరంతో.

"నీకు మళ్లీ ఆకలివేస్తోందా?

"లేదు" మొహమాటంగా గొణిగాడు.

"నీ దగ్గిర డబ్బుందా."

"లేదు"

నేను నా గదిలోకి వెళ్ళి నా చేతి బ్యాగ్‌ను తెచ్చాను. పర్స్ ఖాళీ చేసి మొత్తం అంతా అతడికే ఇచ్చాను. నాకు గుర్తులేదు. ఆ పర్స్‌లో ఎంత వుంచానో.

గొరో నిశ్శబ్దంగా దాన్ని తీసుకుని వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. చీకటిలో అతడు మాయమవడం గమనిస్తూ తలుపు తాళం వేశాను.

'నేను పెద్ద తప్పిదం చేశాను' నాలో నేను అనుకున్నాను. అందువల్లే మళ్ళీ అతడు తిరిగి వస్తూనే వుంటాడు.

నా దయచూసి నా మీద నాకే కోపం వచ్చింది. నన్ను నేనే తిట్టుకున్నాను. అతడు తిరిగి రాకుండా బెదిరే విధంగా కటువుగా మాట్లాడి వుండాల్సింది. కాని... అతడు... నా చెల్లిలికి భర్త.

ఆమె పిల్లలకు తండ్రి కూడా....! ఆ బంధానికి లొంగిపోయాను.

# బోయి భీమన్న సామాజిక స్వప్నం



- డా॥ కె. శ్రీదేవి

*దళిత చైతన్య సామాజిక భూమిక సిద్ధం కావడానికి అనేకమంది సాహితీమూర్తులు అస్పృశ్యతా సమస్యలపైన ప్రతిస్పందించారు. ఈ విధంగా సామాజిక ఉద్యమాలు బలపడడానికి, దళితుల చైతన్యం ఇనుమడించడానికి ఉపయోగపడే దళిత నాటక సాహిత్యాన్ని సృజించిన తొలితరం సాంఘిక నాటక రచయితలలో బోయిభీమన్న ప్రసిద్ధులు. దళితుల అభ్యున్నతి కోసం తపిస్తూ దళితుల సమస్యలనే తన నాటకాలలో ఇతివృత్తాలుగా స్వీకరించారు.*

వేలాది సంవత్సరాలుగా దళితులు అసమానతలకూ, అన్యాయాలకు గురయి, అంటరానివారుగా ముద్రవేయబడి సామాజిక, ఆర్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో అణగదొక్కబడినారు. సమాజంలో అగ్రవర్ణాల, ఆధిపత్యకులాల పీడనలో బతికిన దళితులు ఇపుడిప్పుడే తమకు జరిగిన అన్యాయాలను ప్రతిఘటించి అన్ని సామాజిక అవసరాలలోను తమ వాటా కోరుకుంటున్నారు. పోరాటాలు సాగిస్తున్నారు. సామాజిక వ్యవస్థలో సమూలమైన మార్పు కోరుకుంటున్నారు. ఈ రకమైన దళిత చైతన్య సామాజిక భూమిక సిద్ధం కావడానికి అనేకమంది సాహితీమూర్తులు అస్పృశ్యతా సమస్యలపైన ప్రతిస్పందించారు. ఈ విధంగా సామాజిక ఉద్యమాలు బలపడడానికి, దళితుల చైతన్యం ఇనుమడించడానికి ఉపయోగపడే దళిత నాటక సాహిత్యాన్ని సృజించిన తొలితరం సాంఘిక నాటక రచయితలలో బోయిభీమన్న ప్రసిద్ధులు. దళితుల అభ్యున్నతి కోసం తపిస్తూ దళితుల సమస్యలనే తన నాటకాలలో ఇతివృత్తాలుగా స్వీకరించారు. వీరు రచించిన సాంఘిక నాటకాలను పరిశీలిస్తే దాదాపు అన్ని నాటకాలూ దళితుల జీవన విధానాన్ని చిత్రీకరించినవే. ఇవి అసంకల్పితంగా భీమన్న కలం నుండి జాలువారినవి కావని ఘంటాపథంగా చెప్పవచ్చు. తాను అనుభవించిన బాధలు, అవమానాలు, ఆపేక్షలు, అనురాగాలు అన్నీ ఆనాటి సమకాలీన సమాజ ప్రతిబింబాలేనన్న వాస్తవాన్ని "పాలేరు", "కూలిరాజు", "పడిపోతున్న అడ్డుగోడలు", "ప్రగతి", "మానవుని మరో మజిలి", "అసూయ" మొదలైన సాంఘిక నాటకాలు ప్రతిబింబిస్తాయి.

దళితులు తమపై అమలవుతున్న కులవివక్షకు ఎదురు తిరగడం ద్వారా కాకుండా సామరస్యంగా ప్రజాస్వామ్య బద్ధంగా, ఒక బలమైన సామాజిక వర్గంగా ఎదగాలన్న స్వప్నం భీమన్న నాటకాల్లో వ్యక్తమవుతుంది. దళితులకు లభించాల్సిన సామాజిక హోదాపట్ల ఈయనకు గాఢమైన తపన ఉంది. ఈ తపనే "పాలేరు", "కూలిరాజు" "పడిపోతున్న అడ్డుగోడలు", "ప్రగతి", "అసూయ" మొదలైన నాటకాలన్నింటి లోనూ అభివ్యక్తమవుతుంది. ఈ నాటకాలను పరిశీలించినపుడు, అణగారిన కులాలు అనుభవిస్తున్న హింసను, సామాజిక వివక్షను వ్యతిరేకిస్తూ ఒక సామాజిక బాధ్యతతో బోయి భీమన్న రచనలు చేసారని చాలా స్పష్టంగా అర్థమవుతుంది. సామాజిక బాధ్యతతో రచనలు చేసే ఏ రచయితకైనా నాలుగు ప్రశ్నలు ఎదురవుతాయని "జాషువా స్వప్నం సందేశం" సిద్ధాంత వ్యాసకర్త ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి అంటారు. అవి ఏవంటే?

1. తాను నివసిస్తున్న సమకాలీన సమాజం ఎలా ఉంది?
2. ఆ సమాజం అలా ఉండడానికి గల కారణాలేమిటి?
3. ఆ సమాజం ఎలా ఉండాలని రచయిత ఆశిస్తున్నాడు?
4. తాను కలలుగన్న సమాజం ఏర్పడడానికి గల పరిష్కార మార్గాలేమిటి?

ఈ నాలుగు ప్రశ్నలకు దొరికే సమాధానమే ఆ రచయిత స్వప్నం అవుతుంది. బోయి భీమన్న తన సాంఘిక నాటకాల్లో ఆనాటి సమకాలీన సామాజిక సమస్యలను ఇతివృత్తంగా ఎన్నుకున్నారు. ఈ సమస్యలకు గల కారణాలు కూడా తన రచనల్లో చెప్పటమే కాక పరిష్కార మార్గాలను సైతం సూచించారు. తాను స్వప్నించిన సమాజం ఎలా ఉండాలో కూడా బోయి భీమన్నకు తెలుసు. ఈ సామాజిక స్వప్నాన్ని నిజం చేసుకోవడానికి ఈ సమస్యల పరిష్కారం మార్గాలను కూడా తన నాటకాల్లో సూచించారు. ఖచ్చితంగా తాను నమ్మిన సిద్ధాంతాలన్నింటినీ నేపథ్యంగా చేసుకుని ప్రగతిశీల మార్గాలను అన్వేషించారు. అందుకే ఆయన దళిత సామాజిక స్వాప్నికుడైనాడు.

బోయి భీమన్న స్వప్నం మానవులందరూ ఎలాంటి వివక్షతలకు గురికాకుండా, సమానంగా జీవించగల "ఆదర్శ సమాజం" అ స్వప్నాన్ని సాఫల్యం చేసుకోవడానికి భీమన్న అందించిన పరిష్కారమార్గాలు.

1. దళితులందరూ చదువుకుని ఉద్యోగాలు పొంది సామాజికంగా ఎదగాలి.
2. కులాంతర వివాహాలు విరివిగా జరగాలి.

**పేద, బడుగు వర్గాల కుటుంబాలలోని మారుమనువులు, భూస్వాములు కామంతో కబళించే పాలేరు భార్యలైన దళిత స్త్రీల సమస్యను సైతం చిత్రిస్తూనే తాను చెప్పాలనుకున్న ప్రధాన సమస్యలపైన తన దృష్టిని కేంద్రీకరించి, మిగిలిన సమస్యలన్నింటిని పాలేరుతనం చుట్టూ అల్లుకున్న దళిత జీవన విధానాన్ని ఈ నాటకంలో సమర్థవంతంగా చెప్పగలిగారు.**

కులాంతర వివాహాలు జరగాలి అంటే సామాజిక కులాల వారందరూ చదువుకోవాలి. ఉద్యోగాలు పొందాలి. సామాజిక హోదా సంపాదించాలి. అలా తప్ప అగ్రవర్ణాల వారు దళితులను వివాహం చేసుకోవడానికి ముందుకు రాలేరని ఈయన విశ్వసించారు. అందుకే పాలేరు, కూలిరాజు, పడిపోతున్న అడ్డుగోడలు, ప్రగతి. ఈ నాలుగు నాటకాల్లోనూ భీమన్న చదువుకున్న యువతీ యువకుల మధ్య ప్రేమ, కులాంతర వివాహాలను జరిపించారు. అంబేద్కర్ సూచించిన "చదువు - పోరాడు - సమీకరించు" అనే నినాదం బోయి భీమన్న రచనల్లో సర్వత్రా వ్యక్తమవుతుంది.

పాలేరు నాటకం ప్రారంభంలో చెప్పిన "బానిసతనమును బాపుమురా" అన్న పాటలో ఆనాటి సమాజాన్ని చిత్రిస్తూ....

"ఒకడు తినుచు - మరియొకడు పస్తుపడి

యుండుట ధర్మము కాదురా !

కూడు గుడ్డ కొంపయు సమానముగ

కూర్చుమురా లోకమున"

అని ఉద్బోధిస్తారు. ఇదే పాటలో "సకల దేశముల - సర్వమానవుల సామ్యము సాధింపుమురా" అని ప్రపంచ మానవులందరూ సమానులే అని జాతి కుల వర్గభేదాలు లేని సమాజం కోసం పాటు పడమనే కర్తవ్య బోధన కనిపిస్తుంది. తాను కలలుగనిన సమాజాన్ని గురించి చెబుతూ

"ప్రభువు - సేవకుడు లేని సంఘమును

పదిలముగా నిర్మింపుమురా!

సౌఖ్యము, సంతోషము మానవులకు

సమకూర్చుమురా! వీరా!

అంటూ దళిత పోరాట వీరులతో పాలితులు పాలకుల మధ్య వ్యత్యాసాలు లేని సమాజాన్ని నిర్మాణం చేయమని, అలా చేసేటప్పుడు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలని కూడా హెచ్చరిస్తాడు. ఈ ఒక్క గేయం చాలు, భీమన్న స్వప్న సారాంశమే అన్ని సాంఘిక నాటకాలలోనూ పడుగు పేకల్లాగా పర్యవసించింది.

గోదావరి తీరంలోని "రైతువాడ" అనే గ్రామంలో కుబేరయ్య అనే భూస్వామి ఉంటాడు. అతని దగ్గర పుల్లయ్య పెద్ద పాలేరు. అతని కొడుకు వెంకన్న పిల్ల పాలేరు. వీళ్ళు గాక మరో పాలేరు వీరేశు. పుల్లయ్య భార్య భూస్వామి కుబేరయ్య దౌర్జన్యానికి బలైతే, ఆమె చెల్లెలు సీతను మారుమనువు చేసుకుంటాడు. వీరేశు భూస్వామి చెప్పిన పనిని తు.చ తప్పక ఆచరించే నమ్మిన బంటే కాదు, మంచి బలశాలి కూడా. కాని పుల్లయ్య రెండో భార్య సీతపై భూస్వామి కన్నేశాడని తెలిసి సీతను తీసుకుని అతని పాలేరుతనం నుండి పారిపోతాడు. పేద, బడుగు వర్గాల కుటుంబాలలోని మారుమనువులు, భూస్వాములు కామంతో కబళించే పాలేరు భార్యలైన దళిత స్త్రీల సమస్యను సైతం చిత్రిస్తూనే తాను చెప్పాలనుకున్న ప్రధాన సమస్యలపైన తన దృష్టిని కేంద్రీకరించి, మిగిలిన సమస్యలన్నింటిని పాలేరుతనం చుట్టూ అల్లుకున్న దళిత జీవన విధానాన్ని ఈ నాటకంలో సమర్ధవంతంగా చెప్పగలిగారు.

హిందూ సమాజం దళితులను అస్పృశ్యులుగా ముద్రవేసి సమాజం నుండి వెలివేయడం వల్ల ఈ రోజుకు కూడా కోట్లాది మంది నిరక్షరాస్యులుగానే ఉన్నారు. హిందూ మత గ్రంథాలు, ధర్మశాస్త్రాలు, బృహస్మృతి, మనుస్మృతులు దళితులకు వేద పారాయణాన్ని నిషేధించాయి. వేదాలు, శ్లోకాలు, ఒకటేమిటి జ్ఞాన సంబంధమైన ఏ సమాచారం కూడా దళితులు తెలుసుకునే వీలు లేకుండా చేశారు. ఒకవేళ తెలిసో తెలియకో అలాంటి ప్రయత్నం చేసినా వారిని శిక్షించేవారు. వేదాలు చదివితే నాలుకలు కోసేవారు. మంత్రాలు వింటే చెవుల్లో సీసం పోసేవారు. ఇతర విద్యలు నేర్చుకుంటే బొటనవేళ్ళు తెగకోయాలని ఈ శాస్త్రాలు శాసించాయి. ఈ పరిస్థితి ఇప్పుడు లేకపోయినా తరతరాల వెలివేత వాళ్ళు ఇవాల్టికి పాఠశాలల్లో చేరడానికి అడ్డంకిగా ఉంది. ఎన్ని సంక్షేమ కార్యక్రమాలు అమలు జరిగినా దళితుల్లో అక్షరాస్యత, ఇతర కులాల అక్షరాస్యతతో పోలిస్తే సగానికి కూడా చేరలేదు. వారి కుటుంబాల్లో పేరుకుపోయిన పేదరికం వల్ల పెద్ద చదువులు చదివే అవకాశం లేకుండా పోతుంది. ప్రభుత్వం కల్పించే వసతులు అందరికి అందకపోవడం, ఇంట్లో చదువుకునే వాతావరణం దొరకపోవడం కూడా దానికి కారణం. అనేకమంది దళిత పిల్లలు వెట్టి బానిసలుగా, బాల కార్మికులుగా, కూలీలుగా పనిచేయకపోతే కుటుంబాలు కూడా గడవని గడ్డు పరిస్థితి ఉంది. ఈ రకపు సామాజిక, ఆర్థిక నేపథ్యంలో దళితులకు చదువు యొక్క ప్రాధాన్యతను వివరిస్తూ...

"విద్య అనియెడు కాగడ వెలుగుజూపి

ఏల రక్షించుకొనరు మన బాలకులను?

విద్య లేని మనుష్యులు వింతపశువు

లన వినరె? పశుత్వమ్మె మీకమృతమగునె?"

అన్న వేదన "పాలేరు" నాటకంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

"బడికి పంపుడు, విద్యనేర్పుడు రవంత

ముందునకు బోవనిందు మీ ముద్దు సుతల"

అంటూ, పాలేర్లుగా బ్రతుకుతున్న చిన్నారుల జీవితాలను తీర్చి దిద్దాల్సిన తల్లిదండ్రులను చైతన్యవంతం చేస్తూ ఆలపించిన

గీతమిది. ఈనాటి బాలకార్మిక వ్యవస్థ 60 సంవత్సరాల తర్వాత స్వతంత్ర భారతంలో స్వాతంత్ర్యానంతర ఫలశ్రుతిగానే మిగిలిపోయింది. పాలేరు నాటకంలో ప్రధానంగా భీమన్న ప్రభోదించిన అంశాలు దళితుల పిల్లలను పాలేర్లుగా పంపకుండా బడికి పంపించమంటారు. "రైతువాడ" గ్రామంలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న ఉపకారిద్వారా పాలేర్లుగా ఉన్న పిల్లల తల్లిదండ్రులను జాగృతపరుస్తూ ముక్కుపచ్చలారని చిన్నపిల్లల్ని పాలేర్లుగా పెట్టి వారి జీవితాలనే పణంగా పెట్టి వెట్టి కార్మికులుగా మారుస్తున్నారని–

"పసిబిడ్డ తెచ్చు సంపాదన
కాశించి మనుగడనే మాపు
జనకులారా!"

అంటూ పసిపిల్లలు తెచ్చే సంపాదన కాశపడిన తల్లిదండ్రులను మానవత్వం మరచిన మనుషులుగా సంభోదిస్తాడు.

చిన్నతనంలోనే పసిపిల్లల పెంపకం, ఇంటిచాకిరీ మోసే అమ్మాయిలు చదువుకోలేక నిరంతర శ్రమలోకి, అంతులేని చాకిరీలోకి తమకు తెలియకుండా నెట్టివేసే ఆడపిల్లల తల్లుల అమాయకత్వాన్ని విడమరిచి చెప్తూ వారికి ఉపకారి పాత్ర ద్వారా జాగృతం చేయాలని చూస్తారు. కానీ అతన్ని తమ నోటి కాడ కూడు తీసేందుకు ప్రయత్నించేవానిగా, భూస్వామికి, బుడతకు వైరుధ్యం పెంచేవారుగా ఉపాధ్యాయున్ని ఎంచి తమ గుడిసెల ప్రక్కకు వస్తే కాళ్ళిరగొడతామని వెంకన్న తండ్రి హెచ్చరిస్తాడు. కానీ వీటినేమి లెక్కచేయకుండా ఉపాధ్యాయ ఉపకారి చదువు ప్రాముఖ్యాన్ని వివరిస్తూనే ఉంటాడు. పాలేరుతనాన్ని బానిసత్వంగా గుర్తించి అది పోవాలంటే చదువొక్కటే మార్గమనే సత్యాన్ని బలంగా నమ్మారు. దళితుల పిల్లలకు పేర్లు ఉండవు. పేర్లున్నా పూర్తి పేరుతో ఏ పాలేరునూ పిలవరు. అందుకే కేవలం చదువుకోవడంవల్లనే పాలేరు వెంకన్న డిప్యూటి కలెక్టరు వెంకటేశ్వర్రావుగా పర్యవసించిన వైనాన్ని ఈ పాత్రద్వారా నిరూపిస్తాడు.

దళితుల విముక్తికి, కులరహిత సమాజం ఏర్పడడానికి కులాంతర వివాహాలే మార్గమని, ప్రేమ వివాహాలు జరగడం ద్వారానే కులం అడ్డుగోడల్ని బద్దలు కొట్టవచ్చుని పాలేరు "పడిపోతున్న అడ్డుగోడలు", "కూలిరాజు", "ప్రగతి", "అసూయ" మొదలగు నాటకాలలో చెబుతారు. చదువు కోవడం ద్వారా ఉద్యోగాన్ని సంపాదించి, అధికారం పొందితే తద్వారా సామాజికంగా గౌరవం, హోదా పెరుగుతాయని కూడా ఈ నాటకాల ద్వారా నిరూపించారు. అయితే చదువుకున్న దళిత అధికారులు తమ జాతిని, దళితుల సంక్షేమాన్ని విస్మరించారని చెబుతూ –

"చదువుకొన్న ప్రతి దళితుడు
సర్కారు కొలువులో చేరిపోతున్నప్పుడు
కొలువెక్కిన ప్రతి ఉద్యోగి
కుక్షింబరుడై జారిపోతున్నప్పుడు"

అంటూ దళితేతర అధికారులకంటే తామే మాత్రం భిన్నం కాదంటూ ప్రవర్తించే దళిత అధికారుల పట్ల తన ఆవేదననూ, ఆక్రోశాన్ని వ్యక్తం చేశారు.

డిప్యూటి కలెక్టరు వెంకటేశ్వర్రావు తన గ్రామానికి తిరిగి వచ్చి ఉపకారి ఉపాధ్యాయుడుతో మీ చలువ వల్లనే ఇంతవాడినయ్యాను. మీరు నా దగ్గర ఉండాలి అని అడిగినపుడు ఆయన "అది స్వార్థం అవుతుంది. నీ వంటి కలెక్టర్లను ఎంతమందిని తయారు చెయ్యాలో నేను ఈ దళిత సంఘం నుండి. ఒక కలెక్టర్ అన్న మాటేమిటి? ఒక్కసారి బడిలో చేరినవాడు కోరికను బట్టి, పట్టుదలను బట్టి ఇంజనీరు, డాక్టర్, ప్రొఫెసర్, లాయర్, జడ్జీ ఏదైనా కావచ్చు – నియమాతిక్రమణ చేయనక్కరలేదు. న్యాయం కలిగిస్తుంటే చాలు" అని ఉపకారి పాత్ర ద్వారా చదువుకున్న దళిత అధికారుల పట్ల తన అనుమానాన్ని పరోక్షంగా బయటపెడతాడు. పాలేరు నాటకంలో చదువు, ఉద్యోగం ద్వారా పొందే సామాజిక హోదాలే వర్ణాంతర వివాహాలే దళిత విముక్తి మార్గాలని నమ్మినప్పటికీ "కూలిరాజు" నాటకం దగ్గర కొచ్చేసరికి ఆ నమ్మకాలు బీటలు వారిన వైనం మనకు అవగతమవుతుంది. చదువుకున్న దళితులు తమ జాతి విముక్తికోసం, శ్రేయస్సుకోసం పాటు పడతారనే నమ్మకం బోయి భీమన్నకు లేదు. అందుకే "కూలిరాజు", "నాటకం"లో చదువుకొన్న దళితుడు, యువకుడైన మధుకు ప్రభుత్వ ఉద్యోగం వస్తే దాన్ని తిరస్కరించమని, కూలి రాజ్య సంస్థాపన కోసం పాటుపడమని, తినడానికి తిండి కూడా లేని పేద వ్యవసాయ దళిత కూలీల సంక్షేమం కోసం పాటుపడే కూలి రాజ్యాన్ని సాధించడం కోసం ప్రభుత్వ ఉద్యోగాన్ని త్యాగం చేయమని కోరతారు. దళిత జాతి విముక్తికి పోరాటమే మార్గమని సూచించిన దళిత దార్శనికుడు.

**చదువుకున్న దళితులు తమ జాతి విముక్తి కోసం, శ్రేయస్సుకోసం పాటు పడతారనే నమ్మకం బోయి భీమన్నకు లేదు. అందుకే "కూలిరాజు", "నాటకం"లో చదువుకొన్న దళితుడు, యువకుడైన మధుకు ప్రభుత్వ ఉద్యోగం వస్తే దాన్ని తిరస్కరించ మని, కూలి రాజ్య సంస్థాపన కోసం పాటుపడమని, తినడానికి తిండి కూడా లేని పేద వ్యవసాయ దళిత కూలీల సంక్షేమం కోసం పాటుపడే కూలి రాజ్యాన్ని సాధించడం కోసం ప్రభుత్వ ఉద్యోగాన్ని త్యాగం చేయమని కోరతారు. దళిత జాతి విముక్తికి పోరాటమే మార్గమని సూచించిన దళిత దార్శనికుడు.**

దళిత ఆడపిల్లల పట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ వంట ఇల్లొకటి ప్రపంచముగా చేసి "తనయ'ల నేడ్పించు తల్లులారా" అంటూ అమ్మాయిల చదువును బలపరచడమే కాక చదువుకున్న దళిత స్త్రీలు భారత అధ్యక్ష పదవిని సైతం అధిష్టించగల సమర్థురాలిగా "కూలిరాజు" నాటకంలో పరంజ్యోతి పాత్రను తీర్చిదిద్దారు. దళిత ఉద్యమం స్త్రీవాద ఉద్యమం రెండూ పడుగు పేకల్లాగా పెనవేసుకుని తమపై జరిగే అణచివేతను ప్రశ్నిస్తూ మమేకం కావాలనే కాంక్ష పరోక్షంగా వ్యక్తం చేశారు. స్త్రీవాద ఉద్యమం బలపడిన తర్వాత వచ్చిన స్త్రీల రాజ్యాధికారం గురించి డిమాండ్‌ను పందొమ్మిది వందల నలభై దశకంలోనే చిత్రించడం జరిగింది.

తొలిరోజుల్లో వచ్చిన దళిత ఉద్యమాలు విశాల సామాజిక చైతన్య స్రవంతిలో భాగంగానూ, ప్రత్యేక ఆత్మగౌరవ ఉద్యమాలలో అంతర్లీనంగాను ఎదిగాయి. ఈ ఉద్యమాల నాయకత్వం దళితేతర, అగ్రవర్ణ, వెనుకబడిన కులాల నుండి వచ్చినప్పటికీ ఈ ఉద్యమాలు మాత్రం కులం ఆధారంగా సాగుతున్న ఆరాచకాలను, వివక్షను హిందూ సమాజ వర్ణధర్మాన్ని, అంటరానితనాన్ని ప్రధానంగా ఎండగట్టాయి. ఈ ఉద్యమాలు అనేకమంది దళిత యువకుల్లో, మొదటితరం బుద్ధిజీవుల్లో చైతన్యాన్ని, స్ఫూర్తిని నింపడానికి దోహదపడ్డాయి. భారతదేశం అన్ని ప్రాంతాల్లో ఈ సామాజిక ఉద్యమాల ప్రభావంతో కొత్త స్వయం ప్రతిపత్తితో కూడిన దళిత ఉద్యమానికి బీజాలు పడ్డాయి.

రెండో దశలో ఇది దళితుల నాయకత్వంలో కేవలం దళితుల విముక్తి కోసం స్వతంత్ర దళిత ఉద్యమాల నిర్మాణానికి ఎంతో దోహదపడిన చారిత్రక నేపథ్యాన్ని "కూలిరాజు" నాటకంలో బోయి భీమన్న వివరిస్తారు. ''ధన మదాంధతకు - ఆకలి మంటకు నిత్య సుఖలోలతకు - నిరంతర కష్టానికి, గర్వప్రమత్తతకు - అభిమాన తీవ్రతకూ నిరంకుశత్వానికీ - స్వాతంత్ర్యేచ్ఛకు - యజమానిత్వానికి - దాస్యానికి ఇది ద్వంద యుద్ధంగా" అభివర్ణిస్తారు.

**అధికారం చేజిక్కించుకునేందుకు చదువుకున్న దళిత యువకుడు గ్రామాలకు తరలివెళ్లి వ్యవసాయ కూలి సంఘాలు స్థాపించి రాజకీయ అధికారాన్ని చేజిక్కించుకోవాలనేది కూడా భీమన్నగారి స్వప్నం. అపుడే దళితుల సమస్యలకు పరిష్కారం లభిస్తుందని భావించారు.**

భూస్వామి కుమారుడైన ప్రేమకుమార్ తన తండ్రి, ఆయన గుమస్తా చేసే దుర్మార్గపు పనులను నిరసిస్తూ "మనిషి పట్ల తోటి మనిషికి ఇంత శత్రుత్వం, క్రూరత్వం ఎలా వచ్చాయి? ఇదే కౌటిల్యం ప్రకృతికి కూడా ఉంటే మానవుని మనుగడే ప్రశ్నార్థకమవదా?'' అని ఈసడించుకుంటాడు. ఇతను ప్రగతిశీల భావాలు గల యువకుడు. వ్యవసాయ కూలీల యూనియన్‌కు ప్రెసిడెంట్‌గా ఎన్నుకోబడ్డ పరంజ్యోతిని తన సహాధ్యాయిగా గౌరవించడమే కాక కూలి జనం పట్ల ఆమెకున్న త్యాగానికి, నిబద్ధతకు, అందానికి ఆకర్షితుడై ఆమెను ప్రేమిస్తాడు. మరోజంట మధు, మిత్ర. వీరిద్దరూ పేద కూలి కుటుంబానికి చెందినవారు. స్నేహితులు కూడా. యూనియన్ పనుల్లో ఇద్దరు ఒకే ఆశయ సాధన కోసం కృషి చేసే సహచరులు. ప్రేమించి పెళ్ళి చేసుకుంటారు. రెండు జంటలు కుల, వర్గ భేదాలను మరచి ప్రేమించి పెళ్లి చేసుకుంటారు. వీరికి నిష్కల యోగి మార్గదర్శకత్వంతో కూడిన అండదండలుంటాయి. కొంతమేరకు భయంకరరావు పాత్ర ద్వారా వర్గ స్పృహను కలిగిస్తాడు. అతను సంపన్న వర్గాల కొమ్ము కాసేవాడు. పరంజ్యోతి పట్ల భూస్వామి విశ్వనాథరావు ప్రవర్తనను కళ్ళార చూసినపుడు అతడు తన వర్గానికి చేసిన దుర్మార్గం అర్థమవుతుంది. శత్రువర్గంతో చేతులు కలిపినా క్రమంగా అతనిలోని వర్గ స్పృహ అతన్ని పశ్చాత్తాపుడ్ని చేస్తుంది. తనలాగా కూలీలకు ద్రోహం చేసే పనులు మరెవ్వరూ చేయరాదంటూ సందేశమిచ్చి మరణిస్తాడు.

దేశంలో సగానికి పైగా దళితులు వ్యవసాయ కూలీలుగా ఉన్నారు. పాలేర్లుగా, జీతగాళ్లుగా తమ చెమటలో కోట్లాది రూపాయలు విలువైన ధాన్యరాశులు పండిస్తున్నారు. వారికి కనీస వేతనాలు లేవు. జీవన ప్రమాణాలు, పని పరిస్థితులు లేవు. మొదటి నుంచి దళితులకు భూమిపై అధికారం లేకపోవడం వల్ల స్వంత ఆస్తులు లేకపోవడం వల్ల ఆ కులాలు తరతరాలుగా దుర్భరమైన పరిస్థితులలో బ్రతకవలసి వస్తుంది. ప్రకృతి వనరుల మీద, ఉత్పత్తుల మీద వారికి అధికారం ఉంటే వారి పరిస్థితి ఇంత అధ్వానంగా ఉండేది కాదని బోయి భీమన్నకు తెలుసు. అందుకే ఆ అధికారం చేజిక్కించుకునేందుకు చదువుకున్న దళిత యువకుడు గ్రామాలకు తరలివెళ్లి వ్యవసాయ కూలి సంఘాలు స్థాపించి రాజకీయ అధికారాన్ని చేజిక్కించుకోవాలనేది కూడా భీమన్న స్వప్నం. అపుడే దళితుల సమస్యలకు పరిష్కారం లభిస్తుందని భావించారు. అందుకే -

"కూలీ రాజ్యము సర్వప్రజలకు

కూడు గుడ్డ లొసగునురా!"

అంటారు. నిరుపేదలకు రాజ్యాధికారం సిద్ధించడం వల్లనే తోటి నిరుపేదల స్థితిగతులను అర్థం చేసుకోగలరనే బోయి భీమన్న నమ్మకం వ్యక్తమవుతుంది.

"ధనిక భూస్వామికపు పాలనములోన
కష్టజీవికి న్యాయము కలుగబోదు
నేడు ప్రతివాడు వోటున్నవాడే రాజు
నిలిచి రాజ్యము నోటుతో గెలుచుకొండు
వోటు విలువను తెలుసుకొండన్నా
ప్రజలారా మీరు,
ఓటు రాజ్యము గెలుచుకొండన్నా"

అంటూ ప్రజాస్వామ్యయుత పార్లమెంటరీ ఎన్నికల ద్వారా పేదల రాజ్యం ఏర్పడుతుందని ఓటు కలిగిన ప్రతి దళిత వయోజనుడు కూడా గద్దెనెక్కి పరిపాలించుటకు అర్హుడేనని దళితులను రాజకీయంగా చైతన్యపరుస్తారు... ఇన్ని నాళ్ళు ధనిక స్వాములకు ఓట్లేసి వారిని గెలిపించడం వల్ల తమకు ఒరిగిన మేలేమిలేదనే సత్యాన్ని తెలియజేస్తారు. అంతేకాదు. దళితులను రాజకీయ పార్టీలు ఒక ఓటు బ్యాంకుగా మాత్రమే చూస్తున్నారు. తమ కులాల వారికి రాజకీయ సాధికారత మివ్వడం లేదు. రాజ్యాంగపరంగా సీట్లు కేటాయింపు రిజర్వేషన్‌లు ఎన్ని అమలు అయినా, అధికారం మాత్రం ఆధిపత్య కులాలచేతుల్లోనే ఉంటోంది. ఉన్నత పదవులు, ఉన్నత స్థానాలు, కొందరికి మాత్రమే లభించినా దళితుల అభ్యున్నతికి ఒరిగింది మాత్రం శూన్యం. ప్రభుత్వ పథకాలు ప్రత్యేక ప్యాకేజీలు ఎన్ని ఉన్న అవేవి దళితుల వెలివేతను తొలగించలేక పోతున్నాయి. అందరం ఒకటే అనే భావనను కలిగించ లేకపోతున్నాయి. అందుకే ఆనాడు గాంధీ, ప్రతి జిల్లాలోనూ, తాలూకాల్లోనూ కూడా అస్పృశ్యతను విడనాడేందుకు సహపంక్తి భోజనాలను ఒక కార్యక్రమంగా జరిపించారు. అలాంటి ఉద్యమాలలో గ్రామం అంతా కలిపి సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయడం ఒక వేడుకగా, ఉత్సవంగా కూడా చేసుకున్న ఈ విషయాన్ని "పడిపోతున్న అడ్డుగోడలు" నాటకంలో చిత్రీకరించారు.

"పదరా పదరా పల్లెలకు

పల్లెటూరె, భారత భాగ్యము!" అంటూ గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా పల్లెకు మరలండి" అనే ఈ ఉద్యమం ఎప్పటికీ ఫలిస్తుందో, పల్లెల్లో ఆధునిక విద్యా, వైద్య సౌకర్యాలన్నీ లభించేవరకు అది సాధ్యం కాదని కూడా బోయి భీమన్న భావిస్తారు.

"కూలిరాజు" నాటకంలో "కులాల్నీ మతాన్ని నిర్మూలించే ఉద్యమంలో చేరి ఏకైక భారతజాతిని నిర్మించడానికి పాటుపడండి. వీర్యవంతులై విజృంభించండి! కూలీ సంఘాన్ని గెలిపించండి. కార్మిక ప్రజలారా! ఓ వెనుకబడ్డ బాధితులారా! ఓ దరిద్రులారా! దేశానికి మనమే రాజులం" అంటూ వ్యవసాయ కూలీల రాజ్య నిర్మాణం కోసం వారిని ఉత్తేజితుల్ని చేస్తాడు. స్త్రీలు కూడా తమ ప్రాతినిథ్యాన్ని చేజిక్కించుకున్న వైనాన్ని సమర్థవంతంగా చిత్రీకరించాడు.

ఓటు గల ప్రతివ్యక్తి దేశానికి రాజే! హింస అక్కర్లేదు. సత్యాగ్రహాలక్కరలేదు. మనవారంతా ఒక్కత్రాటి మీద నిలబడి మన అభ్యర్థులకే ఓట్లేస్తే ప్రభుత్వం మన చేతిలోకి వస్తుంది. మనమే ప్రభువులం అవుతాం. మన ప్రణాళిక అమలు జరుపుతాం. కుల, మత, వర్గ విభేదాల్ని తీసి పారేస్తాం. సర్వ మానవ సమానత్వం స్థాపిస్తాం. నేటి మన సమస్య సాంఘికం కాదు. కుల మత సంబంధం అంతకంటే కాదు నేటి మన సమస్య ఆర్థికం. రాజకీయాధికారం చేజిక్కించు కోలేకపోతే ఆర్థిక సమానత్వం స్థాపించలేం. కనుక కూలీల యూనియన్‌నే గెలిపించండి. భూస్వాముల, ధనికుల స్వార్థపరుల దౌర్జన్యాలకు, వారు

# తపోవనం

- కె. నవీన్



ఇవాళ
ఇల్లొక తపోవనంలా
మాటలు రాని చిలకలా
సత్యభామ అలకలా
మౌనముద్రలో బుద్ధునిలా...
అందరూ వున్నా
ఎవరూ లేనట్టు
సముద్రంలో అలలున్నా
చడీ చప్పుడూ లేనట్టు
తోటలో చెట్లూగుతున్నా
శబ్దమే రానట్టు
వృక్షంపై పక్షులు వాలినా
కూయనే కూయనట్టు
ఇవాళ
ఇల్లొక తపోవనంలా
ఎవరికి వారు ఒంటరై
ఎడారిలో బాటసారులైనట్టు
ఎవరిలోకి వాళ్ళు మునిగిపోయి
ముడుచుకుపోయి తపస్సు చేస్తున్నట్టు-
అమ్మ సీరియళ్ళ సొరంగాల్లోంచి
బయటికి రాదు
నాన్న సంపాదనే లోకమై
సమయాభావ శోకమై
నిద్రలోకి జారుకునేపుడు ప్రత్యక్షమై
సంభాషణ శూన్యమై-
పిల్లలంతా
కార్టూన్ నెట్‌వర్క్ కొమ్మపై వాలి
లేదా హోంవర్క్‌ల పెనంపై కాలి
నిశ్శబ్ద కార్టూన్‌లైపోయి-
భార్య వంటింటి కారడవిలో-
గ్రైండర్లూ, కుక్కర్లతో రాగం కలుపుతూ
మంటలై మండిపోతూ....
మాటల్ని వెలిగిద్దామనుకుంటే
వంటలన్నీ మాడిపోతూ....
అందరూ
గోడల మధ్య నడుస్తున్న గోడలై
ఒకరికొకరు అంటరానివారలై
ఒకరిలోంచి మరొకరిలోకి
ప్రవాహాలు మాయమై-
కర్ఫ్యూ విధించబడిన
పాతబస్తీ వీధిలా
ఇవాళ
ఇల్లొక తపోవనం
మనుషులు యంత్రాల్తో కనెక్టై
మనుషుల్తో డిస్కనెక్టవటం నేటి విషాదం

---

చూపే ఎరలకు మీరు ఎంత మాత్రం లొంగి పోవద్దు. కేసులున్నాయని, వారంట్లున్నాయని నిరుత్సాహపడవద్దు. అవన్నీ స్వార్థపరులు కల్పించినవే తప్ప నిజమైనవి కావని ఉత్సాహంతో ఎన్నికలలో పాల్గొనండని, వ్యవసాయ కార్మిక సంఘాల ప్రతినిధులను గెలిపించమని, ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకోమని మన అన్ని అవస్థలూ తీరిపోగలవని మిత్ర, పరంజ్యోతి మొదలగు స్త్రీ పాత్రల ద్వారా ఎన్నికల ప్రచారం చేస్తారు.

*నేటి మన సమస్య సాంఘికం కాదు. కుల మత సంబంధం అంతకంటే కాదు నేటి మన సమస్య ఆర్థికం. రాజకీయాధికారం చేజిక్కించు కోలేకపోతే ఆర్థిక సమానత్వం స్థాపించలేం. కనుక కూలీల యూనియన్‌నే గెలిపించండి. భూస్వాముల, ధనికుల స్వార్థపరుల దౌర్జన్యాలకు, వారు చూపే ఎరలకు మీరు ఎంత మాత్రం లొంగిపోవద్దు. కేసులున్నాయని, వారంట్లున్నాయని నిరుత్సాహపడవద్దు.*

"ఎల్ల డబ్బును, ఎల్ల భూమిని
ఇంతకాలము అనుభవించుచు
పేదసాదల నణచి పెట్టిన
పెద్దలకు ఓట్లివ్వద్దిక"
మీలో మీరే నాయకులుగా
ఏలుకొండి కూలి రాజ్యము
మేలుకోండి పేదలారా!' అని ఉద్బోధిస్తారు.

గ్రామ స్వరాజ్యం కోసం నడుం బిగించమని ఉద్బోధించిన గాంధీజీ బోధనలు, భూదానోద్యమాన్ని ప్రతిపాదించిన వినోభావే సిద్ధాంతాల ప్రభావం భీమన్నపై ఉంది. ఎన్నికల రాజకీయాలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని పునాదిగా చేసుకుని దళిత ఉద్యమాన్ని నిర్మించవచ్చని ఈయన భావించారు. కాంగ్రెస్ సోషలిస్టు భావాలు, సర్వోదయ ఉద్యమ భావాలు "కూలిరాజు" నాటకంలో కనబడతాయి. గాంధీ అహింసా సిద్ధాంతం సమ సమాజాన్ని ప్రబోధించిన మార్క్స్ సామ్యవాదాన్ని కలగలిపిన సోషలిస్టు సిద్ధాంత భావజాల ప్రభావం బోయి భీమన్నపై ఉంది.

పినిశెట్టి శ్రీ రామమూర్తి "కులం లేని పిల్ల" మల్లాది సూర్యనారాయణ "పేదపిల్ల" బోయి భీమన్న "పడిపోతున్న అడ్డుగోడలు", "పాలేరు", "కూలిరాజు", "ప్రగతి" మొదలైన నాటకాలలో కులాంతర వివాహాలు జరిపించడం ద్వారా కులం సమస్యను నిర్మూలించవచ్చునని మొదటిరకం సాంఘిక నాటక కర్తలు భావించారు అందుకే ఈయన గాంధీజీ అహింసా సిద్ధాంతాన్ని వినోబావే సర్వోదయ సిద్ధాంతాన్ని, సమ సమాజాన్ని బోధించే సోషలిస్టు సిద్ధాంతాల సమాహార రూపంగా మనముందు సాక్షాత్కరింప జేస్తారు. 1940 ప్రాంతాలలో చాలామంది "కాంగ్రెస్ సోషలిస్టు" భావజాలం కలిగిన నాయకులున్నారు. వారి ప్రభావం బోయి భీమన్నపైన పడిందని అనుకోవచ్చు.

ఉన్నత వర్గాలు విద్యను తమ గుప్పిట్లో ఉంచుకుని నిమ్న వర్గాలకు అందనీయకుండా చేస్తున్నారని, "చెప్పులు కుట్టే కులంలోని తెలివైన పిల్లకు సరియైన పద్ధతిలో శిక్షణ ఇస్తే శంకరాచార్యునికి కూడా వెలుగులు చూపించగల మహాపండితులు కాగలరని" చెప్పిన పూలే అభిప్రాయాన్ని తన నాటకాలన్నింటిలో సమర్థించారు. రూపంలోగాని, చదువులోకానీ, సంస్కారంలోగాని ఉన్నత వర్గానికి చెందిన వారితో దళిత యువత ఏ మాత్రం తీసిపోదనే నిజాన్ని పాత్రీకరిస్తూ "పడిపోతున్న అడ్డుగోడలు", "కూలిరాజు", "అసూయ", "ప్రగతి", "పాలేరు" అనే నాటకాలలో రమాదేవి, ఆమె అన్న ప్రకాశం, పరంజ్యోతి, మధు, మిత్ర పాత్రలను తీర్చిదిద్దారు.

సర్వోదయ సమాజంలో అందరికీ స్వాతంత్ర్యం పరిపూర్ణ సమానత్వం ఉంటుంది. వర్గం, కులం, అన్యాయం, అక్రమాలు ఉండవు. ప్రతివారి వికాసానికి సమాన అవకాశం ఉంటుంది. అటువంటి సమాజానికి మానవుడు కేంద్రంగా ఉంటాడు. సమాజ వ్యవస్థీకరణలో స్వావలంబన ఉండదు. అటువంటి సమాజంలో జీవితం సమైక్యంగా ఉంటుంది. సర్వోదయ సమాజంలో ఎవరు అణగ ద్రొక్కకుండా ఉండే ఆదర్శ సమాజమే బోయి భీమన్న సామాజిక స్వప్నం.

# 'అవిశ్రాంతం'లో అంతరంగ దర్శనం




- ఇరువింటి వెంకటేశ్వరశర్మ

ఆస్వాదించ గలిగేవారికి కవిత్వం ఒక పులకరింత. సృజనాత్మక హృదయానికి కవిత్వం ఒక పలవరింత. స్పందన కలిగిన హృదయం ఎదురైన సంఘటనలకు చలిస్తూనే ఉంటుంది. జీవితంలో పొందిన అనుభవాలు, అనుభూతులు, సంఘర్షణలు, జ్ఞాపకాలై పలకరిస్తుంటే మదిలో మొలకెత్తిన భావాలకు ప్రాణంపోస్తూ, అక్షరాలను కవాతు చేయిస్తూ, దోసిళ్ళతో వెదజల్లుతూ, ఆడుకుంటూ కవిత్వాకృతి దాల్చిన రూపం అవిశ్రాంతంగా సాగిపోతుంది.

రాధేయ జీవితంతో పెనవేసుకున్న మూడు దశాబ్దాల సాహితీలతకు పూచిన మరో కవితాపుష్పం 'అవిశ్రాంతం' ఈ కవితా సంపుటిలో గల మూడు పదుల కవితలు భావ సంపదలో దేనికదేసాటి.

ఆధునిక కవితాక్షేత్రంలో వ్యాసకర్తగా, సమీక్షకులుగా, కథా రచయితగా ప్రతిష్ఠాత్మక ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు ప్రధాతగా సాహితీలోకానికి చిరుపరిచితులైన రాధేయ అసలు పేరు వి.యన్. సుబ్బన్న. వీరి పూర్తి పేరు ఉమ్మడిశెట్టి నారాయణ సుబ్బన్న. మరో ప్రపంచం కోసం, దివ్యదృష్టి, జ్వలనమ్, తుపాను ముందటి ప్రశాంతి, ఈ కన్నీటికి తడిలేదు. క్షతగాత్రం, మగ్గంబతుకు (దీర్ఘకవిత) ఇప్పటి వరకు వీరి కలం నుండి జాలువారిన వచన కవితా సంపుటులు, ఎనిమిదో కవితా సంపుటిగా 'అవిశ్రాంతం'

ఈ కవితా సంపుటి నిండా పరుచుకున్న శక్తివంతమైన భావ సంపద ద్వారా రాధేయ మనలను అవ్యక్త భావానికి గురిచేస్తారు. కవి, కవిత్వం, కవిత్వ ప్రయోజనాలను ఆధునిక దృష్టికోణంతో నిర్వచిస్తారు.

కవితా రహస్యం తెలిసిన అనుభూతితో రెప్పవాల్చని స్వప్నాలను దర్శిస్తూ కవిని నిర్వచిస్తారు.

'దుఃఖానికి కావ్యభాష తెలుసు/గాయపడిన హృదయాలెప్పుడూ / కవిత్వంతోనే సంభాషిస్తాయి. / సమస్త జీవన కాంక్షల్లో తనదైన / తాత్త్విక మూలాల్ని అన్వేషించేవాడేకవి' అని అంటారు.

కవిత్వమే జీవితమైన వాడు రాయాలి, రాస్తూనే ఉండాలి / సమిష్టి అనుభవాలను స్వానుభవాలుగా మార్చుకోవడమే కవిత్వం / కవిత్వం తోడు లేకుండా నేనులేను. అక్షరాలు వెంట రాకుంటే అడుగు ముందుకెయ్యలేను / అని అంటారు.

డబ్బును ప్రేమించే మనసుల మధ్య అన్వేషణ సాగించలేక మోయలేని దుఃఖభారంతో ముందుకు సాగుతారు.

'నేనీ మధ్యనే / మందహాసాన్ని జారవిడుచుకొని / ప్రశ్నార్థకాల్ని మోస్తున్నాను / ఆత్మశూన్య దేహంతో / అన్వేషణ సాగించ లేక' అని ఆవేదన చెందుతారు. ప్రేమాభిమానాలు, మానవత్వం, స్వప్నాలుగానే దర్శిస్తూ

'ప్రేమాభిమానాలకు / డాలర్ మైకం కమ్మేసింది / దయారహిత ప్రపంచం /డాట్ కామ్‌లో స్థిరపడింది' అని అంటారు.

దుఃఖాన్ని జయించిన కవి ఎవడైనా ఉంటే చెప్పండి అతని చరిత్రను గానం చేస్తానంటారు, పాదాలను స్పృశించి పరవశించి పోతానంటారు. గాయపడిన కవి హృదయాన్ని ఒరుసుకుంటూ జ్ఞాపకాలు ప్రవహిస్తాయని దుఃఖం లోంచే కవిత్వం పుడుతుంది' అని అంటారు.

రానున్న కాలమంతా ప్రశ్నించే తరానిదేనంటూ దిగుడు బావి మెట్ల మీద దోసిళ్ళతో దుఃఖాన్ని తాగుతున్న మనిషికి, కవిత్వం ధిక్కారస్వరమై తోడుగా నిలవాలంటూ.

అరెయార్ / కవిత్వమంటే గోడకు దిగ్గొట్టిన మేకు కాదు/ భుజానికి వేలాడే తుపాకి / కత్తి అంచును సానబెట్టాలంటే / సాన రాయి మీద కానీ / కనుగుడ్డు మీద కాదురా! అని ధైర్యాన్ని నూరిపోస్తూ సాయుధుడువై లెమ్మంటాడు, ఆయుధాన్ని కోల్పోవడమంటే చెయ్యి పిడికిలిని కోల్పోవడమేనంటారు.

అక్షరాలన్నీ నీ దోసిట్లో పోస్తాను/ వాక్యాల పడవలు నిర్మించుకో, రాగాలన్నీ ఏరి నీ జేబు నింపుతాను/బతుకు నేపథ్యాలన్నీ వొడి నింపుకో అంటూ సాగుతుంది వీరి కవితా ధార.

ఈ కవి ఒలికించిన ప్రతి వాక్యం కవితాత్మకమే, ప్రతి కవితా గాయాలను ఒరుసుకుంటూ ప్రవహించిన జ్ఞాపకాల సమాహారమే.

ముదిగొండలో చిందిన రక్తానికి 'నేరమెవరిదని' అమాయకంగా ప్రశ్నిస్తూ రాజ్యహింసను హెచ్చరిస్తూ,

ఇంతకీ నేరమెవరిది మా రాజా? / తలదాచుకోను గూడడిగిన పాపానికి / గుండెల్లో దిగిన బుల్లెట్లదా? / రిక్తహస్తాలతో

నినదించిన కోపానికి / రక్తవసంతమాడిన రాజ్యహింసదా? అని ప్రశ్నిస్తూ పేదల పక్షాన నిలుస్తారు.

మీ దేహాల్ని పాతిపెట్టుకోడానికి /ఎకరాలు కేటాయించు కోండి / మాకభ్యంతరం లేదు / మేం ముడుచు కోడానికి / ముప్పై అడుగుల జాగా ఇవ్వండి చాలు - అని అర్థించే చేతులే దగాపడినప్పుడు కత్తులు నూరతాయని హెచ్చరిస్తారు.

డాలర్లవేటలో తల్లిదండ్రులను మరచి పాశ్చాత్య విఫణి వీధిలో జీవితాలను తాకట్టుపెట్టుకొనే కొడుకులు దూరమవుతున్నా దయాగుణంలో ధరిత్రివి నీవనీ మాతృమూర్తిని అభివర్ణిస్తారు.

చరిత్రహీనుడు వాడు/ నీ క్షమకు అర్హుడు కాడు/ పాలు తాగే రొమ్ము మీద పాదం మోపే చరిత్ర వాడిది / వాడి కలల సౌధం వాడి కళ్ళ ముందే బీటలు వారుతుందని ఓదారుస్తారు.

చితికిన బతుకుల నేపథ్యంలో బాల్యం ఎలా వీధిన పడుతుందో వివరిస్తారు. బాల్యం కోసం చేపట్టే కంటి తుడుపు చర్యలను నిరసిస్తారు.

'బాల్యం ఏ రాజకీయానికి పట్టదు / ఆ కళ్ళ లోగిళ్ళ లోనికి / ఏ అధికారము తొంగి చూడదు/ నీవు కోల్పోయిన బాల్యం/ ఈ దేశం చెల్లించలేని మూల్యం' అని అపురూపమైన బాల్యం తాలుకు అనుభవాలను పిల్లలు ఎలా కోల్పోతున్నారో వివరిస్తూ ఏ పథకాల మెతుకులు నీ అరచేతుల్లోకి అన్నం ముద్దను చేర్చదని అంటారు.

సామ్రాజ్యవాదం, మతోన్మాదం, ఉగ్రవాదం 'పోటెత్తిన గాయాలై మనిషిని ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే అక్షర సైన్యమై తన కవిత్వాన్ని కవాతు చేయిస్తానంటారు.

జీవితం శకలాలు శకలాలుగా / విడిపోతున్నప్పుడు / గాయాలన్ని బహిరంగ ప్రదర్శనలేనంటు సామ్రాజ్యవాదాన్ని ధిక్కరించి / ఉరికొయ్యకు ఉయ్యాలలూగిన సద్దాంను, పైశాచిక శక్తుల పాశవిక దాడిలో బేనజీర్ బలిదానం మరువలేనంటారు.

తస్లీమాపై మతోన్మాదుల దాడిని, గోకుల్‌చాట్, లుంబినీ పార్కుల విధ్వంస విస్ఫోటనాలను నిశితంగా విమర్శించారు. ఇతిహాసపు చీకటి కోణాలన్నీ రక్తసిక్త అనుభవాలేకదా' అని వాస్తవిక విధ్వంసకర చరిత్రను కళ్ళముందుంచుతారు.

తనువంతా ఆవరించిన ఒకానొక 'సౌందర్య రాహిత్యం'లో పల్లెతనాన్ని నెమరు వేసుకుంటారు. సొంత రక్తంలో ప్రవహిస్తున్న పరాయితనాన్ని జాలిగా చూసుకుంటారు. బాల్యంలో పల్లె జీవితంలో అనుభవాలు, జ్ఞాపకాలు, స్వప్నాలై కరిగిపోతుంటే నిశ్చేష్టులై మౌన ముద్ర దాలుస్తారు.

నగరం నాగరికతలోకి దొర్లిపోయాక / నా ఊరే నాకు పరాయిదైపోయిందా? / నేను నా ఊరికే పరదేశినయ్యానా? అని ప్రశ్నించుకుని, నేనిప్పుడు ఆత్మను కోల్పోయిన సౌందర్యవాది నంటారు.

అనాదిగా లింగ వివక్షకు గురవుతూ జీవితమంతా నిండిన దుఃఖంతో బతుకును కొనసాగిస్తున్న వర్తమాన మహిళను వెన్నుతట్టి ఆత్మ విశ్వాసాన్ని మెల్కొలుపుతారు.

"ఓ సజలనేత్రి / అణగారిన దీన స్వరంతో / పితృస్వామ్యం సాక్షిగా / దుఃఖాన్ని మోస్తూ నడుస్తోంది / ద్వంద్వనీతి ప్రమాణాల మధ్య / నువ్వు ముందు వరుసలో నిలబడినా / చివరి వ్యక్తివే సుమా !" అంటూ ప్రశ్నించే స్వరం నీది కావాలి అంటారు.

'నువ్వు ప్రబంధ నాయికవి కాదు / వర్తమాన 'మహిళ'గా / నిన్ను నీవు నిరూపించుకో' మంటారు.

ప్రపంచీకరణ విన్యాసంలో జారిపోతున్న బంధాలు, విడిపోతున్న స్నేహాలు, ప్రేమాభిమానాలు అంగడి సరుకైపోతున్న వేళ కల్సి నడవలేనని స్నేహపత్రంపై 'చివరి సంతకం' చేస్తానంటారు.

జీవితానికి వేగం ముఖ్యమో / గమ్యం ముఖ్యమో తెలియని సందిగ్ధంలో / మనిషితనం కోల్పోయి / నువ్వు మార్కెట్ వెంట పరుగులు తీస్తున్నావు / క్షమించు / నీతో కరచాలనం చేయలేను / కల్సినడవలేనని ఆవేదన వ్యక్తం చేస్తారు / కాలం చిటికెన వేలు పట్టుకొని అడుగులేసిన కవితాకన్య ఈ కవి అమలిన హృదయంలోకి తొంగి చూసినప్పుడు ఆ గిలిగింతలకు కరిగిపోయి 'కవిత్వానికి ప్రేమలేఖ' రాస్తారు.

'పాతికేళ్ళప్రాయంలో / ప్రపంచమంతా నా ముందు / దోసిలి పట్టినిలిచేది / యాభై దాటిన ఈ వయసులో / ప్రకృతి సమస్తం / ఆకులు రాలిన రుతువై / దీనంగా చూస్తుంది ! అంటూ యెడబాటు దీర్ఘమైతేప్రేమ కుదించుకుపోదు, ప్రేమించడమంటే స్వర్గంలోకి ప్రయాణించడమేనంటారు.

అన్నపూర్ణగా కీర్తించబడ్డ ఆంధ్రదేశంలో పంటలన్నీ కనుమరుగై పోతున్నా 'చావుపంట మాత్రం విరగకాస్తోంది' అంటూ చమత్కరిస్తారు. నేతన్నల ఆత్మహత్యలు, రైతన్నల ఆకలి చావులకు కారణాలను ఉటంకిస్తూ పరిష్కారాలను సూచిస్తారు.

సిరిసిల్ల శివయ్య చీరాల బసవయ్య ఊళ్ళు వేరైనా / పేర్లు ఎవరివైనా అన్నీ ఆకలి హత్యలే / వల్ల కాటి శవాలే / నంటూ అఖిలపక్ష సభ్యులకు, అధ్యయన బృందాలకు కన్నీటి విన్నపం చేస్తారు.

'కంటి తుడుపు చర్యలు మాకొద్దు / శాశ్వత ప్రాతిపదిక/ బతుక్కి భద్రత కల్పించకపోతే / భవిష్యత్తుకు భరోసా ఇవ్వకపోతే/ ప్యాకేజీ స్కీంలు, ఆరోగ్యశ్రీలూ / అన్నీ మాకు వాయిదా మరణాలేనంటు' ఆవేదన వ్యక్తం చేస్తారు.

పుట్టిన గడ్డపై మమకారంతో అనంతపురం జిల్లా 'అనంత దుఃఖాన్ని' మనకళ్ళ ముందు ఆవిష్కరిస్తారు.

'ఆకలి అనేది అనంతమైతే / అనంత జిల్లా ఆకలి స్వరమే పలుకుతుంది/ కరువు అనేది ప్రాంతీయమైతే / అది మా రాయల సీమనే వరిస్తుంది'.

నదులెన్ని ప్రవహిస్తున్నా దాహం తీరని దుఃఖజలమే / భూగర్భ జలాలన్ని మాకు ఆగర్భశత్రువులేనంటారు.

'అనంత జిల్లా పేదరికానికి పెద్ద బాలశిక్ష / ఫ్యాక్షన్ రాజకీయాలకు ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ / ప్రైవేటు సైన్యాలకు ప్రాంతీయ కేంద్రంగా' అభివర్ణించారు.

పూలకు పరిమళం ఎంత సహజమో వీరికి కవిత్వం అంత సహజం. రాయకుండా ఉండలేని స్థితినుండి రాయక తప్పదని పించే స్థితికి 'అనివార్యం'గా ప్రయాణిస్తూ గుండెలో గూడు కట్టుకున్న సమస్త భావాలనూ కవిత్వీకరిస్తూ సాగిపోతున్న అవిశ్రాంత స్వాప్నికుని అంతరంగాన్ని ఈ పుస్తకంలో దర్శిస్తాం, ఆస్వాదిస్తాం.

•

# పశ్చిమాసియాలో ప్రజాస్వామ్య కుసుమాలు

## సబ్‌ప్రైమ్ సంక్షోభంతో తలకిందులైన ఆర్థిక వ్యవస్థలు

- కొండూరి వీరయ్య



ఈజిప్టులో ముబారక్‌ను తరిమికొట్టిన ఆందోళన

కొత్త సంవత్సరం పశ్చిమాసియా దేశాల్లో ప్రజలకు కొత్త ఆశలు కలిగించింది. సంవత్సరారంభంలో మొదలైన ప్రజాస్వామిక ఉద్యమాలు నేడు దేశాధినేతల తలరాతలు మార్చే శక్తులుగా ఆవిర్భవించాయి. ప్రపంచీకరణ వ్యతిరేక ఉద్యమాలు ప్రపంచవ్యాప్తంగా ప్రజ్వరిల్లుతున్నా, పర్యావరణ పరిరక్షణోద్యమాలతో కొత్త గాలులు వీస్తున్నా, వివిధ దేశాల్లో రాజకీయ సామాజిక ఆర్థిక సమస్యలపై ఉద్యమాలు ఉవ్వెత్తున ఎగసిపడుతున్నా పశ్చిమాసియా ప్రజానీకం మాత్రం నిస్తేజంగా చూస్తుండటం విస్మయపర్చే అంశమే. చమురు బావి నుండి చమురు ఉవ్వెత్తున ఉబికి వచ్చినట్లు పశ్చిమాసియా ప్రజానీకం అటువంటి నిస్తేజం నుండి, నిద్రాణావస్థ నుండి ఒక్కసారిగా మేల్కొంది. దాదాపు నాలుగు దశాబ్దాల పాటు ఆధునిక రాచరికం తరహా పాలనలో మగ్గిన ప్రజలు నేడు జూలు విదుల్చుతున్నారు. తమకు ప్రజాస్వామ్యం కావాలని నినదిస్తున్నారు. రాజకీయాల్లో వారం రోజుల వ్యవధి చాలా ఎక్కువ అన్న నానుడి ఉంది. ఈ నానుడిని నిజం చేస్తున్నాయి. పశ్చిమాసియా దేశాల పరిణామాలు, పశ్చిమాసియా దేశాల్లో తొత్తు ప్రభుత్వాలను గద్దెనెక్కించి వాటిని కాపాడటానికి అవసరమైన వ్యవస్థలు, సంస్థలను ఏర్పాటు చేయడంలో దిట్ట అయిన అమెరికా సైతం తాజా పరిణామాలను అంచనా వేయలేకపోయింది. ప్రపంచ దేశాల్లో చీమ చిటుక్కుమన్నా పట్టేసే సెంట్రల్ ఇంటెలిజెన్స్ ఏజెన్సీ ఏకంగా దేశ దేశాలే తిరుగుబాటుకు దిగుతుంటే గుర్తించలేకపోయింది. ఈ తిరుగుబాటుకు కారణాలు, లక్ష్యాలను అంచనా వేయలేకపోతుంది. ఇక తాజాగా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ ఎదుర్కొంటున్న సంక్షోభానికి తాజా రాజకీయ పెను ఉద్యమాలకు మధ్య సంబంధాన్ని గుర్తించడంలో పాలక వర్గాల వైఫల్యం గురించి చెప్పుకోనవసరం లేదు. ఈ వ్యాసంలో తాజా ప్రపంచ సంక్షోభానికి, పశ్చిమాసియాలో దేశాధినేతల తలరాతలు మారుస్తున్న ఉద్యమాలకు మధ్య ఉన్న సంబంధాన్ని పరిశీలిద్దాం. గత నాలుగు దశాబ్దాలుగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు అవసరమైన వనరులు, ప్రత్యేకించి ఇంధన వనరులు సరఫరా చేసింది పశ్చిమాసియా, సంపన్న దేశాల ఆర్థిక వ్యవస్థల పునఃనిర్మాణానికి అవసరమైన సరఫరాలు గ్యారంటీ చేసుకునేందుకు అమెరికా నాయకత్వంలో సామ్రాజ్యవాద దేశాలు ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేశాయి. నాలుగు దశాబ్దాల పాటు ఎన్నికలు జరుగుతున్నా ఒకే రాచరిక కుటుంబాలు వరుసగా ఎన్నికవుతున్నాయంటే ఈ ప్రజాస్వామ్యంలో ప్రజల భాగస్వామ్యం ఏమాత్రం ఉందో అర్థం చేసుకోవచ్చు. ఈ నాలుగు దశాబ్దాల పాటు పశ్చిమాసియా దేశాలు క్రమం తప్పకుండా అమెరికాకు మంచి మిత్రులుగా వ్యవహరించాయి. ప్రపంచీకృత ఆర్థిక వ్యవస్థకు అవసరమైన ఇంధన రంగంలో ప్రభుత్వ నియంత్రణలు పాటిస్తూనే మరోవైపున సామాజిక రంగాల్లో ప్రైవేటీకరణ విధానాలు విచ్చలవిడిగా అమలు చేశాయి ప్రభుత్వాలు. వివిధ దేశాల్లో నిరుద్యోగం ఊహించనంత స్థాయికి చేరింది. ప్రజలకు తమ ఆగ్రహావేశాలు వ్యక్తం చేయడానికి అవసరమైన ప్రజాతంత్ర సాధనాలు, మార్గాలు పరిమితంగా ఉండటం, పాలకవర్గాలకు సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష అండదండలు ఉండటంతో ప్రజలు గత్యంతరం లేక నిమిత్తమాత్రులయ్యారు. ప్రజల నుండి తమ విధానాలు, వాటి పర్యవసానంగా జరుగుతున్న సంపద కేంద్రీకరణ క్రమాలకు విఘాతం కలగకుండా ఉండటానికి ప్రపంచీకరణ విధానాలు అనుమతించిన మేరకు సంక్షేమ చర్యలు అమలు జరిగాయి. పశ్చిమాసియాలో సంక్షేమ చర్యలు ప్రధానంగా నీటి సరఫరా రంగానికి, ఆహారోత్పత్తుల రంగానికి పరిమితం అయ్యాయి. ఈ దేశాల ప్రత్యేక భౌగోళిక పరిస్థితుల రీత్యా ఆహారోత్పత్తులు పరిమితం. దాంతో ఆయా దేశాలు తమ దేశీయ ఆహార అవసరాలు తీర్చుకోవడానికి సైతం విదేశీ దిగుమతులపై ఆధారపడాల్సి వచ్చేది. 1950, 1960 దశకాల్లో ఈజిప్టు వంటి దేశాలు అప్పట్లో భారతదేశం తరహాలోనే దిగుమతులకు ప్రత్యామ్నాయ ఆర్థిక విధానాలు అవలంభించినా 70 దశకం వచ్చేసరికి పరిస్థితులు మారిపోయాయి. యాంకిప్పుర్ యుద్ధం తర్వాత ఈ ప్రాంతంలో ప్రజాతంత్ర ఉద్యమాలకు తలమానికంగా ఉన్న ఈజిప్టు క్రమంగా సామ్రాజ్యవాద శిబిరంలో జూనియర్ భాగస్వామిగా మారింది. దాంతో ఈ దేశం అనుసరించిన ఆర్థిక విధానాల రూపురేఖలే మారిపోయాయి.

# ఒక చావు - మరో అసహనం

- పి.శ్రీనివాస్‌గౌడ్



ఒక్కసారిగా ఏమీ శూన్యమనిపించదు
ఏదీ తెగిపోయినట్టనిపించదు
లోపల ఏ కన్నీటి కణమూ చెమ్మగిల్లదు
క్షణాలు గుదిబండలై దొర్లవు.
దినచర్య లేశమంత దిశ మారదు.
బరువనిపించే జ్ఞాపకాలేవీ బాధించవు
సమాధానాలాశించే ప్రశ్నలేవీ ఎదురవవు
'ఈ ఖాళీ పూడ్చేదెలా' అనే ఊహాఛత్రం
విచ్చను కూడా విచ్చదు
బహుశా
భౌతిక కాయం చుట్టూ
కాసిన్ని సింథటిక్ సెంటిమెంట్ల సంభాషణలు..
పొడిబారిన ప్లాస్టిక్ కన్నీళ్ళు..
నిమిషాల నిప్పుకణికెల మీద నిలబడిన
అసహనపు నిట్టూర్పులు..
చాటుమాటుగా రక్తనిష్ఠగా
వచ్చేపోయే 'లెక్క'ల తూకాలు–
ఇంకా
మహా అయితే–
ఖననంతో ఆవిరయ్యే కొద్దీ
బలహీనమయ్యే అతని పాదముద్రలు
ఇంకా అనేకానేక చావుల తర్వాత
మన జ్ఞానేంద్రియాలకు
అతని పార్థివ దేహం
ఒక లాంఛనప్రాయం మాత్రమే.

---

పశ్చిమాసియా దేశాల్లో సమృద్ధిగా లభించే ఏకైక ముడిసరుకు చమురు. చమురు లేనిదే ప్రపంచ ఆర్థిక వ్యవస్థ లేదు. దాంతో ఒకప్పుడు సార్వభౌమత్వ దేశాల అధీనంలో వున్న ఈ చమురు వనరులపై హక్కులు, అధికారాలు నేడు ప్రపంచీకరణకు చోదకశక్తులుగా ఉన్న అంతర్జాతీయ సంపన్నవర్గాల చేతుల్లోకి మారిపోయాయి. తొలుత ఈ మార్పు వల్ల పశ్చిమాసియా దేశాలకు ఆదాయ వనరులు పెరిగాయి. దాంతో మారిన ఆర్థిక విధానం వల్ల దేశంపై పడుతున్న అదనపు భారాలను తట్టుకుని నిలవగలిగాయి. కాలక్రమంలో అంతర్జాతీయ సంపన్న వర్గంలో భాగస్వాములుగా మారిన ఈ దేశాల పాలక వర్గాలు దేశ అవసరాలను ఎడారుల్లో వదిలిపెట్టాయి. దానికితోడు ఆ దేశాల ఆర్థిక వ్యవస్థలు ప్రపంచ ఆర్థిక వ్యవస్థలతో మమేకం కావడంతో ప్రపంచ ఆర్థిక వ్యవస్థల్లో వచ్చే మార్పులకు ఈ దేశాల ఆర్థిక వ్యవస్థలు అతలాకుతలం అవుతున్నాయి. 1997 ఆసియా దేశాల ఆర్థిక సంక్షోభం తర్వాత పశ్చిమాసియా, ఆఫ్రికా దేశాలు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు ఆకర్షించే కేంద్రాలుగా మారాయి. దాంతో పాటే సార్వభౌమ నిధులు, ఇతర ద్రవ్య సంకర రూపాలు తెరమీదకు వచ్చాయి. మార్కెట్‌లో స్పెక్యులేషన్ పెరిగిపోయింది.

తాజాగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సంక్షోభం, తదనంతరం నేడు దేశాలు ఎదుర్కొంటున్న ఆహార సంక్షోభంతో ప్రజలపై ఎనలేని భారాలు పడ్డాయి. ఆర్థిక సంక్షోభం కారణంగా ఈజిప్టు, ఇతర పశ్చిమాసియా దేశాలకు వచ్చే విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు తగ్గిపోయాయి. సంక్షోభం నేపథ్యంలో చమురు ఉత్పత్తుల విలువ పతనం కావడంతో ఆయా దేశాలకు వచ్చే ఆదాయం కూడా పతనం అయ్యింది. అదే సమయంలో సంక్షోభం సైడ్ ఎఫెక్ట్‌గా దాదాపు మూడేళ్ళపాటు ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో గిరాకీ పడిపోయింది. తదనుగుణంగా ఉత్పాదకరంగం మందగించింది. ఉత్పాదక రంగానికి కీలకమైన ముడిసరుకులు సరఫరా చేసే ఆ దేశాల ఉత్పత్తులకు కూడా డిమాండ్ తగ్గింది. దాంతో పశ్చిమాసియా దేశాల ఆర్థిక వ్యవస్థలు అన్ని వైపుల నుండి చక్రబంధనంలో చిక్కుకుపోయాయి. ఒక్క ఈజిప్టులోనే సంక్షోభం కారణంగా స్థూల జాతీయోత్పత్తి 7 శాతం పతనం అయింది. ఆహారోత్పత్తుల ధరలు, ఇంధనం సబ్సిడీల భారం పెరిగిపోయాయి. పశ్చిమాసియాలో మిగిలిన దేశాలు సైతం సగానికి పైగా ఆహారోత్పత్తులు విదేశాల నుండి దిగుమతి చేసుకునేవే. ప్రతికూల పర్యావరణ పరిస్థితులు, స్పెక్యులేటివ్ వ్యాపారం ద్వారా పెరుగుతున్న ఆహారోత్పత్తుల ధరలు ఈ ఆర్థిక వ్యవస్థలపై భారంగా మారాయి. ఉదాహరణకు అల్జీరియాలో ఆహార వస్తువుల ధరలు గత సంవత్సర కాలంలో 30 శాతం పెరిగాయి. ఈజిప్టు ఆహార దిగుమతులకు అదనంగా 30 బిలియన్ డాలర్లు వెచ్చించాల్సి వచ్చింది. ఇదే సమయంలో ప్రపంచీకరణ వల్ల ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలు ద్వితీయశ్రేణి ఆర్థిక వ్యవస్థలుగా మారాయి. దానికితోడు పశ్చిమాసియా దేశాల్లో జనాభా పెరుగుదల 2.3 శాతంగా ఉంది. దాంతో ప్రైవేటీకరణ, జనాభా రేటు పెరుగుదల ఫలితంగా పెద్ద ఎత్తున ఉపాధి అవకాశాలు కల్పించాల్సిన పరిస్థితి వచ్చింది. ప్రపంచ బ్యాంకు అంచనా మేరకే 2035 నాటికి పశ్చిమాసియా దేశాలు 51 మిలియన్ల అదనపు ఉపాధి అవకాశాలు కల్పించాల్సి వుంది.

గత నాలుగు దశాబ్దాల్లో హరిత విప్లవం ద్వారా వ్యవసాయ రంగంలో యాంత్రిక శక్తి వినియోగం పెరిగింది. దాంతో పెట్టుబడులు పెరిగాయి. చమురు వినియోగం పెరిగింది. నేడు చమురు ధరల్లో వచ్చే గాలివాటు మార్పులు వల్ల పశ్చిమాసియా దేశాల్లో వ్యవసాయం పూర్తిగా నష్టదాయకంగా మారింది. దాంతో ఆహారోత్పత్తుల కొరత మరింత పెరిగింది. హరిత విప్లవం ఫలాలు తగ్గుముఖం పట్టనారంభించాయి. పర్యావరణంలో వచ్చే మార్పులతో తాగునీటి సమస్య ఈ దేశాల్లో కీలకమైన సమస్యగా అవతరించింది. ఉదాహరణకు పశ్చిమాసియాలో ఉండే మృతసముద్రంలో నీటిమట్టం బాగా పడిపోయింది. పర్యావరణంలో వచ్చిన మార్పుల వల్ల ఈ ప్రాంతంలో సగటు వర్షపాతం 20 శాతం తగ్గిపోయింది. ఈ పర్యవసానాలన్నీ వెరసి పశ్చిమాసియా దేశాల్లో జీవన పరిస్థితులు సామాజిక సంక్షోభం దిశగా మారుతున్నాయి. నేడు ఆయా దేశాల్లో ఉవ్వెత్తున ఎగసిపడుతున్న ఉద్యమాలు నిర్దిష్ట రూపం తీసుకుంటున్న సామాజిక సంక్షోభానికి వ్యక్తీకరణలే. •

# కొత్త పుస్తకాలు




**వ్యాస గుచ్ఛం**

**- అంబల్ల జనార్దన్**

**వెల : 80- పేజీలు : 85**

**ప్రతులకు : 09987533225**

అంబల్లగారి రచనల్లో అపారమైన జీవితముంది. అనంతమైన సంఘర్షణ ఉంది. అది, ఇతరుల నుండి తెలుసుకున్నదే గాదు, ప్రత్యక్షంగా అనుభవించింది. ఎన్నో మలుపుల్లో తాను ప్రత్యక్ష పాత్రధారి. అందుకే ఏది రాసినా అంతటి ఆర్ద్రత. ఎగుడు దిగుడు జీవితాల్లో ఉండే సమస్యల్లాగే అంబల్ల అక్షరాలు గరుకుగానూ, కఠినంగానూ కనిపిస్తాయి, వినిపిస్తాయి. అంబల్ల రచనలు, ఒక జాతి 100 సం॥లు పైగా మరఠ్వాడా ప్రాంతంలో జీవిస్తూ అది పొందిన సంఘర్షణను, అనుభవించిన జయాపజయాలకు చెందిన గొప్ప సామాజిక చిత్రం.

**- డా॥ పిల్లలమర్రి రాములు**




**యల్. రాన్ హబ్బర్డ్**

**సంతోష మార్గం**

**- వాసిరెడ్డి భాస్కరరావు**

**వెల : రూ. 50/- పేజీలు : 90**

**ప్రతులకు : 09390101251**

ఈ పుస్తకంలోని నీతి నియమావళి కొత్తదేమీ కాదు. అనేక పౌరాణిక గ్రంథాలలో, నీతి శతకాలలో చెప్పబడినవే. కాని అవి యిప్పుడు ఉపయోగంలో లేవు. పాఠశాలలో వాటిని గురించి చదువు చెప్పడం లేదు. ఈనాటి యువతకు ఆయా విషయాలు తెలియదు. కనుక మరొకసారి చెబితే బాగుంటుందని భావించాను. హబ్బర్డ్ పుస్తకాలు చదవగానే చాలా ఆకర్షణీయంగా వుంటాయి. కొన్నిటిని సారాంశ రూపంలోనైనా తెలుగు పాఠకులకు పరిచయం చేయాలనుకున్న ఫలితమే ఈ పుస్తకం.

**- వాసిరెడ్డి భాస్కరరావు**




**విహంగాలు**

**(రెక్కలు)**

**- గొడ్డంటి రంగారావు**

**వెల : రూ. 30/- పేజీలు : 44**

**ప్రతులకు : 9392517348**

జీవితమంతా ఎన్నో అనుభవాలు పొందుతూ, పరిణితులైన వారికి లోకానికి సందేశమివ్వాలనే సదుద్దేశము, తాను అర్థం చేసుకున్న 'తాత్వికత'ను తర్వాతి తరాల వారికి అందించాలనే సదభిప్రాయము ఉండటం అత్యంత సహజమైన విషయం. అదే ఆకర్షణ రంగారావుగారి 'రెక్కలు'లో కూడా ఉంది.

**- డా॥ అద్దేపల్లి రామమోహనరావు**




**ఆమె (నవల)**

**- డాక్టర్ పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి**

**వెల : రూ. 100/- పేజీలు : 268**

**ప్రతులకు : 9440279594**

మనం సృష్టించిన సాహితీ ప్రక్రియలు కొన్నింటికి... ఆలోచిస్తే కానీ 'ఇదీ వస్తువు' అని సృష్టికారుడికే, ఆ ప్రక్రియను పూర్తి చేసేదాకా అర్థం కాదు. కొన్ని వస్తువులు ఇది నా కోసమే రాయబడింది అని స్పష్టంగా చెప్తాయి. అలాంటిదే ఈ నవల 'ఆమె'.

**- జయప్రద**




**చైతన్య వసంతం (కవితా సంపుటి)**

**- సిరిసిల్లా గఫూర్ శిక్షక్**

**వెల : రూ. 40/- పేజీలు : 95**

**ప్రతులకు : 9849062038**

సంఘ వ్యతిరేక శక్తులన్నింటికీ ఇది చురకపెట్టే హెచ్చరిక. "నిజమా" అనే శీర్షికతో ఇతడు రచించిన కవితలో ఈ పంక్తులు సముజ్వల చైతన్య ప్రబోధానికి మచ్చు తునకలుగా ఉన్నాయి.

"ఉజ్వలించే దీప్తి కిరీటమా
ఉషోదయ కాంతి పుంజమా
బల్లెం కాని బలం నీవు
జవం జీవం నిజం ఒకటేనని
నీ వునికిని చాటుకో

ఇలాంటి ఉదాహరణ యోగ్య పంక్తులెన్నో ఈ సంపుటినిండా ఉన్నాయి.

**- డా॥ సి. నారాయణరెడ్డి**




**మనోదర్పణం**

**- శారదా హన్మాండ్లు**

**వెల : రూ. 50/- పేజీలు : 77**

**ప్రతులకు : 9912275801**

శారద వృత్తిరీత్యా ఉపాధ్యాయురాలు. ప్రవృత్తిరీత్యా కవయిత్రి. మహబూబ్‌నగర్ జిల్లాలోని పాలమూరులాంటిదే మా జిల్లాలోని బిచ్కుంద. నిజం చెప్పాలంటే పాలమూరు కన్నా ఇంకా వెనుకబడిన ప్రాంతం. అక్కడి ప్రజల మనోభావాలు నాగరికులకు నచ్చకపోవచ్చు. శారద ఆ ప్రాంతవాసి కావడం వృత్తి, ప్రవృత్తి అక్కడి నుంచే మొదలవ్వడం వల్ల అక్కడి ప్రజల మనోభావాల్ని కవిత్వం చేయగలిగింది.

**- నాళేశ్వరం శంకరం**

# కొత్త పుస్తకాలు




**ఆంధ్రప్రదేశ్ దళితులు**

**- కలేకూరి ప్రసాద్**

**వెల : రూ.35/-  పేజీలు : 96**

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

కలేకూరి ప్రసాద్ రచించిన ఈ పుస్తకం కుల సమస్య ఏనాడో పరిష్కార మైందని దాని గురించి మాట్లాడట మెందుకని ప్రశ్నించే వారికి కనువిప్పు కలిగించుతుంది. దళితుల దుర్భర జీవన దృశ్యాన్ని మన కళ్ళ ముందు ఆవిష్కరిస్తుంది. దీనిలో వున్నవి కేవలం సిద్ధాంత వాదనలు లేదా తాత్విక చింతనలే కాదు. కఠోర జీవన సత్యాలు. గ్రామాలు, పట్టణాలలో ఇప్పటికీ విలయనృత్యం చేస్తున్న కులరక్కసి జాడలను దీంట్లో మీరు చూడగలరు.

**- పాటూరు రామయ్య**




అమెరికా అవతరణ కోసం మూలవాసుల నిర్మూలన

**నరహంతలు ధరాధిపతులై....**

**- డీ బ్రౌన్**

**వెల : రూ.150/-  పేజీలు : 310**

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

క్రిస్టఫర్ కొలంబస్ అమెరికన్ గడ్డమీద కాలు మోపడంతో ప్రారంభమవుతుంది కథ. ఆ తర్వాత నాలుగు శతాబ్దాలు (1492 - 1890) అనేక కోట్ల మంది యూరోపియన్లు ఈ భూతల స్వర్గానికి వచ్చి స్థానిక ఆదివాసీల మనుగడకే ముప్పు తీసుకొచ్చారు. అయితే ఈ ఊచకోత గురించి లోకానికి విస్తృతంగా తెలిసింది మాత్రం 1860-90 మధ్యే. అనూహ్యమైన హింస, దోపిడీ అమెరికన్ ప్రకృతి సంపదనూ, ప్రకృతిలో భాగంగా బతుకుతున్న రెడ్ యిండియన్లనూ సర్వనాశనం చేసి, నమూనాకు మిగిల్చిన కొద్దిమందినీ జూలో జంతువులను పెట్టినట్లుగా 'రిజర్వేషన్'లలో బంధించి, 'స్వేచ్ఛా సమాజాన్నీ', 'కొత్త లోకాన్నీ' స్థాపించిన దురాశాపరుల మారణకాండకు ప్రతిరూపమే నేటి USA. ఆధునిక ప్రపంచ చరిత్రలో మాయని మచ్చగా మిగిలిన వికృత నరమేధాన్ని చిత్రించిన కథనమిది.

**- ప్రచురణకర్తలు**




**చీకటి వెలుగులు**

**(కవితా సంపుటి)**

**- ఎన్. రాజేంద్రప్రసాద్**

**వెల : రూ. 30/-  పేజీలు : 52**

**ప్రతులకు : 0877-2245282**

భావరహితమైన కేవల శబ్దం కవి హృదయాన్ని విప్పి చెప్పదు. "ఎద లోతుల స్పృశించే భావం" (పుట. 4) ప్రసారం చేసే చూపును పుస్తకం చదివే పాఠకుడు గ్రహించలేడు. కవిత్వం చూపుల భాష కాకూడదు. చూపుల భాషను పరోక్ష హృదయాలకు అందించే కవిత్వ భాష కావాలి. వర్తమాన మానవ జీవితంలో ఎదురయ్యే అనేక సమస్యలు ఈ సంపుటిలో కవిత్వీకరించబడినాయి.

**- మన్నవ భాస్కరనాయుడు**




**దగా దగా**

**ధగ ధగ (వ్యాసాలు)**

**- పి. లక్ష్మణ్‌రావ్**

**వెల : రూ. 20/-  పేజీలు : 84**

**ప్రతులకు : 94412 15989**

ప్రజలందరకు స్థిరమైన బతుకు, స్థిరమైన ఆదాయం, స్థిరమైన సంక్షేమం నేడు కావాలి. వాటిని సాధించుకోవడానికి ప్రజల్లో ముందుగా ఉండవలసింది సామాజిక చైతన్యం. అది వున్నప్పుడే ప్రశ్నించే ధోరణి వస్తుంది. ప్రజలు సామాజిక చైతన్యవంతులైనప్పుడు వారి సమస్యలను వారే పరిష్కరించుకుంటారు. సంక్షేమాన్ని ఏ విధంగా సాధించుకోవాలో వారే నిర్ణయించుకుంటారు. మంచి చెడ్డలను బేరీజు వేసుకొని తోటివారిని ఆదరించడానికి, ఆదుకోవడానికి, ప్రగతి బాటను వేయడానికి సామాజిక చైతన్యం ఉపయోగపడుతుంది. రథ చక్రమై ముందుకు నడిపిస్తుంది. అందరూ సమానమనే ధోరణి ఏర్పడి కక్షలకు, కార్పణ్యాలకు తావివ్వదు. సామాజిక చైతన్యులను ఏ స్వార్థశక్తి తమ అవసరాలకు వినియోగించుకోలేదు.

**- పి. లక్ష్మణరావ్**




**దృష్టి (రెక్కలు)**

**- పద్మకళ**

**వెల : రూ.30/-  పేజీలు : 46**

**ప్రతులకు : 99128 55195**

ఒక్కొక్క రాగానికి ఒక్కొక్క భావం బాగా ఒదిగినట్లుగా, ఒక్కొక్క రూపం ఒక్కొక్క భావానికి మంచి అభివ్యక్తి మార్గమవుతుంది. సాధారణంగా విషాదానికి బాగా ఒదిగే శివరంజని రాగాన్ని అప్పుడప్పుడు ప్రేమ సౌందర్యాల వ్యక్తీకరణకు వినియోగించినట్లే ఒక లఘు రూపాన్ని విభిన్న వస్తు వాహికగా కూడా ఉపయోగించవచ్చు. కానీ ఒక్కొక్క వస్తువు ఒక్కొక్క రూపానికి బాగా అతికించినట్లుంటుంది. ఇటీవలి కాలంలో సుగమ్‌బాబు ప్రారంభించిన 'రెక్కలు' అనే లఘురూపం చాలామంది యువతీ యువకుల్ని ఆకర్షించి, ఈ రూపంలో రెక్కలు సంపుటాలు వస్తున్నై. ఆ వరసలో వస్తున్నదే పద్మకళ 'దృష్టి' సంపుటి.

**- అద్దేపల్లి రామమోహనరావు**




**నడుస్తున్న చరిత్ర (కథలు)**

**- పంజాల జగన్నాథం**

**వెల : రూ. 75/-  పేజీలు : 139**

**ప్రతులకు : 9948531985**

ఏదేని ఒక మార్పు జరిగినపుడు ఏర్పడుతున్న పరిణామాలను నిశితంగా, లోతుగా పరిశీలించి అధ్యయనం చేసి సాహిత్యాన్ని సృష్టించాలి. రచయితలు నిరాకరించాల్సిందీ, ప్రతిఘటించాల్సిందీ వృత్తిలోని మార్పులను, పరిణామాలను కాదు. దాని ఫలితంగా బతుకు పట్ల ఏర్పడుతున్న అభద్రతనీ, కల్లోలాన్నీ, దుష్ఫలితాలని, వాటి నివారణకు ప్రత్యామ్నాయ మార్గాలను సూచించాల్సిన బాధ్యత మేధావి వర్గానికి చెందిన రచయితలదే! రచయితలు అనధికార శాసనకర్తలు.

**- పంజాల జగన్నాథం**

# కాటేయబడిన బాల్యం నీడన...

- ఎమ్.వి.జె. భువనేశ్వరరావు

నాన్నా .... ఏంటిది?
ప్రత్యక్షంగా జీవనగమనంలోకి నెట్టేశావ్...నన్ను!
పుడమి పైకి వచ్చిన సంవత్సర కాలానికే
శిశుగృహంలో నన్నుంచి
అమ్మా నువ్వు సంపాదన కెళ్ళేవారు..



అమ్మ పొత్తిళ్ళలో కాకుండా
ఆయా 'బొమ్మరిల్లు'లోనే పసిప్రాయం పూర్తయిపోయింది
ఉన్నత చదువుల భవనానికి
బలమైన పునాదులుండాలనీ...

ఎ, బి, సి, డిల నుండే ఐ.ఐ.టి. లెక్కలు నేర్పించావ్...
పగలంతా ఓ బడిలో
రాత్రయ్యే దాకా గుడి ప్రక్కనున్న ప్రత్యేక బడిలో
నన్ను నిర్బంధ విద్యార్థిగా చేసి
నాకు అమ్మ 'ఒడి' చిరునామా
తెలీకుండా చేశావ్...
ప్రాథమికోన్నత పాఠశాల స్థాయిలోనే
కళాశాల పాఠ్యాంశాలను చదివించేయాలనీ
ఆరోగ్యమిచ్చే ఆట పాటలకు దూరం చేశావ్..

పద్దెనిమిది గంటలు రోజులో కష్టపడితే
ఆరు సంవత్సరాల్లో అమెరికా వెళ్ళిపోవచ్చని చెప్పి
నిత్యం నిద్రకు దూరం చేసి
క్షణ క్షణం ఆదుర్దాపడే అనారోగ్య దౌర్భాగ్యానికి
గురి చేశావ్...
చదువు సర్వస్వమైంది...
'అది ' తప్పు ఇంకేమీ తెలీని
అజ్ఞాన జీవితం నా స్వంతమైంది...
అమెరికా 'సాఫ్ట్‌వేర్' హోర్డయిపోయి
ఆర్థిక వ్యవస్థ నిరర్థకమై
ఉద్యోగం దూరమై 'సంపాదన' కరువైంది.
స్వదేశానికి తిరిగొచ్చే ధైర్యం లేక
డబ్బులొచ్చే పన్జేసే ఆలోచన తెలీక
'ఆత్మహత్య' నే పరిష్కారంగా
నా మానసిక దుర్బలత సూచించింది...
నాన్నా.... ఏంటిది?
యువరక్తంతో వృద్ధాప్యపు ఛాయలు
సంతరించుకొన్న అర్భకుడినయ్యాను..
నాక్కావల్సింది తెచ్చుకొనే శక్తిలేని నిర్వీర్యుణ్ని
ఆస్తులు ఐశ్వర్యాలు తెచ్చివ్వలేను...
ఉన్న వాటిని సైతం కాపాడలేను...
శిథిలమైపోతున్న నైతిక విలువల మాటున
కొనటాన్కి బదులు లాక్కునే నైజమున్న మనుషుల మధ్యన
నాగుపాముల పడగ నీడన
నిత్యం జీవచ్ఛవంలా బ్రతుకీడుస్తూ...
కాటేస్తున్న నాగుపామునే ప్రేమించాల్సిన దుస్థితిలో
కష్టపడి సంపాదించుకొనే మార్గాన్ని వదిలి
'దోపిడీ' తోనే డబ్బు పోగేసుకునే ఈ రోజుల్లో
మంచితో కాకుండా... మోసంతోనే
ధనవైకుంఠపాళి నిచ్చెనల నధిరోహించే వేళల్లో
నమ్మక ద్రోహ విషాన్ని నిలువెత్తునా నింపుకొని
నరులంతా 'నిజరూప' దర్శనమిస్తున్న క్షణాన
ఎలా బ్రతక మంటావు నాన్నా?...
నన్నీ ఏటికి ఎలా ఎదురీద మంటావ్?...

---



# నానీలు

- ఎస్.ఆర్. పృథ్వి

జైళ్ళలో సౌకర్యాలు
శోభాయమానం
ఘోర నేరాలు
విమానయానం

పోరు సలిపితే
పవరుండాలి
చేతులు కలిపితే
చేవ ఉండాలి

ప్రేమ ఒకే చేస్తే
స్వర్గాన్ని చిత్రిస్తాడు
కాదంటే
చావును చూపిస్తాడు

శృంగారానికి
మరుగుండాలి
సాహసానికి
పరుగుండాలి

అమ్మ పిలుపులో
ఉంది అమృతం
నాన్న పిలుపులో
చూడు జీవితం

ఎలక్షన్లు కర్మాగారం
ఓటర్లు కార్మికులు
నెగ్గిన వాళ్ళంతా
యాజమాన్యం

# 'లా'

- బరకు



మిడిగుడ్లతో మింగుతుంటాడే,
మస్తానమ్మా?
మానం, అభిమానం
సూక్ష్మ పురుగై తొలుస్తుంటే
ప్రాణమెక్కడుందే? బిడ్డా!
అచ్చమ్మకు తోడు పాయే!?
సావులన్నీ
సాక్ష్యమియ్యాల్నంటే –
గవర్నమెంటోడి గుడ్డి కళ్ళకి,
దీపం కావాలంటే!?
నూకాలమ్మ తల్లీ –
బీదల బతుకుల్లో
ఇన్ని నిప్పులేంటి
మంచోళ్లకి
అన్నీ మొక్కులేనేంటి!?

# వెలుగునిచ్చే దీపం సాహిత్యం

## ప్రస్థానం వెబ్‌సైట్ ప్రారంభోత్సవ సభలో విద్యాసాగర్

సాహిత్యమనేది ప్రపంచానికి వెలుగునిచ్చే దీపం లాంటిదని ఐఎఎస్ అధికారి అంగలకుర్తి విద్యాసాగర్ అన్నారు. సాహిత్యపు ఆలోచనలు, తత్వాలను ప్రతి ఒక్కరూ తమ నిత్యజీవితంలో ఏదో ఒకరోజు అనుభవిస్తూనే వుంటారని ఆయన చెప్పారు. సాహిత్యం ఒక మనిషిని నాగరికుడుగా, సంస్కారవంతుడిగా మలుస్తుందని తెలిపారు. ఫిబ్రవరి 19న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో 'ప్రస్థానం' సాహిత్య మాస పత్రిక వెబ్‌సైట్ 'ప్రస్థానం డాట్ కామ్'ను విద్యాసాగర్ ప్రారంభించారు. సుందరయ్య వికాస వేదిక, సాహితీ స్రవంతి సంయుక్త ఆధ్వర్యాన జరిగిన ఈ కార్యక్రమంలో తొలుత సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ స్వాగతం పలికారు. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అధ్యక్షతన 'సమాజం - సమకాలీన సాహిత్యం' అనే అంశంపై చర్చాగోష్ఠి జరిగింది. ఈ సందర్భంగా విద్యాసాగర్ మాట్లాడుతూ సాహిత్య ప్రభావం వల్ల గతంలోని దురాచారాలను, మూఢనమ్మకాలను చాలావరకు పారద్రోలగలిగామని చెప్పారు. కుల, మత, లింగ వివక్షతలను రూపుమాపటంలో అనేకమంది కవులు, రచయితలు సాహిత్యం ద్వారా తమ వంతు పాత్రను పోషించారని అన్నారు. తాజాగా ఈజిప్టు రాజుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం సందర్భంగా ప్రజలు దోహాల రూపంలో పాటలను పాడుతూ, నినాదాలిస్తూ మిగతావారిని చైతన్యపరిచారని తెలిపారు. సాంకేతిక పరిజ్ఞానం వేగంగా విస్తరిస్తున్న తరుణంలో 'ప్రస్థానం' అంతర్జాలంలోకి ప్రవేశించడం హర్షదాయకమని ప్రశంసించారు. ఈ అవకాశాన్ని ఈ తరం కవులు, రచయితలు ఉపయోగించుకుని సమాజానికి ఉపయోగపడే సాహిత్యాన్ని అందించాలని సూచించారు. కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న ప్రముఖ కవి నిఖిలేశ్వర్ మాట్లాడుతూ ప్రస్తుత సాహిత్యంలో సమిష్టి లక్షణమనే భావనకు ప్రాధాన్యత తగ్గి చీలికలు, పేలికలు కావడం విచారకరమని అన్నారు. ప్రస్తుతం సాహిత్యం ఒక అస్థిత్వ దశలో ఉందని చెప్పారు. సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా వస్తున్న వేగవంతమైన పరిణామాలను సాహిత్యం అందుకోలేకపోతుందని తెలిపారు. వివిధ కులాలు, మతాలు, ప్రాంతాలకు చెందినవారు తమ గుర్తింపును కోరుకుంటున్న తరుణంలో తమదైన లక్ష్యం కోసం వారు సాహిత్యాన్ని వాడుకుంటున్నారని అన్నారు. ప్రాంతీయ రాజకీయ విధానాల వెనుక పెట్టుబడి అనే భయంకర నిజం దాగుందనే విషయాన్ని రచయితలు, కవులు విస్మరిస్తున్నారని అన్నారు. వర్గపోరాటమే అంతిమమనే విషయాన్ని వారు తెలుసుకోవాలని సూచించారు. రచయితలు సమాజ హితాన్ని దృష్టిలో ఉంచుకుని దూరదృష్టితో రచనలను కొనసాగించాలని కోరారు. తెలకపల్లి రవి మాట్లాడుతూ సమాజానికి హితం చేసేదే సాహిత్యమని అన్నారు. మనుషుల్ని ఉమ్మడి లక్ష్యం వైపు నడిపించాల్సిన సాంకేతిక పరిజ్ఞానం వారిని విడగొడుతోందని చెప్పారు. ఈ పరిణామాల వెనుక మార్కెట్ శక్తుల ప్రభావం ఉందన్నారు. ఈ శక్తులు తమ ప్రయోజనాల కోసం జనం లోంచి మనిషిని విడగొడుతున్నాయని తెలిపారు. వీటన్నింటినీ అధిగమించి నేటి సాహిత్యం జనహితం కోసం పాటుపడాలని ఆకాంక్షించారు. కార్యక్రమంలో సాహితీ స్రవంతి ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి, ఉపాధ్యక్షులు కేశవరెడ్డి, వల్లభాపురం జనార్దన్, కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, తంగిరాల చక్రవర్తి, కె. లక్ష్మయ్య తదితరులు పాల్గొన్నారు.



ప్రస్థానం.కామ్‌ను ప్రారంభిస్తున్న విద్యాసాగర్, నిఖిలేశ్వర్, తెలకపల్లి రవి, వొరప్రసాద్, ఆనందాచారి




'సమాజం - సమకాలీన సాహిత్యం' గోష్ఠిలో ప్రసంగిస్తున్న తెలకపల్లి రవి, వేదికపై నిఖిలేశ్వర్, విద్యాసాగర్

### చందాదారులకు ఓ విన్నపం

(1) ప్రస్థానం చందాదారుని చిరునామా పైన చందా యొక్క కాలపరిమితి సూచిస్తూ నెల - సంవత్సరం ఇస్తున్నాం. అది గమనించి వెంటనే మీ చందాను పునరుద్ధరించుకోగలరు. (రెన్యువల్స్).

(2) కంప్యూటర్‌లోని రికార్డులో చందా ముగియడంతోనే ఆ చందాదారుని పేరు ఆటోమేటిక్‌గా డిలీట్ అవుతుంది. చందా కాలం ముగిసిందని ముందుగానే వారి చిరునామాకు కార్డు రాస్తున్నాం.

(3) ఆన్‌లైన్‌లో చందాను రెన్యువల్ చేసుకోవచ్చు. ఖాతా పేరు: ప్రస్థానం, ఖాతా నెం. 52001500585. బ్యాంక్: ఎస్‌బిహెచ్. ఆన్‌లైన్‌లో 5, 10 సంవత్సరాల చందాలు మాత్రమే అంగీకరించబడతాయి.

(4) సాహితీస్రవంతి కార్యకర్తలు, అభిమానులు చందాలను ఆన్‌లైన్‌లో జమచేసేటప్పుడు కనీసం 5 చందాలను ఒకసారి జమచేయగలరు. ఒకసారి ఆన్‌లైన్‌లో జమచేసినందుకు రూ. 25/-లు కట్ అవుతుంది.

(5) 5 సం॥ చందా డిస్కౌంట్‌లో రూ. 500/- కట్టడం వల్ల మీకు అన్ని సంచికలు క్రమంగా అందుతాయి. గ్యాప్‌లు రావు. రూ. 100/- ఆదా కూడా అవుతుంది. (5 × 120 = 600).

(6) ఎం.ఓ. పంపే వారు కూపన్‌కు ఒకవైపున మీ పూర్తి చిరునామా, ఫోన్ నెం. రాయండి. అడ్రస్ మారితే వెంటనే కార్డు రాయండి. ఇ-మెయిల్ కూడా పంపవచ్చు. Prasthanam_ss@yahoo.co.in.

# మహోదయం తర్వాత మంచి గ్రంథం

## శ్రీశ్రీ జయభేరి ఆవిష్కరణ సభల్లో వక్తల ప్రశంస

మహాకవి శ్రీశ్రీ జీవితం సాహిత్యం, రాజకీయాలపై తెలకపల్లి రవి రచించిన 'శ్రీశ్రీ జయభేరి' గురజాడ అప్పారావుపై కె.వి. రమణారెడ్డి రాసిన మహోదయం తర్వాత చెప్పుకోదగ్గ మంచి గ్రంథమని కవి, విమర్శకుడు సీతారాం అన్నారు. ఖమ్మంలో జనవరి 28న శ్రీశ్రీ జయభేరి పుస్తకావిష్కరణ సభలో ఆయన మహోదయ ప్రసంగం చేశారు. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ప్రియదర్శిని కళాశాల ఆవరణలో జరిగిన ఈ సభకు స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి అధ్యక్షత వహించారు.

శ్రీశ్రీ శత జయంతి సందర్భంగా జిల్లాలోని ప్రైవేట్ విద్యాసంస్థల సంఘం ఫెమా ఆధ్వర్యంలో మహాకవి విగ్రహాన్ని ఆవిష్కరించి సరిగ్గా ఏడాది గడిచిన సందర్భంలోనూ ఈ పుస్తకావిష్కరణ ఏర్పాటు చేశారు. మొదట సభికులు వైరా రోడ్డులోని శ్రీశ్రీ విగ్రహానికి పూలమాలలు వేసి సభాస్థలికి చేరుకున్నారు. పట్టణంలోని సాహితీ మిత్రులు, విద్యార్థినీ విద్యార్థులు విస్తృతంగా హాజరైనారు. ఆనందాచారి తన ప్రసంగంలో సభ సందర్భాన్ని శ్రీశ్రీ శతజయంతిలో సాహితీ స్రవంతి కృషిని ప్రస్తావించారు.

ఫెమా అధ్యక్షుడు మొవ్వా శ్రీనివాసరావు తొలుత పుస్తకాన్ని ఆవిష్కరించి మాట్లాడారు. శ్రీశ్రీ జీవిత సాహిత్యాలను ఒకేచోట ఆవిష్కరించాలన్న తన కోర్కె ఈ విధంగా తీరిందని ఆనందం వెలిబుచ్చారు. శతజయంతి సందర్భంలో ఖమ్మం జిల్లాలో యువతకూ, విద్యార్థులకూ శ్రీశ్రీని పరిచయం చేసే కృషిలో తమ అనుభవాలను వివరించారు. ఆయనతో పాటు సంఘం కార్యదర్శి వీరారెడ్డి, ప్రియదర్శిని సంస్థల సారథి నవీన్ కూడా మాట్లాడారు.

కవి సీతారాం పుస్తకాన్ని పరిచయం చేస్తూ శ్రీశ్రీని గురించి ఇది వరకు చదివిన వారు మరింత లోతుగా ఆలోచించి అధ్యయనం చేయడానికి, కొత్తగా చదవగోరేవారు రేఖామాత్రంగా అవగాహనకు రావడానికి తెలకపల్లి రవి పుస్తకం దోహదపడుతుందని అన్నారు. ఉన్నంతలో సమగ్రంగా తీర్చిదిద్దిన ఈ పుస్తకంలో రచయిత శ్రీశ్రీకి సంబంధించిన విషయాలపై వివాదాలు పెంచడానికి గాక విశ్లేషణాత్మక అవగాహన ఇవ్వడానికి ఎంతో సంయమనంతో, నేర్పుతో ప్రణాళికాబద్ధంగా రచన సాగించారని అన్నారు. సోదాహరణంగా సోపపత్తికంగా రాయడం వల్ల శ్రీశ్రీ గురించిన అంచనాల వ్యాఖ్యానాల లోటుపాట్లు తెలుస్తాయని చెప్పారు. అస్తిత్వ వాదాల నేపథ్యంలో శ్రీశ్రీ ప్రాధాన్యత గురించి పునర్మూల్యాంకనం చేయాలని కొంతకాలం కిందట గట్టిగా వినిపించేదని, కాని ప్రపంచీకరణ ఫలితాలు కనిపిస్తున్న కొద్దీ శ్రీశ్రీ మరింత అవసరమని స్పష్టమవుతున్నదని చెప్పారు. శ్రీశ్రీ తన గురించి తాను రాసుకున్న సమకాలీనులు పెద్దలు ఆయనపై రాసిన దాన్ని జాగ్రత్తగా వినియోగించుకుంటూ తను పెద్దగా తలదూర్చకుండా రచయిత అనుకున్న భావాన్ని చేరవేయగలిగాడని అభినందించారు.




ఖమ్మం "శ్రీశ్రీ జయభేరి' పుస్తకావిష్కరణ సభ

అనేక కొత్త కోణాలు ఆవిష్కృతమవడం వల్ల శ్రీశ్రీని మరోసారి చదవాలనిపిస్తుందని వివరించారు. కమ్యూనిస్టు పార్టీతో శ్రీశ్రీ అనుబంధం, అరసం విరసం తదితర అంశాలపై రాసేటప్పుడు కూడా వివాదాలు పెంచడానికి గాక వాస్తవాలను చారిత్రక దృష్టితో నివేదించడానికి రవి జాగ్రత్త పడ్డారని, నిగ్రహం చూపారని ఆయన అభిప్రాయపడ్డారు. అధ్యాయల విభజనలోనూ, చారిత్రక క్రమం పాటించడం వల్ల పాఠకుడికి శ్రీశ్రీ పరిణామ క్రమం పరిపూర్ణ స్వరూపం గోచరమవుతాయని తెలిపారు. శ్రీశ్రీ వ్యక్తిగత జీవితాన్ని మాత్రమే గాక ఆయన కాలాన్ని, మార్పులను అర్థం చేసుకునే చారిత్రక అధ్యయనంగానూ ఈ పుస్తకం ఉపయోగపడుతుందని, మంచి తెలుగు నేర్చుకోవడానికి కూడా ఉపకరిస్తుందని సీతారాం అనేక విధాలుగా అభినందించారు. జయభేరి ఇప్పటికే పెద్దదైనందున దీనికి అనుబంధంగా ఒకటి రెండు పుస్తకాలు వస్తే మరింత మేలు జరుగుతుందని సూచించారు.

తెలకపల్లి రవి చివరగా మాట్లాడుతూ శ్రీశ్రీ గురించి వాద వివాదాల మధ్య వాస్తవ చిత్రణ ఇవ్వడమే లక్ష్యంగా రచన చేసినట్లు చెప్పారు. ఈ ప్రయత్నానికి ప్రోత్సాహం లభించడం పట్ల సంతోషం వ్యక్తం చేశారు. శ్రీశ్రీ పట్ల పునర్మూల్యాంకనం జరగాలని కోరే వారు ముందు సమగ్రమైన మూల్యాంకనం చేయాలని కోరారు. సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి రౌతు రవి మొదట స్వాగతం పలికి చివర వందన సమర్పణ చేశారు.

### మరికొన్ని చోట్ల...

హైదరాబాద్ బుక్‌ఫెయిర్‌లోనూ, డిసెంబర్ చివరన తొలిసారి శ్రీశ్రీ జయభేరి పుస్తకావిష్కరణ జరిగింది. ప్రముఖ కవి కె. శివారెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో ప్రసిద్ధ రచయిత కేతు విశ్వనాథరెడ్డి పుస్తకాన్ని ఆవిష్కరించి మాట్లాడారు. శ్రీశ్రీ జీవితాన్ని సమగ్రంగానూ, సమతుల్యతతోనూ అందించే మంచి ప్రయత్నంగా ఆయన పుస్తకాన్ని అభినందించారు. భవిష్యత్ పరిశోధకులకు ఇది మంచి వనరుగా వుంటుందని శివారెడ్డి అన్నారు.

విజయవాడ పుస్తక ప్రదర్శనలో సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఎస్. వెంకట్రావ్ అధ్యక్షతన జరిగిన సభలో ఆంధ్ర నాటక




తిరుపతి 'శ్రీశ్రీ జయభేరి' పుస్తకావిష్కరణ సభలో
డాక్టర్ మౌని, చంద్రశేఖర్, రెడ్డిమునెప్ప

పరిషత్ ప్రధాన కార్యదర్శి గోళ్ళ నారాయణరావు పుస్తకాన్ని విడుదల చేశారు. ప్రముఖ విమర్శకులు కె. రామమోహనరాయ్ ఈ పుస్తకాన్ని పరిచయం చేశారు. తెలకపల్లి రవి వాస్తవికంగానూ, ప్రామాణికంగానూ ఈ రచన సాగించారని రాయ్ అభినందించారు. శ్రీశ్రీ విశిష్టతను చెబుతూనే విమర్శలను కూడా వదలిపెట్టలేదని అన్నారు. ఈ రెండు సభల్లోనూ రచయిత కూడా పాల్గొని ప్రసంగించారు. కర్నూలులో శ్రీశ్రీ జయభేరి పుస్తకాన్ని సాహితీ స్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు వల్లభాపురం జనార్దన ఆవిష్కరించి ప్రసంగించారు. రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, జిల్లా కార్యదర్శి కెంగార మోహన్ ఈ సభలో పాల్గొన్నారు.

శ్రీశ్రీ జన్మస్థలమైన విశాఖ పట్టణంలో కూడా పుస్తకాన్ని విడుదల చేసి సభ జరపాలన్న ఉద్దేశాన్ని సాహితీ స్రవంతితో పాటు ఇతర సాహితీ మిత్రులు కూడా వ్యక్తం చేశారు. శాసనమండలి సభ్యులు ఎంవిఎస్ శర్మ పుస్తకాన్ని చదివి అభినందిస్తూ సభ ఏర్పాటుకు సహకరిస్తామని చెప్పారు.

కొద్దికాలంలోనే తొలి ముద్రణ ప్రతులు పూర్తి కావస్తున్నా శ్రీశ్రీ జయభేరి మలి ముద్రణకు అవకాశం వున్నందువల్ల ఏమైనా సలహాలు, సూచనలు వుంటే చేయాలని ప్రచురణకర్తలైన ప్రజాశక్తి బుక్‌హౌస్ నిర్వాహకులు కోరుతున్నారు. సాహిత్య గ్రంథాలకు ఆదరణ పెద్దగా లేదని భావిస్తున్న తరుణంలో ఇది శ్రీశ్రీ పట్ల ప్రత్యేకాభిమానానికి నిదర్శనమని భావించవచ్చు.

తిరుపతిలో 'శ్రీశ్రీ 'జయభేరి' పుస్తకావిష్కరణ సభ 'ప్రజాశక్తి బుక్‌హౌస్'లో జనవరి 29న జరిగింది. ప్రముఖ కవి, సాహితీవేత్త డాక్టర్ మౌని, ప్రజాశక్తి ఎడిషన్ మేనేజర్ చంద్రశేఖర్‌లు ముఖ్య అతిథులుగా హాజరై పుస్తకాన్ని ఆవిష్కరించారు. బుక్‌హౌస్ మేనేజర్ రెడ్డిమునెప్ప అధ్యక్షత వహించారు. జీవితగాథ, సాహిత్యం, రాజకీయాలు గురించిన పూర్తి విశ్లేషణాత్మక గ్రంథం అని వక్తలు పేర్కొన్నారు. ఈ పుస్తకాన్ని సమీక్షించిన డాక్టర్ మౌని మాట్లాడుతూ రచయిత శ్రీశ్రీని అన్ని కోణాల నుండి సామాజిక సాహిత్య దృక్పథంతో పరిశీలించి పుస్తకం రాశారన్నారు. నేటి యువతకు శ్రీశ్రీ ఆదర్శప్రాయుడని పేర్కొన్నారు. తాను కళాశాల విద్యార్థిగా ఉన్నప్పుడు స్వయంగా శ్రీశ్రీని ఆర్ట్స్ కళాశాలకు ఆహ్వానించి ఆయనచే ఉపన్యాసం ఇప్పించానని గుర్తు చేశారు. తాను రచయితగా మారడానికి శ్రీశ్రీనే ఉత్ప్రేరణ అన్నారు. కొన్ని కవితలను చదివి వినిపించారు. చంద్రశేఖర్ మాట్లాడుతూ శ్రీశ్రీ అంటేనే సాహిత్య పులకరింత అని కొనియాడారు. తనదైన శైలిలో తేలికైన పదాలతో శ్రామికుని మనోభావాన్ని అద్దంపట్టేలా ఆయన కవితలు ఉంటాయని చెప్పారు. టిటిడి సప్తగిరి సబ్‌ఎడిటర్ కల్వకుంట రామమూర్తి మాట్లాడుతూ హితసహితమైనది సాహిత్యమని, ఆ సాహిత్యానికి వన్నెతెచ్చిన కవి శ్రీశ్రీ అని కొనియాడారు.

మహాకవి శ్రీశ్రీ శతజయంతి సందర్భంగా మహబూబ్‌నగర్ సిఐటియు సమావేశ హాలులో "శ్రీశ్రీ జయభేరి" పుస్తకావిష్కరణ సభ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జరిగింది. ఈ సభలో ప్రధాన వక్తగా పాల్గొన్న హిమజ్వాల ప్రసంగిస్తూ "తెలుగు సాహిత్య సాంస్కృతిక భూమికి జవమూ, జీవమూ ఇచ్చిన ప్రజాసాహిత్య సాంస్కృతిక సేనాని శ్రీశ్రీ" అని సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యుడు హిమజ్వాల అన్నారు. "గురజాడతో మొదలైన ఆధునిక ప్రజాస్వామిక సాహిత్య సంప్రదాయాన్ని విస్తరించిన విప్లవ కవి శ్రీశ్రీ" అని, "శ్రీశ్రీ జీవించిన కాలాన్ని గురించి తెలుసుకోవడమంటే శ్రీశ్రీని గురించి తెలుసుకోవడమే" అన్నారు. శ్రీశ్రీ జీవిత, సాహిత్య, రాజకీయాలను ఒక్కచోట చేర్చి శ్రీశ్రీని అర్థం చేసుకోవడానికి, అంచనా వేసుకోవడానికి అవకాశం కల్పించిన ఒక అవసరమైన రచన ఈ పుస్తకం అన్నారు. ఆ పుస్తకాన్నందించిన రచయిత తెలకపల్లి రవి తన సామాజిక బాధ్యతని నిర్వర్తించాడని అన్నారు. కార్మిక సంఘ నాయకులు ఎస్.ఎం. ఖలీల్ ప్రసంగిస్తూ 'అలజడి జీవితంగా, ఆందోళన ఊపిరిగా, తిరుగుబాటు వేదాంతంగా ఉన్నవాడే శ్రీశ్రీకి నిజమైన వారసుడని' అన్నారు. శ్రీశ్రీని కార్మికవర్గం సదా గుర్తుంచుకుంటుందని, ప్రజారచయితలకి శ్రీశ్రీ సాహిత్యం ఒక మేనిఫెస్టో లాంటిదన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు వల్లభాపురం జనార్దన పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఈ సభకు సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి నవీన్ అధ్యక్షత వహించారు. ఈ సభలో యువకవి వెంకటయ్య శ్రీశ్రీపై కవిత చదివి ఉగ్రూతలూగించారు. ఈ సభలో కవులు దేవదానం, ఖాజామొయిద్దీన్, జమున, సత్యవతి, కళా మురళి సాహిత్యాభిమానులు పాల్గొన్నారు.




మహబూబ్‌నగర్‌లో శ్రీశ్రీ జయంతి సందర్భంగా జరిగిన
'శ్రీశ్రీ జయభేరి' పుస్తకావిష్కరణ సభ

# ప్రతిభకు మెరుగు

విజయనగరం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 12న గురజాడ వారి స్వగృహంలో 27 మందితో 11వ మెరుగు కార్యక్రమం జరిగింది. చీకటి దివాకర్ మాట్లాడుతూ సమాజంపై బాధ్యత ఉన్నవాళ్ళంతా కూర్చుని చర్చించుకునే సభ అన్నారు. సాహిత్యాన్ని అధ్యయనం చేసి ఉపన్యాసకులుగాను, విమర్శకులుగాను, కవులుగాను, రచయితలు గాను తయారవ్వాలన్నారు. ఇప్పుడున్నటువంటి పరిస్థితులను కూడా ఆకళింపు చేసుకొని సమాజానికి పనికివచ్చే రచనలు చేయాలని కోరారు. మేడిపల్లి రవికుమార్ మాట్లాడుతూ గురజాడ అప్పారావు ఇంట్లో పుట్టిన ఆలోచనలు విశాలంగా ఉండాలని, తెలుగు సాహిత్యంలో వచ్చిన ఇతరేతర రచనల కంటే గొప్పగా ఉండాలని కోరారు. సరైన క్రమంలో బట్వాడా అయితే అదే మంచి కథని, ఎంత గొప్పగా రాశామని కాకుండా ప్రజెంటేషన్ చేయడం గొప్పన్నారు. నిన్నటి పుత్తడిబొమ్మ పూర్ణమ్మకు ఒకటే సమస్య. కాని ఈనాటి పూర్ణమ్మకు ఎన్నో సమస్యలన్నారు. రచన చేసేటపుడు 'సమస్య'ను, 'పరిష్కారము'ను చూపేవిగా ఉండాలని, ఒక్క సమస్యనే చూపితే పాఠకుడు భీతిల్లే ప్రమాదముందని అన్నారు. అలాగే తిరుపతి నుండి వచ్చిన ప్రొఫెసర్స్ శారద, రాజేశ్వరి మెరుగులో వచ్చిన కవితలకు, పాటలకు స్పందించారు.

తులసి మాట్లాడుతూ మెరుగులో ప్రతిభను సానపెట్టే స్థితి కలిగినందుకు ఆనందం వ్యక్తం చేశారు. వ్యవహారిక భాష పుట్టిన ఇంటి నుండి మాట్లాడుతున్నానన్నారు. తెలుగులో ఇప్పుడు వస్తున్నటువంటి అక్షరాల మార్పుపై చర్చ చేశారు. రామసూరి మాట్లాడుతూ సాహితీ స్రవంతి క్రమమైన పద్ధతిలో యువ కవులు రోణంకి నారాయణబాబు, చాసో మొదలగువారు ఒకచోట సమావేశమై సమాలోచన చేసినట్టుగా చేయాలని, గతాన్ని నెమరువేసుకోకుండా స్ఫూర్తిని పొంది, అందులో ఉండే అభ్యుదయాన్ని వర్తమానానికి అన్వయించుకుంటూ, ఈ మెరుగు ద్వారా మెరుగుపడాలని ఆకాంక్షించారు. కిలపర్తి దాలినాయుడు "మీరే చెప్పాలి" అనే కవితలో ప్రతి వ్యాపార ప్రకటనలోను స్త్రీలను ఉపయోగించడం ఎంతవరకు సబబని ప్రశ్నించారు. బాల సుధాకర్ చంద్రమౌళి అమ్మకానికేది లేదంటూ తన కవితను వినిపించారు. ద్వారం దుర్గాప్రసాద్ "నీటికి నడిచే దారేది" అనే కవితలో పర్యావరణాన్ని వివరించగా, మానాపురం రాజా చంద్రశేఖర్ "బాల్యం ఒక ఖరీదైన స్వప్నం"లో ఇప్పుడున్నటువంటి విద్యావిధానం గూర్చి తెలియజేశారు. పాయల మురళీకృష్ణ "జానపదులలోన" అనే సీస పద్యాన్ని, హృషీకేశం ఒక పద్యాన్ని, పి.ఎస్.ఎస్. లక్ష్మి "ఎన్నాళ్ళో ఇంకెన్నాళ్ళో" అనే పాటలో అణగారిన కులాల పట్ల మతం చూపిన అమానవీయ కోణాల్ని ఎత్తిచూపారు. చెళ్ళపిల్ల శ్యామల "కల్మశమెరుగని మల్లి" అనే పాటలో మానవ మృగాల బారిన పడకుండా ఉండాలని పిల్లలను జాగృత పరచారు. గంద్రేటి శ్రీను "నిన్ను విడిచి పోనమ్మా" అనే పాటను బులుసు సరోజినీదేవి "నీటిచుక్కలు" అనే కవితను, హైదరాబాద్ నుండి వచ్చిన నాస్తిక సంఘ నాయకులు సారయ్య మూఢనమ్మకాలు ప్రజలపై ఎంత బలీయంగా ఉన్నాయో వివరించి, దీనిని నిర్మూలించాలని పిలుపునిచ్చారు.




మెరుగు కార్యక్రమంలో మాట్లాడుతున్న డా॥ రామసూరి. చిత్రంలో కృష్ణారావు, మానాపురం రాజా చంద్రశేఖర్




ఫిబ్రవరి 13న శ్రీకాకుళంలో కథానిలయం వార్షికోత్సవ సభలో ప్రసంగిస్తున్న కాళీపట్నం రామారావు



జనవరి 30న జరిగిన కంచరాన భుజంగరావు నానీ సంపుటి "కొంగా! నా గోరు మీద పువ్వెయ్యవా..." పుస్తకావిష్కరణ. చిత్రంలో (ముందు వరుస ఎడమ నుండి కుడికి) శ్రీమతి చింతాడ మంజు, డా॥ కె. రామ్మోహనరావు, డా॥ కిల్లి కృపారాణి, కవి కంచరాన భుజంగరావు, దివ్వల గవరయ్య, కొప్పల భానుమూర్తి, పి.ఎస్. నాగరాజు, బొడ్డ అయ్యబాబు

## 'ఆశల రెక్కలు' ఆవిష్కరణ

వంగర పరమేశ్వరరావు రచించిన రెక్కల సంకలనం 'ఆశల రెక్కలు' బై లింగ్విల్ ఆవిష్కరణ జనవరి 30న దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్‌లో జరిగిన సాహితీ సభలో ఆవిష్కరింపబడింది. ప్రముఖ కవి కె. శివారెడ్డిచేత ఆవిష్కరింపబడిన ఈ కార్యక్రమానికి 'రెక్కల రూపశిల్పి' ఎం.కె. సుగమ్‌బాబు ముఖ్య అతిథిగా విచ్చేశారు.

ముఖ్య అతిథి తన ప్రసంగంలో మనిషిలో మార్పు, తద్వారా సమాజంలో శాంతి పరిఢవిల్లడానికి రెక్కల ప్రక్రియ దోహదపడుతుందని చెప్పారు. తాత్వికత భూమిక కలిగిన రెక్కలు అంతర్ముఖ దిశలో మానవుణ్ణి ప్రయాణింపజేస్తూ... ఆలోచనలను సంస్కరిస్తూ... జ్ఞానానికి బాటలు వేస్తాయి అన్నారు.

ఆవిష్కర్త కె. శివారెడ్డి మాట్లాడుతూ లఘు రూపాల్లో కొన్ని భావాలు అద్భుతంగా ధ్వనిస్తాయన్నారు. పదాల వినియోగం పొదుపు ద్వారా అవసరమైన పద ప్రయోగాలకు తావుండదని, పద ప్రయోగం అర్థవంతంగా వుండి అందం వస్తుందన్నారు. లఘు రూపాలు రాయడం అలవాటైన వారు దీర్ఘ కవితలు రాయడంలో కొన్ని ఇబ్బందులు ఎదుర్కోవచ్చని అభిప్రాయపడ్డారు. మొత్తం మీద ఏ రూపానికైనా కవితాత్మ జీవం పోస్తుందని... కవి తన రచనలో దానిని ప్రస్ఫుటించేటట్లు కృషి చేయాలని సూచన ఇచ్చారు.

వంగర పరమేశ్వరరావు తన రెక్కలలో ఆ నియమాన్ని పాటించారన్నారు. రావెల పురుషోత్తమరావు ఆంగ్లానువాదం తృప్తికరంగా వుందన్నారు.



జనవరి 30వ తేదీన హైదరాబాద్‌లో జరిగిన 'ఆశల రెక్కలు' రెక్కల సంపుటి ఆవిష్కరణ సభలో (కుడివైపు నుంచి) షేక్ రఫీ, షేక్ షరీఫ్, పెద్దూరి వెంకటదాసు, దూర్జటి, కె. శివారెడ్డి, కవి, గ్రంథ రచయిత వంగర పరమేశ్వరరావు, ఎం.కె. సుగమ్‌బాబు (రెక్కల రూపశిల్పి), మోపిదేవి రాధాకృష్ణ

తొలి ప్రతిని స్వీకరించిన కవి షేక్ రఫీ మాట్లాడుతూ మనిషి చివరి మజిలీలో ఒక విధమైన ఆత్మ పరిశీలన చేసుకుంటాడని... అప్పుడు అతని ప్రతి ఆలోచన మాగిన పండులాగా జీవితానుభవంలో తొణికిసలాడుతుంటుందని, తాత్విక దృక్పథం కలిగి అంతర్‌యానం చేస్తాడన్నారు. ఈ అంతర్ముఖ ప్రయాణ భావాలకు 'రెక్కలు' అద్దం పడతాయన్నారు. మరో కవి పెద్దూరి వెంకటదాసు జీవితసారాన్ని పట్టుకోవడానికి 'రెక్కలు' సాయపడతాయన్నారు.

ఇతర కవులు దూర్జటి, షరీఫ్‌లు రెక్కల ప్రక్రియ జీవన సత్యాల్ని, ఆత్మ పరిశీలనను ప్రతిఫలింపచేస్తాయన్నారు. మరో రెక్కల కవి మోపిదేవి రాధాకృష్ణ వందన సమర్పణ చేశారు.

## రైతు సమస్యలకు కవితా దర్పణం జనకవనం

మహబూబ్‌నగర్ జిల్లా సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో పట్టణంలోని శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయం సమావేశ హాలులో జనవరి 30న రైతు కవిత జనకవనం జరిగింది.

సాహితీ స్రవంతి కార్యదర్శి ఎం.డి. ఖాజామొయినుద్దీన్ అధ్యక్షతన జరిగిన ఈ జనకవనంలో జాతికి రైతులు వెన్నెముకలుగా వున్నా వారి సంక్షేమాన్ని ప్రభుత్వం పట్టించుకోవడం లేదన్నారు. వారి వెన్నెముకలను విరగగొడుతున్నదనే తొలి పలుకులతో జనకవనం ప్రారంభమైంది. కవయిత్రి కె.ఎ.ఎల్. సత్యవతి "రంగు వెలసిన వర్ణచిత్రమై శిధిల సౌధాన పడి ఉన్నాడతడు, బీడు పడిన తన మడిచెక్కకు తానే దిష్టిబొమ్మగ మారినాడు, సంక్షేమ అంపశయ్యపై శయనించి చేయూతకు కలవరించు భీష్మాచార్యుడతడు అతడిని బతికించండి" అంటే మరో కవయిత్రి బి.జమున 'కళ్ళాల్లో కుళ్ళిపోతున్న ధాన్యం, గుండెల్లో గూడుకట్టుకున్న నైరాశ్యం, ఫలసాయం చేతికందక గుండెపగిలి ఆత్మహత్యకు చేరువవుతున్న దుస్థితి" అని గొంతెత్తారు.

ఇరువింటి వెంకటేశ్వరశర్మ "అతడొక కర్మయోగి, మట్టిగుణం తెలిసిన మర్మజ్ఞుడు, సెజ్‌ల సెగలో సగమైనవాడు, రింగ్ రోడ్లో భూస్థాపితమైన వాడు, బలి అయిపోయిన బతుకు గంజిలో కానరాని మెతుకు" అంటూ వాస్తవ చిత్రం చూపారు. వై. దేవదానం "దారిదోపిడి దొంగలా దెబ్బకొట్టెడి అకాల వర్షం, నీటమునిగెను పంటలు, ఇంట ఎగసెను మంటలు, శిలువ మోసిన క్రీస్తు నడక నాగలెత్తిన రైతు నడక" అంటూ రైతు గోస వినిపించారు. కె. నవీన్ "తాకట్టు పెట్టిన పొలం ఆత్మహత్యల పాలయింది, అందరూ రాలటాన్ని




జనవరి 30న జరిగిన రైతు జనకవన సభ

చూస్తారు నేను రాలటంలోంచే పిడికిలెత్తి పైకెగరటాన్ని చూస్తా, ఉరేసుకున్న కళ్ళు ఉరిమురిమి చూస్తున్న దృశ్యం, పొలం ఎండిపోవడమే తెలుసు, బహుశా పండిపోవడమంటే ఇదేనేమో అంటూ రైతు పోరుబాట పట్టాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పాడు.

వల్లభాపురం జనార్దన్ "ఆకుపచ్చ వెన్నముద్దల తండ్రులు, ప్రగతి పద్మవ్యూహంలో చిక్కుకున్న అభిమన్యులు, జీవించే హక్కుకు దూరమవుతున్న రక్తసిక్త కబేళాలు" అంటూ రైతన్న దుస్థితిని ఎత్తిచూపారు. విరజాజి రామిరెడ్డి, కె. లక్ష్మణగౌడ్, కె. డాగోబేరావు, బైరవేండ సీతారామారావు, కమలాకర్ శ్యాంప్రసాద్‌రావు, కొంకలి నరసింహులు, ఎం.బి. బాలకృష్ణ, అశోకాచారి, ఎం.డి. ఖాజా మొయిద్దీన్‌లు కవితలు వినిపించారు. ఇరువింటి వెంకటేశ్వరశర్మ వందన సమర్పణతో జనకవనం ముగిసింది.

# గురజాడ రచనలు సాహిత్యలోకానికి మార్గదర్శకాలు

గురజాడ రచనలు సాహిత్యలోకానికి మార్గదర్శకాలని యోగివేమన యూనివర్సిటీ రిజిస్ట్రార్ శివరామిరెడ్డి పేర్కొన్నారు. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జనవరిలో స్థానిక సిపి బ్రౌన్ భాషా పరిశోధనా కేంద్రంలో పుస్తకావిష్కరణ సభ నిర్వహించారు. యోగివేమన విశ్వ విద్యాలయం పాలక మండలి సభ్యులు శశిశ్రీ అధ్యక్షతన నిర్వహించిన ఈ సభకు ముఖ్య అతిథిగా వైవియు రిజిస్ట్రార్ శివరామిరెడ్డి హాజరయ్యారు. గురజాడ రచించిన 'దేశభక్తి గేయాలు, ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి రచించిన 'దీపధారి గురజాడ' పుస్తకాలను శివరామిరెడ్డి ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ దేశభక్తిని ప్రబోధించిన గురజాడ రచనల్లో అభ్యుదయం ఉండబట్టే ఇప్పటికీ గొప్ప రచనలుగా పేరు పొందాయన్నారు. పుస్తకావిష్కరణ సభకు అధ్యక్షత వహించిన శశిశ్రీ మాట్లాడుతూ సాహితీస్రవంతి కొన్ని సంవత్సరాలుగా ఎన్నో కార్యక్రమాలు చేపడుతుందన్నారు. ప్రజల కోసం, సాహిత్యం కోసం పనిచేయడం అభినందనీయమన్నారు. సాహిత్య విమర్శకులు రాష్ట్రంలో బహుకొద్ది మందే ఉన్నారన్నారు. తిరుపతి యస్వీ ఆర్ట్స్ కళాశాల తెలుగు ప్రొఫెసర్ డాక్టర్ వి.ఆర్.రాసాని మాట్లాడుతూ మూఢాచారాలు, దురాచారాలు, అజ్ఞానాన్ని గురజాడ ఆనాడే తన రచనలతో పారద్రోలారన్నారు. గురజాడ రచించిన దేశభక్తి గీతాలు పుస్తకరూపంలో రావడం అభినందనీయమన్నారు. యస్వీ యూనివర్సిటీ తిరుపతి ఆచార్యులు మేడిపల్లి రవికుమార్ మాట్లాడుతూ గురజాడ




స్త్రీల గురించి ఎంతో గొప్పగా చెప్పారన్నారు. ప్రస్తుతం నడుస్తున్న రాజకీయాలను కూడా గురజాడ అప్పట్లోనే చెప్పగలిగారన్నారు. సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ ఎస్. మస్తాన్‌వలి మాట్లాడుతూ గురజాడ రచించిన దేశభక్తిగేయాలు, రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి రచించిన దీపధారి గురజాడ ఈ రెండు పుస్తకాలు ఆణిముత్యాలన్నారు. ప్రజాశక్తి ప్రచురణాలయం తీసుకొచ్చిన ఈ పుస్తకాలు బాధ్యతలను గుర్తు చేస్తాయని చెప్పారు. వైవియు తెలుగు శాఖ అధ్యక్షులు. రాంప్రసాద్‌రెడ్డి, లలితకళ విభాగం అధ్యక్షులు మూల మల్లికార్జునరెడ్డి, ప్రొఫెసర్ వినోదిని, కట్టా నరసింహులు పాల్గొని అభినందనలు తెలిపారు. రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి మాట్లాడుతూ గురజాడ రచనలు చదివి తాను ఎంతో ప్రభావితం అయినట్లు చెప్పారు. కన్యాశుల్కంలోని పాత్రలు అధ్యాపకునిగా తన జీవితాన్ని తీర్చిదిద్దా యన్నారు. కె.సి రాయుడు వందన సమర్పణతో సభ ముగిసింది.



**జనవరి 30న మార్కాపురంలో జరిగిన నెల నెలా వెన్నెల సాహితీ సమావేశంలో త్యాగరాజు కీర్తనలపై ప్రసంగించిన పాంచాలవరపు శ్రీరామచంద్రమూర్తిని సత్కరించిన దృశ్యం. చిత్రంలో (ఎడమ నుంచి) షేక్ నజీర్ అహ్మద్, పావులూరి మల్లికార్జున, తోట శ్రీనివాసరావు, కె.బి. లివింగ్‌స్టన్, ఎ. వీరారెడ్డి, జి.వి.ఎల్. రమేష్‌బాబు, ఓరుగంటి మల్లిక్, కె. మధుసూదనశాస్త్రి, ఎం.వి. సుబ్బారావు, ఆచారి, మంత్రి కృష్ణమోహన్**




**ఫిబ్రవరి 6న తాండూరులో జి. రామకృష్ణరాజు "మొగలి రేకులు" కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న డా॥ ద్వానా శాస్త్రి, వేదికపై నరేందర్‌రెడ్డి, కొండ్రెడ్డి, డా॥ అద్దేపల్లి రామ్మోహన్‌రావు, ముఖ్య అతిథి నేటి నిజం సంపాదకులు బైస దేవదాస్, ఎం.కె. సుగంబాబు తదితరులు**

## గమనిక

డైరీ కాలమ్‌కి సాహిత్య వార్తలు పంపేవారు క్లుప్తంగా రాసి పంపాలి ✦ సభలో పాల్గొన్న వారందరి పేర్లు రిపోర్టులో రాయకూడదు ✦ ఆలస్యమైన వార్తల్ని పంపించకూడదు ✦ తాజా వార్తలకే ప్రచురణకు అవకాశం ఉంటుంది ✦ మాకు చేరుతున్న కొన్నింటిలో తేదీలు రాయడం లేదు ✦ ఫొటో వెనుక తప్పని సరిగా ఆ కార్యక్రమం జరిగిన తేదీ, ప్రాంతం, జిల్లా పేర్లు రాయాలి.

# తెలుగు భాష ఔన్నత్యం



జనవరి 31న చెన్నైలో సర్ త్యాగరాయ కాలేజ్, ఆంధ్ర విజ్ఞాన సమితి ఆధ్వర్యంలో జరిగిన సాహిత్య కార్యక్రమంలో (కుడి నుండి ఎడమకు) డా॥ డి. సుబ్రహ్మణ్యరాజు, గుడిమెట్ల చెన్నయ్య, జి.ఎ. రాజకుమార్, పి. సుబ్రహ్మణ్యం

పరభాష మేధావుల ప్రశంసలు పొందింది తెలుగు ఒక్కటేనని, అంతటి ప్రాశస్త్యమైన ఆ భాష ఔన్నత్యం అజరామరమని తమిళనాడు సిమెంట్స్ సిఎండీ, ప్రముఖ ఐఏఎస్ అధికారి రాజ్‌కుమార్ పేర్కొన్నారు. చెన్నై పాత చాకలిపేటలోని సర్ త్యాగరాయ కళాశాల, ఆంధ్ర విజ్ఞాన సమితి ఆధ్వర్యంలో కళాశాల ప్రాంగణంలో జనవరి 31న సారస్వత సభ నిర్వహించారు. ముఖ్య అతిథిగా వచ్చిన రాజ్‌కుమార్ మాట్లాడుతూ తెలుగుభాష ఔన్నత్యాన్ని శ్లాఘించారు. పరభాష మేధావులు సైతం తెలుగు భాష సౌందర్యానికి ముగ్ధులయ్యారని పేర్కొన్నారు. తమిళనాడులో ఉన్న తెలుగు వారు ఉపాధి కోసం వారి భాషను గౌరవించడంలో తప్పులేదని, కానీ మాతృభాషను మాత్రం విస్మరించకూడదని హితవు పలికారు. తెలుగు మాధ్యమంలో విద్యనభ్యసించినవారు మద్రాసు నగరంలో ఎంతోమంది ఉన్నత స్థానంలో ఉన్నారని తెలిపారు. అయితే తెలుగు మాధ్యమంలో చదువుకున్న వారికి అవకాశాలు రావని చెప్పడం మూర్ఖత్వం అనిపించుకుంటుదని అన్నారు. తెలుగువారు ప్రపంచ దేశాల్లో ఎక్కడున్నా మనమంతా తెలుగువారం అనే భావన కలిగి ఉండాలని కోరారు. తెలుగు భాషను, దాని గొప్పతనాన్ని నేటి విద్యార్థులే చాటి చెప్పాలని పిలుపునిచ్చారు. మాతృభాష పట్ల మమకారం, ప్రేమ ఉన్నవాడు ఎప్పటికైనా ఉన్నత స్థానానికి ఎదుగుతాడని పేర్కొన్నారు. ఏదేమైనా పొరుగు రాష్ట్రంలో తెలుగు విద్యార్థులకు తెలుగు సాహిత్యంపై అవగాహన తీసుకువచ్చే దిశగా ఆంధ్ర విజ్ఞాన సమితి సారస్వత సభను నిర్వహించడం ప్రశంసనీయమని అభినందించారు. జనని సాంస్కృతిక సమితి ప్రధానమైన కార్యదర్శి గుడిమెట్ల చెన్నయ్య మాట్లాడుతూ కూటి కోసం కోటి విద్యలు అన్నట్లు బతకడానికి మనమెన్ని భాషలు నేర్చుకున్నా తప్పులేదు కాని మాతృభాషను మరచిపోకుండా ఉండాలని సూచించారు. తమిళనాడు సాహిత్యరంగంలో అగ్రగణ్యుడిగా చెప్పుకునే భారతీయార్ సైతం తెలుగు భాషను సుందర తెలుంగ అని కొనియాడారని గుర్తు చేశారు. కార్యక్రమంలో భాగంగా కళాశాల విద్యార్థులకు వక్తృత్వ, వ్యాసరచన పోటీలు నిర్వహించి విజేతలకు బహుమతులు ప్రశంసాపత్రాలు అందించారు. తమిళనాడు తెలుగు సాంస్కృతిక సంఘం అధ్యక్షులు తమ్మినేని బాబు, మద్రాసు తెలుగు అభ్యుదయ సమాజం ఉపాధ్యక్షుడు బాలకృష్ణ తదితరులు పాల్గొన్నారు. కళాశాల తెలుగు విభాగం అధ్యక్షుడు డాక్టర్ ఈశ్వరయ్య వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

# 'నెమలీక' పుస్తకం ఆవిష్కరణ సభ



ఓరుగంటి పురుషోత్తం 'నెమలీక' కవితా సంపుటి ఆవిష్కరణ సభ

జనవరి 23న పెన్షనర్స్ భవన్, నల్గొండలో యువ రచయిత సమితి నల్గొండ వారి ఆధ్వర్యంలో ఓరుగంటి పురుషోత్తం 'పుస్తకంలో నెమలీక' కవితా సంపుటి ఆవిష్కరణ జరిగింది.

సభకు ప్రముఖ కవి వేణు సంకోజు అధ్యక్షత వహించారు. బహుభాషావేత్త డా॥ నోముల సత్యనారాయణ ఆవిష్కరించారు. ముఖ్య అతిథిగా ప్రఖ్యాత కవి డా॥ అమ్మంగి వేణుగోపాల్ పాల్గొన్నారు. ప్రముఖ కవి సంగీతకారుడు డా॥ ఎం. పురుషోత్తమాచార్య, రచయిత మూటుపూరి క్రిష్ణమూర్తి సమీక్షలు చేశారు. మేరెడ్డి యాదగిరి సమావేశ కర్తగా వ్యవహరించారు.

తెలంగాణ జాగృతి జిల్లా కన్వీనర్ వేణు సంకోజు మాట్లాడుతూ సాహిత్య రచనల్లో ఒక గడియారం చోటు చేసుకుని ఉంటుందని ఈ ఏం ఫాస్టర్ గుర్తు చేశాడని, అదేవిధంగా పుస్తకంలో నెమలీక అంటే మనిషిలో బాల్యం అని పురుషోత్తం నిరూపించారని కొనియాడారు. ప్రతి కవితలో ఒక ఆర్తీ, భాషా సౌందర్యం హుందాతనం కన్పిస్తుందన్నారు.

ఈ కార్యక్రమంలో రచయితలు డా॥ బోయ జంగయ్య, కొలనుపాక మురలీధర్‌రావు, ఎన్.కె. రామారావు, డా॥ వసంతరావు, కె. రామలింగం, డా॥ అక్కెనపల్లి సుధాకర్‌రావు, డా॥ బెల్లియాదయ్య మొదలగువారు పాల్గొన్నారు. ఆహుతులంతా ఓరుగంటి పురుషోత్తంకు అభినందనలు తెలియజేశారు. చివరగా జిల్లా రచయితల సంఘం కార్యదర్శి పున్న అంజయ్య వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

# "జహీరాబాద్ పిల్లల కథలు" పుస్తకావిష్కరణ




ఫిబ్రవరి 3న జరిగిన 'జహీరాబాద్ పిల్లల కథలు' ఆవిష్కరణ సభలో చుక్కా రామయ్య

పిల్లల్లో ప్రశ్నించే తత్వాన్ని పెంపొందించినప్పుడే సమాజాభివృద్ధికి నిజమైన మార్గం ఏర్పడుతుందని ప్రముఖ విద్యావేత్త, శాసనమండలి సభ్యులు చుక్కా రామయ్య అన్నారు. ఫిబ్రవరి 3న మన లైబ్రరీ, జహీరాబాద్ ఆధ్వర్యంలో జరిగిన "జహీరాబాద్ పిల్లల కథలు" పుస్తకావిష్కరణ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన వారు మాట్లాడారు. జహీరాబాద్ ప్రాంతం నాలుగు భాషల కలయికతో భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీకగా నిల్చిందన్నారు. ఇటువంటి వైవిధ్యాన్ని, సామరస్యాన్ని విద్యార్థులలో కూడా నెలకొల్పాలని అన్నారు. కథా రచన పిల్లలలో మానసిక వికాసానికి, ఉన్నత విలువలు ఏర్పరచుకోవడానికి దోహదం చేస్తుందన్నారు. పిల్లలకు బాల్యం నుండే ప్రశ్నించే తత్వాన్ని అలవర్చడం ద్వారా శాస్త్ర విజ్ఞాన, సాంకేతికాభివృద్ధికి దోహదం చేయవచ్చని అన్నారు. ప్రశ్నించే తత్వాన్ని అణగదొక్కే స్వభావం నేటి సమాజంలో పాలకవర్గాల ద్వారా ప్రజలకు కూడా సంక్రమిస్తోందని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. పిల్లలకు స్కూలున్నా, ఉపాధ్యాయులున్నా భయం లేకుండా స్వేచ్ఛగా ఉన్నప్పుడే వారి పూర్తి అభివృద్ధి సాధ్యమన్నారు. బట్టీపట్టడం పద్ధతుల్లో సాగుతున్న నేటి చదువులు అందుకు సహకరించడం లేదన్నారు. శాస్త్ర పరిజ్ఞాన అభివృద్ధికి అంకురం బాల్యంలో ప్రశ్నించే తత్వాన్ని అలవర్చుకోవడమేనన్నారు. అందుకు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు సహకరించాలన్నారు. ఇటువంటి కథారచనలు పోటీలు నిర్వహించి, పిల్లల కథల పుస్తకాన్ని ప్రచురించినందుకు మన లైబ్రరి నిర్వాహకులను ఆయన అభినందించారు. అనంతరం "జహీరాబాద్ పిల్లల కథలు" పుస్తకాన్ని చుక్కారామయ్య ఆవిష్కరించారు. ఈ కార్యక్రమానికి మన లైబ్రరి అధ్యక్షులు ఐ. ప్రతాప్ కుమార్ అధ్యక్షత వహించారు. మన లైబ్రరి కార్యదర్శి కె. విఠల్ ముందుగా వేదిక మీదికి ఆహ్వానితులను ఆహ్వానించారు. ఈ సభలో మన లైబ్రరి వ్యవస్థాపక అధ్యక్షులు డా॥ ఎ. విజయలక్ష్మి ప్రసంగిస్తూ చదువులు గుదిబండలుగా మారి, మానసిక వికాసానికి మార్గం లేకుండా పోతున్న ఈ రోజుల్లో పిల్లలో ఇతర నైపుణ్యాలను వెలికితీసి ప్రోత్సహించాలన్న ఉద్దేశంతో మన లైబ్రరి ఇటువంటి కార్యక్రమాలు చేబడుతున్నదని వివరించారు. ఇందుకు సహకరించిన తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, ఇతర మేధావులకు ధన్యవాదాలు తెలియజేశారు. ఈ సభలో జహీరాబాద్ పిల్లల కథలు పుస్తక సంపాదకులు, జనవిజ్ఞాన వేదిక రాష్ట్రకమిటీ సభ్యులు డా॥ శివబాబు మాట్లాడుతూ ఇటువంటి పుస్తక ప్రచురణ భవిష్యత్‌లో స్థానికంగానే చేయాలన్న ఉద్దేశంతో ఉన్నట్లు తెలిపారు. జహీరాబాద్ డిప్యూటీ తహసీల్దార్ రాజేందర్ మాట్లాడుతూ ఇటువంటి పుస్తకావిష్కరణ పిల్లల్లో ఎంతో ఉత్సాహాన్ని నింపి, భవిష్యత్‌లో మరింతమంది రచయితలు ఏర్పడడానికి దోహదం చేస్తుందన్న ఆశాభావం వ్యక్తం చేశారు. మన లైబ్రరి కార్యదర్శి కె. విఠల్ వందన సమర్పణ గావించారు. సభలో కథలు రచించిన 35 మంది పిల్లలను చుక్కారామయ్య అభినందించి పుస్తకప్రతులను అందజేశారు. ఈ సభలో పట్టణంలోని 10 స్కూల్స్ మరియు దిగ్వాల్ ఎ.పి.ఆర్.ఎస్‌కు చెందిన దాదాపు 300మంది విద్యార్థినీ విద్యార్థులు, పలువురు ఉపాధ్యాయులు, ప్రిన్సిపల్స్ రాజుగౌడ్, నర్సిములు, చంద్రశేఖర్‌రెడ్డి, వేణుగోపాల్ తదితరులు పాల్గొన్నారు.

# చిన్ని నారాయణరావు 'మాట' దీర్ఘ కవిత ఆవిష్కరణ

చిన్ని నారాయణరావు రచించిన 'మాట' దీర్ఘకవితా కావ్యం ఆవిష్కరణోత్సవం నెల్లూరు టౌన్‌హాల్‌లో జనవరి 26న జరిగింది. లాయర్ వారపత్రిక సంపాదకులు తుంగా శివప్రభాత్‌రెడ్డి 'మాట'ను ఆవిష్కరించారు. కవి డా॥ భీర సుందరరావు 'మాట'ను సమీక్షించారు. కవి దర్భశయనం శ్రీనివాసాచార్య అతిథిగా పాల్గొన్న ఈ సభకు ప్రముఖ సినీ రచయిత వెన్నెలకంటి అధ్యక్షత వహించారు. నెల్లూరు ఎమ్మెల్యే ముంగమూరి శ్రీధర్ కృష్ణారెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసారు. నెల్లూరు జిల్లా రచయితల సంఘం కవి చిన్ని నారాయణరావును సత్కరించింది.



జనవరి 26న నెల్లూరు టౌన్‌హాలులో చిన్ని నారాయణరావు దీర్ఘకవిత 'మాట'ను ఆవిష్కరిస్తున్న 'లాయర్' వారపత్రిక సంపాదకులు తుంగా శివప్రభాత్‌రెడ్డి, సినీ కవి వెన్నెలకంటి, దర్భశయనం, నెల్లూరు శాసనసభ్యులు ముంగమూరు, చిన్ని నారాయణరావు (రచయిత)



జనవరి 26న త్యాగరాయగానసభలో జరిగిన 'మంచిమాట' పుస్తకావిష్కరణ సభలో ప్రసంగిస్తున్న నేటి నిజం సంపాదకులు బైస దేవదాస్, వేదికపై దీక్షితులు, ద్వానా శాస్త్రి, డా॥ మసన చెన్నప్ప, పి. సుబ్బారావు, రచయిత పులివర్తి




ఫిబ్రవరి 6న తాండూరులో జరిగిన సభలో "రాగం పరాగమైన వేళ...లో ఊపిరి సంతకం" కవితా సంపుటి ఆవిష్కరణ సభలో పాల్గొన్న ముఖ్య అతిథి, నేటి నిజం సంపాదకులు బైస దేవదాస్, పి. లక్ష్మారెడ్డి, ఎం.కె. సుగంబాబు, ఆవిష్కర్త ప్రిన్సిపాల్ డా॥ టి వరలక్ష్మి, మాకినేని సూర్యభాస్కర్, రచయిత కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి



'పిట్ట కొంచెం - కూత ఘనం' పుస్తక ఆవిష్కరణ సభలో (ఎడమ నుండి కుడికి) బి. అనంతరావు - జన విజ్ఞాన వేదిక రాష్ట్ర కార్యదర్శి, గోపు చంద్రరావు - తెలుగు పండిట్, జ్యోస్యుల కృష్ణబాబు - పద్యకవి, అద్దేపల్లి రామమోహనరావు - ప్రముఖ కవి, విమర్శకులు, యాసలపు సూర్యారావు - 'పిట్టకొంచెం- కూత ఘనం' పుస్తక రచయిత, అద్దేపల్లి ప్రభు - కవి, కథకులు, గద్దే పచ్చలరావు - అభ్యుదయ కళాపరిషత్ అధ్యక్షులు



రవీంద్రభారతి మినీహాల్‌లో ఎం.ఆర్.వి. సత్యనారాయణ రచించిన కథల సంపుటి 'ఆమె గెలిచింది' ఆవిష్కరణ సభకు హాజరైన సాహితీ ప్రముఖులు విహారి, జగన్నాథ శర్మ, సతీష్ చందర్, పి.వి. సునీల్ కుమార్, డా॥ కె. రామచంద్రరాజు, రచయిత ఎం.ఆర్.వి. సత్యనారాయణ, కార్యదర్శి శ్రీమతి రాజేశ్వరి



కవి సంధ్య ఆధ్వర్యంలో జరిగిన సభలో 'ఆశారాజు కవితా వైభవం' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ప్రముఖ కవి కె. శివారెడ్డి. చిత్రంలో నాళేశ్వరం శంకరం, ఆశారాజు, శిఖామణి, గ్రంథ రచయిత సౌభాగ్య, డా॥ సి. మృణాళిని



జనవరి 29వ తేదీన హైదరాబాద్‌లోని జి.వి.ఆర్. ఆరాధన సంస్థ ఆధ్వర్యంలో పోటీ పరీక్షలలో 'తెలుగు వెలుగు'గా డా॥ ద్వానాశాస్త్రిని సత్కరిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి, సాంస్కృతిక శాఖ సంచాలకులు డా॥ ఎం. కాంతారావు, ఐపిఎస్, చిత్రంలో డా॥ వోలేటి పార్వతీశం, సి. రామకృష్ణ, జి.వి.రెడ్డి

# దర్భశయనం శ్రీనివాసాచార్యకు డా॥ నాగభైరవ అవార్డు

ప్రముఖ కవి దర్భశయనం శ్రీనివాసాచార్య రచించిన 'నేలగంథం' వచన కవిత్వానికి డా॥ నాగభైరవ అవార్డు-2010 లభించింది. ఆయనకు ఈ అవార్డును జనవరి 26, బుధవారం నెల్లూరు టౌన్ హాల్లో జరిగిన సభలో బహుకరించబడింది. 25వేల నగదుతో బాటు సత్కారాన్ని నెల్లూరు ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి చేతుల మీదుగా అవార్డు ప్రదానం జరిగింది. ఆనాటి సత్కార కార్య క్రమంలో డా॥ నాగభైరవ అవార్డు కమిటీ అధ్యక్షులు ప్రముఖ సినీ కవి వెన్నెలకంటి, ప్రధాన కార్యదర్శి చిన్ని నారాయణ రావు పాల్గొన్నారు.



జనవరి 26న నెల్లూరు టౌన్‌హాలులో 'దర్భశయనం'కు నాగభైరవ అవార్డు బహూకరిస్తున్న ప్రముఖ సినీ రచయిత వెన్నెలకంటి. నెల్లూరు రీజియన్ స్టేట్‌బ్యాంక్ రీజనల్ మేనేజర్ కె. రామేశ్వరరావు, నెల్లూరు ఎంఎల్ఏ ముంగమూరు శ్రీధర కృష్ణారెడ్డి, చిన్ని నారాయణరావు

# కిన్నెర - కొవ్వలి సాహితీ పురస్కారాలు

## వెయ్యి నవలల కొవ్వలి శతజయంతి సందర్భంగా

తెలుగులో వెయ్యి నవలలు రాసి, ఒకనాడు గొప్ప సంచలనం కలిగించిన కీ॥శే॥ కొవ్వలి లక్ష్మీనరసింహారావు శతజయంతి జూలై 1వ తేదీన శ్రీ త్యాగరాయగానసభలో జరుగుతుందని కిన్నెర ఆర్ట్ థియేటర్స్ కార్యదర్శి మద్దాళి రఘురామ్ తెలిపారు. ఈ సందర్భంగా ఉత్తమ నవలకు రూ. 10,000/- కిన్నెర - కొవ్వలి సాహితీ పురస్కారం ఇవ్వబడుతుంది. 2009, 2010 సంవత్సరములలో ముద్రితమైన నవలలను మే 1వ తేదీ లోపు "డా॥ ద్వానా శాస్త్రి, ఆర్చీజ్ నెస్ట్, 1-1-428, గాంధీనగర్, హైదరాబాద్-500 080, సెల్ : 98492 93376" చిరునామాకు పంపవలసిందిగా కోరుతున్నాము. జూలై 1వ తేదీ కొవ్వలి శతజయంతి సభలో పురస్కార ప్రదానం చేయబడును.

# "ప్రవాసాంధ్రుల" రచనలకు ద్వానాశాస్త్రి సాహితీ పురస్కారం

ప్రముఖ కవి, విమర్శకులు డా॥ ద్వానా శాస్త్రి 64వ జన్మదినోత్సవం సందర్భంగా ప్రవాసాంధ్రులు రచించిన సాహిత్య విమర్శకి సంబంధించిన వ్యాస సంపుటాలను, గ్రంథాలను లేదా సాహితీపరమైన సిద్ధాంత వ్యాసాలను 2008, 2009, 2010లో ప్రచురింపబడిన వాటిని రెండేసి ప్రతులను ఏప్రిల్ 30 లోపు శ్రీ జి. రవికిరణ్, నిర్వాహకులు, ఆర్చీజ్ నెస్ట్, 1-1-428, గాంధీనగర్, హైదరాబాద్-500 080 చిరునామాకు పపంవలసిందిగా కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ కార్యదర్శి మద్దాలి రఘురామ్ ఒక ప్రకటనలో కోరారు. ఉత్తమమైన రచనలకు రూ. 5000/-, కిన్నెర ఆర్ట్ థియేటర్స్ నిర్వహణలో ద్వానా శాస్త్రి పురస్కారం జూన్ 15వ తేదీ శ్రీ త్యాగరాయగానసభలో బహూకరించబడుతుందని తెలిపారు. ఇతర వివరాలకు 9849293376 ద్వారా సంప్రదించగలరు.




ఫిబ్రవరి 6న తాండూరులో జరిగిన సభలో ద్వావరి నరేందర్‌రెడ్డి రచన 'హంసధ్వని' కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న ముఖ్య అతిథి, నేటి నిజం సంపాదకులు బైస దేవదాస్, వేదికపై కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి, డా॥ అద్దేపల్లి రామ్మోహనరావు, డా॥ ద్వానా శాస్త్రి, పి. లక్ష్మారెడ్డి, రచయిత ద్వావరి నరేందర్‌రెడ్డి



మచిలీపట్నం 30వ వార్షికోత్సవం సందర్భంగా శైలజామిత్ర రచించిన "అగ్నిపూలు" ఆవిష్కరణ, మినీ కవితా ప్రతిభా పురస్కారాన్ని అందిస్తున్న సాహితీ ప్రముఖులు డా॥ రావి రంగారావు, జిల్లా పరిషత్ ఛైర్మన్ కె. నాగేశ్వరరావు, బీరం సుందరరావు, చలపాక ప్రకాష్ తదితరులు

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# మహాకవి శ్రీశ్రీ స్మృతిలో...



మత కలహాల మారణ హోమాల మధ్య
1947 ఆగస్టు 14-15 అర్ధరాత్రి
ఆవిర్భవించిన స్వాతంత్ర్యం
అవినీతిని భారీ పరిశ్రమ చేసింది
ఆకలికి సార్వభౌమాధికారం ఇచ్చింది
ధనస్వామ్యానికి ప్రజాస్వామ్యం అని పేరు పెట్టి
పేదవాళ్లని మరింత పేదలనే చేసింది

ఇంకా ఈ స్వాతంత్ర్యం ఏమిటి ఒరగ బెట్టింది?
ఆకలి చావులు, దళితుల దహనాలు
అప్పుడప్పుడు నరబలులు
వైజ్ఞానికుల ఆత్మహత్యలు

ఈ స్వాతంత్ర్యంలో
బాగుపడిన వాళ్ళు పదిమంది ఉంటే
బాధపడుతున్న వాళ్ళు పదివేల మంది
ఈ బాధల స్వభావాన్ని
బహిరంగపరచడమే నిజాయితీగల
ఈనాటి కవుల ఏకైక కర్తవ్యం

## కోగంటి సత్యనారాయణ (సత్యం)

ప్రముఖ పారిశ్రామికవేత్త, విజయవాడ,

SAHITY PRSV1402A125 RNI No.APTEL/2004/18396 Postal Regd. No.H/SD/415/10-12





**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P.) Ph: 040-27660013, Cell: 9490099059



| | |
|---|---|
| మనసు ఫౌండేషన్ | |
| పుస్తకాల పరిశీలనాపట్టిక | |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A125 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |